The Largest Circulated Telugu Monthly

# చతుర

జూన్ 1993
రూ.5/-



కాళ్లకూరి కృష్ణ
టీనేజ్

చ్చు తీసే పనిలేదు.  ముక్కలు తరగక్కర్లేదు. 

శుభ్రం చేసే శ్రమలేదు.  నూరుకునే భారంలేదు.

ఒక్క క్షణం కూడా వృధాకాదు!

ఏ వేళనైనా - ఏ వంటకానికైనా 

మీకోసం సంసిద్ధం.

స్వచ్ఛమైన - శుద్ధమైన

ప్రియ అల్లం వెల్లుల్లి

మిశ్రమం.




తిరుగులేని నాణ్యత కోసం
తాజా పరిమళపు ఘుమ ఘుమలకోసం
'ప్రియ' అల్లం వెల్లుల్లి మిశ్రమం.

ఎలాంటి కృత్రిమ పదార్థాలు మచ్చుకైనా లేవు. నూటికి నూరుపాళ్ళు ప్రకృతి సిద్ధంగ తయారైన సహజ మిశ్రమం.

**priya**

…రియా ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,
(ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాదు - 500 482

# నేరమయ ప్రపంచం

## 'వేలిముద్ర' కథ

ఓ మంత్రిగారు తన పుత్రరత్నంతో "చదువుల కోసం అంత హైరానా ఎందుకురా పిచ్చి సన్యాసీ, నాకు సంతకమయినా రాదు, వేలిముద్రలతోనే వెలిగిపోవడం లేదూ?" అన్నారట. ఇలా వ్యంగ్యోక్తులు రావడానికి ప్రధాన కారణం సరస్వతికి బహుదూరపు బంధువులు కూడా ప్రముఖులయిపోతూ వుండడమే. కనీసం సంతకం కూడా చేయలేనివారికి వేలిముద్రలే శరణ్యం.




ప్రపంచంలో తొలిసారిగా వేలిముద్రలని పరిచయం చేసి, ప్రచారంలోకి తెచ్చింది, తద్వారా నేరస్థులని కనిపెట్టవచ్చని తెలిపినదీ చైనీయులే. అలాగే ఏ ఇద్దరి వ్యక్తుల వేలిముద్రలూ ఒక రకంగా వుండవని పేర్కొన్నది కూడా వీరే.

5,000 కోట్ల వ్యక్తుల్లో ఓ ఇద్దరి వేలిముద్రలు మాత్రం ఒకేరకంగా వున్నప్పటికీ అందులో కూడా నిశితంగా చూస్తే వెంట్రుకవాసి భేదమయినా తప్పదని ఆధునిక శాస్త్రం రుజువు చేస్తోంది.

శ్రద్ధాసక్తులుంటే నుదుటి రాతలైనా మార్చుకోగలం కానీ వేలిముద్రలు మాత్రం మార్చలేమని డాక్టర్ హెన్రీబోల్ట్స్, సర్ విలియం హార్చెల్ పరిశోధనలు జరిపి తెలియజెప్పారు. విలియం 1833 నుండి 1917 వరకూ పశ్చిమ బెంగాల్‌లో వున్న కాలంలో వేలిముద్రలపై చేసిన పరిశోధన గణనీయమైనది.

1858 నాటికి ప్రపంచవ్యాప్తంగా అనేక సంస్థలు సంతకం చేయలేనివారి వేలిముద్రలు స్వీకరించడం ప్రారంభించాయి.

1891లో తొలిసారిగా అర్జెంటీనా పోలీసులు వేలిముద్రల ఆధారంతో నేరస్థులని గుర్తించే విధానాన్ని రూపొందించారు. 1901 నాటికి ఈ

---

**కవర్‌ఫోటో** పున్నా కృష్ణమూర్తి

---

పద్ధతి మరింత అభివృద్ధి సాధించింది. సర్ ఎడ్వర్డ్ హెన్రీ ఇందులో విస్తృత పరిశోధన జరిపారు. క్రమంగా ప్రపంచంలోని అన్ని పోలీసు శాఖలూ వేలిముద్రల విధానాన్ని అమలు పరిచాయి.

ప్రపంచంలో అత్యధిక సంఖ్యలో 17 కోట్లకి పైగా నేరస్తుల వేలిముద్రలు సేకరించిన దేశం అమెరికా. 1903లో న్యూయార్క్ నగర జైలులో నేరస్తుల వేలిముద్రలు తీసుకోవడం ప్రారంభించారు.

1882 వరకూ ఫోర్జరీలు ప్రబలంగా వుండేవి. మెక్సికన్లు 1883లో తొలిసారిగా వేలిముద్రల ఆధారంతో దీనిని నివారించవచ్చని నిర్ధారించారు.

ప్రస్తుతం మన దేశంలోని దాదాపు అన్ని జైళ్లలోనూ నేరస్తుల వేలిముద్రలు తీసుకుంటున్నారు.

## ఉత్తరాల ద్వారా పెళ్ళి

'పెళ్ళి చేయడమంటే సామాన్యమా? ఏడుతరాల చరిత్రలు, చదువు, సంప్రదాయం, కుల గోత్రాలు, కట్నకానుకలు అన్నీ చూడాలి. ఏడు జతల చెప్పులరగందే పెళ్ళి కుదుర్తుందా?' అని పెద్దలు ఇప్పటికీ అనడంలో అతిశయోక్తి లేదేమో! మనం పెళ్ళికిచ్చే విలువ అలాంటిది. కలకాలం కలసి బతకాలి కాబట్టి అన్ని జాగ్రత్తలు తీసుకోవాలని దీని భావం.

అయితే ఇందుకు పూర్తి విరుద్ధంగా బెంగాల్‌కు చెందిన పంపా బెనర్జీ ఒక్కసారయినా చూడకుండానే, కలుసుకోకుండానే ఎక్కడో అమెరికాలో వున్న మెక్ డోనాల్డ్‌ని వివాహమాడింది.

కాలేజీ విద్యార్థిని అయిన పంపా పాప్ మ్యూజిక్ అంటే చెవులు కోసుకుంటుంది. 39 మీటర్లపై మంగళ, బుధ, గురు వారాల్లో ప్రసారమయ్యే "నౌ మ్యూజిక్ యు.ఎస్.ఏ"ని ఆమె తప్పక వినేది. పాప్ సింగర్ల ఇంటర్వ్యూలలో డిస్క్ జాకీ రే మెక్ డోనాల్డ్ స్వరం ఆమెని బాగా ఆకర్షించింది.

ఒకరోజు పంపా రే పేరున వాషింగ్‌టన్ చిరునామాకి **ఉత్తరం** రాసింది. **మూడు వారా**ల్లో అతని నుండి సమాధానం వచ్చింది. అలా ప్రారంభమయిన వారి పెన్ ఫ్రెండ్‌షిప్ వివాహానికి దారి తీసింది.




మంచి సాంప్రదాయ కుటుంబంలో పుట్టిన పంపా ముక్కూమొహం తెలియని విదేశీయు

ణ్ణి చేసుకోవడం ఆమె కుటుంబ సభ్యులకి తొలుత భయాందోళనలు కలిగించినప్పటికీ రే మెక్‌డోనాల్డ్ స్వయంగా భారతదేశం వచ్చి అన్ని విషయాలూ చర్చించినపుడు వారి మనసులు కుదుటపడ్డాయి. మొదట రిజిష్టర్ మారేజ్ చేసుకున్నప్పటికీ పెద్దల కోరిక మేరకు రే ధోవతీ, కుర్తా ధరించి హిందూ సాంప్రదాయబద్ధంగా తిరిగి పీటల మీద కూర్చుని తాళి కట్టాడు. రే తల్లిదండ్రులు ఫోను ద్వారానే తమ దీవెనలు అందజేశారు. కొద్ది రోజులలోనే భార్యతో సహా ఆ కుటుంబ సభ్యులందరి అభిమానం చూరగొన్నాడు రే.

సాంప్రదాయ కుటుంబంలో పుట్టి పెరిగిన పంపా ప్రేమ కథ కేవలం ఉత్తరాల ద్వారానే పెళ్ళిదాకా ఎలా వెళ్ల గలిగిందనే ప్రశ్నకి సమాధానంగా ఆమె ''మేం కలుసుకోకపోయినా ఫొటోలు చూసుకున్నాం. అన్నిటికంటే ముఖ్యమైనది మాటల్లో చెప్పలేని అనేక భావాలు రాత పూర్వంగా ప్రకటించగల్గుతాము. అందుకే మేమంత సన్నిహితం కాగలిగాం'' అంది. రే నవ్వుతూ ''నా జీవితంలో ఇలాంటి సంఘటన జరుగుతుందని ఎన్నడూ అనుకోలేదు. జీవితాంతం పంపాతో సంతోషంగా గడపాలని వుంది'' అన్నారు.

పిల్లలంతా ఇలా పెద్దల ప్రమేయం లేకుండా పెళ్ళిళ్ళు చేసుకోగల్గితే పెద్దలకి బోలెడు ఖర్చూ, ప్రయాసా తగ్గుతాయి కదా!

## హృదయ స్పందనలు

రోగిని ఆస్పత్రికి తీసుకువెళ్ళినపుడు స్టెతస్కోపుతో గుండెకొట్టుకునే వేగాన్ని డాక్టరు పరీక్షించటం సర్వసాధారణం. డాక్టరు దగ్గరికి వెళ్ళకుండా రోగి ఇంట్లోనే ఉండి టెలిఫోను ద్వారా తన హృదయ స్పందనల్ని డాక్టరుకి చేరవేయటం నూతన ప్రక్రియ. దీనిని బట్టే డాక్టర్లు రోగికి కావలసిన మందులు నిర్ణయించి సరైన చికిత్స చేస్తున్నారు.

ఈ ఎలక్ట్రోకార్డియోగ్రాంను నేషనల్ యూనివర్సిటి హాస్పిటల్‌వారు రూపొందించారు. గుండె చప్పుళ్ళను వినిపించే అద్భుతమైన టెలిఫోను వలన ఇంట్లో రోగి ఉండి హాస్పిటల్లోని డాక్టరు చేత పరీక్ష చేయించుకోవచ్చును.

ఒక నిముషానికి 60 నుండి 100 సార్లు వరకు గుండె ప్రకంపించటం సర్వసాధారణం. కాని అధికంగానో తక్కువగానో వుండేవారికి చికిత్స అత్యవసరం. నేషనల్ యూనివర్సిటీ హాస్పిటల్‌లో మెడిసిన్ డిపార్టుమెంటులో కార్డియాలజీ శాఖాధిపతి ప్రొఫెసర్



ఛియాబూన్‌లాక్ గాడ్జెట్‌ను గురించి వివరించారు. ఎలాస్టిక్‌తో చేయబడిన రెండు స్ట్రాపులను రోగిమణికట్టుకి చుడతారు. వీటి నుండి వైర్లను ఒక పరికరంలోకి ప్లగ్ చేస్తారు. హాస్పిటల్‌కి డయల్ చేస్తే చాలు, రోగి హృదయ స్పందనలు మెషీను ద్వారా అక్కడ రికార్డవుతాయి. సంయుక్త రాష్ట్రాల్లో, బ్రిటన్‌లో యూరప్‌లో ఈడయగ్నోస్టిక్ పరికరం ఇదివరకే వాడుకలో ఉందని ప్రొఫెసర్ ఛియా అన్నారు.

విదేశాల్లో ఉన్న రోగుల గుండె స్పందనల్ని కూడా దీని సాయంతో వినవచ్చు. ఇ.సి.జి. పరీక్ష చాలా సులభంగా బ్రునైలో జరుపబడిందని చెప్పారు ఛియా.

రోగిని పరీక్షిస్తే రెండు నిముషాల్లోనే ఫలితాలు వెల్లడవుతాయి. సంయుక్త రాష్ట్రాల్లో, బ్రునైలో వీటి సంఖ్య పెంచి ప్రజలకు మరింత సౌకర్యవంతంగా వైద్యచికిత్స అందించాలని ఆస్పత్రి వర్గాలు ప్రయత్నిస్తున్నాయి.

---

## భిన్నదృక్పథం

ఈతరం వారు వేదాలనీ, పురాణాలనీ పరిహసించడం పెద్ద ఫాషనై పోయింది. పొరుగింటి పుల్లకూర రుచి అనే సామెత ఇలాంటివాళ్లని చూసే పుట్టిందేమో. కొందరికి ఏదయినా విదేశీయమైతేనే నచ్చుతుంది.




అయితే తమిళనాడులోని దేవక్కొట్టైకి చెందిన 20 ఏళ్ల శ్రీనివాసన్ ఇందుకు పూర్తి భిన్నమైనవాడు. అన్నామలై కళాశాలలో బి.ఎస్.సి. పూర్తి చేసి తను వంశాచారం ప్రకారం భువనేశ్వరీ ఆలయంలో అర్చకత్వం స్వీకరించాడు. ఆధ్యాత్మిక గ్రంథాల పట్ల మిక్కుటమైన ఆసక్తిగల శ్రీనివాసన్ "నాకు చిన్నప్పటి నుండీ కంబ రామాయణం, మహాభారతం, సుందర పురాణం మొదలైన ప్రాచీన గ్రంథాలపట్ల ఆసక్తి వుండేది. పోస్ట్ గ్రాడ్యుయేషన్ పట్ల నాకు శ్రద్ధ లేకపోయింది. అందరి కంటే కొంత భిన్నంగా వుండాలనేది నా దృక్పథం. అందుకే ఈ సాహితీరంగాన్ని ఎంచుకున్నాను" అన్నారు. అటు అర్చకుడిగా తన నిర్వహణ కొనసాగిస్తూ, ఇటు వేదాంత తర్క సంబంధ ప్రసంగాలు కొనసాగిస్తూ కూడా ప్రస్తుతం కరెస్పాండెన్స్ కోర్సు ద్వారా మధుర కామరాజ్ యూనివర్సిటీలో తమిళ సాహిత్యాన్ని అధ్యయనం చేస్తున్నారు శ్రీనివాసన్. ఇది అన్నివిధాలా తనకు సంతృప్తికరంగా వుందన్నారు.

కళాశాల స్థాయిలో వున్నప్పటి నుండీ డిబే

టింగ్, కవి సమ్మేళనం మొదలైన కార్యక్రమా ల్లో పాల్గొంటున్న శ్రీనివాసన్‌కి స్టేజ్‌ఫియర్ అనేది మచ్చుకయినా లేదు.

త్వరలో శ్రీనివాసన్ ఆదిశంకరాచార్య మీద రచించిన కవితలని 'జ్ఞాన సూర్యం' అనే పేరుతో ప్రచురించబోతున్నారు.

మన ప్రాచీన గ్రంథాలని అర్థం చేసుకో కుండానే అపహాసించటంకన్నా శ్రీనివాసన్ వంటివారిని చూసైనా అసలు అందులో ఏముందో తెలుసుకోవాలనే జిజ్ఞాసని పెంచుకో వడం మంచిది గదా!

---

## షడ్రుచుల సమసంగమం

కోటి విద్యలూ కూటి కొరకే కదా! తినడం అనేది జీవ లక్షణం. పశుపక్ష్యాదులు దొరికిన వాటిని యథాతథంగా తింటే మానవుడు మాత్రం సహజంగానే వాటికంటే మేధావి, విలక్షణుడు కాబట్టి ఆయా పదార్థాలని వచ్యంగా తయారుచేసి, విభిన్న రకాలనీ మేళ వించి మరీ తింటాడు.

మనం తినే ఆహారం షడ్రుచులతో వుంటే మంచిదని ఆరోగ్యశాస్త్రం చెప్తోంది. చేదు, తీపి, పులుపు, ఉప్పు, వగరు, కారం అనే ఆరింటినీ షడ్రుచులంటారు. ఈ ఆరూ శరీరానికి అవస రమే. ఇవన్నీ తగు పరిమాణంలో తీసుకున్నప్పు డే అది ఆరోగ్యప్రదం. ఏది ఎక్కువైనా, తక్కు వైనా అనారోగ్యానికే దారి తీస్తుంది.

మన శరీర నిర్మాణంలో వాత, పిత్త, కఫాలనే మూడు ముఖ్యమైన గుణాలుంటాయి. షడ్రు చుల ప్రభావం వాటిపై అమితంగా పని చేస్తుంటుంది.

కూరగాయలలో గుమ్మడి, టొమాటో, నిమ్మ




క్యాబేజీ, కాకరకాయ, అరటి పువ్వు, ఆకుకూర లు, అల్లం, మిరపకాయ మొదలైనవి ఒక్కో రుచిని కలిగివున్నాయి.

తీపి వాత, పిత్త గుణాలని, ఉప్పు, పులుపు వాత గుణాన్ని, కారం కఫాన్ని అరికడ్తాయి. చేదు సూక్ష్మక్రిములని సంహరిస్తుంది.

ఎక్కువ తీపి తింటే మందబుద్ధి, బద్ధకం ఎక్కువై డయాబిటిస్‌కు దారి తీస్తుంది.

పులుపు పదార్థాలు అధికంగా తీసుకుంటే ఎనీమియాకు దారితీసి, చిక్కిపోవడం జరుగు తుంది.

లవణం ఎక్కువయితే హృద్రోగాలు, చర్మ వ్యాధులు సోకుతాయి.

చేదు ఎక్కువ తింటే టి.బీ., కారం మోతాదు మించితే కడుపులో అల్సర్ మొదలైనవి వస్తాయి.

ఆరోగ్యమే మహాభాగ్యం. మన అవయవాలన్నీ సక్రమంగా వున్నపుడే చేయాలనుకున్నది చేయగల్గుతాం. మరి అవి మన చెప్పుచేతల్లో వుండాలంటే వాటిని గురించి శ్రద్ధ తీసుకోవాలి. ఐస్క్రీం ఇష్టమని అతిగా తినడమో, కాకరకాయ సహించదని వదిలేయడమో చేస్తే ముప్పయ్యేళ్ళకే ముసలితనం గారంటీ.

## గుర్తింపు దొరకని ప్రజ్ఞ

'విద్య నిగూఢగుప్తమగు విత్త'మన్నారుగానీ మేధస్సు సంగతి ఎవరూ చెప్పినట్టులేదు. తెలివితేటలున్నా కేవలం చదువు, డిగ్రీలు లేని కారణంగా తమిళనాడుకు చెందిన గోవిందరాజన్ తన మేధాశక్తితో పొట్టనింపుకుందుకు కూడా అష్టకష్టాలుపడుతున్నాడు. కోయంబత్తూర్ నివాసి గోవిందరాజన్ చిన్నతనం నుంచీ లెక్కల్లో జీనియస్ అని గుర్తింపు పొందాడు. ఓసారి రెండు గంటల లెక్కల పరీక్షని పది నిముషాల్లోనే ముగించిన గోవిందరాజన్ పేపరు చూసి ఇదేదో కాపీ వ్యవహారంలా వుందని అతన్ని చెక్ చెయ్యడం మొదలు పెట్టారు వాచర్లు. ఎక్కడా ఏమీ దొరక్కపోయినా నమ్మక రెండేళ్లపాటు డిబార్ చేసి పడేశారు. అసలే పేదరికం, దానికి తగ్గట్టు చిన్నతనంలోనే తల్లితండ్రులను పోగొట్టుకున్న గోవిందరాజన్‌కి ఆపైన చదువు కొనసాగలేదు అప్పటినుంచీ తన గణితశాస్త్ర పాటవంతో రకరకాల విన్యాసాలు చేస్తూ కాలం గడుపుతున్నాడు. ప్రస్తుతం అతను ఏభయ్యో పడిలో పడ్డాడు.




ఇన్నాళ్లూ అతని గణితశాస్త్ర పరిజ్ఞానాన్ని అనసరానికి వాడుకున్నవాళ్లేగానీ, ఎవళ్లూ అతనికో మంచి ఉద్యోగాన్నిచ్చి గౌరవించిన వాళ్లులేరు. రోటరీ క్లబ్బుల్లోను, కాలేజీలు, స్కూళ్లు మొదలయినచోట్ల గణితానికి సంబంధించిన ప్రదర్శనలిచ్చి జీవయాత్ర సాగిస్తున్నాడు గోవిందరాజన్.

ఎవరైనా తనని మెచ్చి పిలిచి ఉద్యోగమిస్తేనే చెయ్యాలనుకునే మోతాదు మించిన స్వాభిమానం వున్న వ్యక్తి కావడంతో అన్నేళ్లూ తమిళ రాష్ట్రంగానీ, భారతదేశంగానీ గుర్తించకపోయినా అతడు పట్టించుకోలేదు. ఇటీవలనే అతడికి అమెరికానుంచి ఆహ్వానం వచ్చింది. అమెరికాలో ఉన్న ఒక పరిచయస్తుని ద్వారా ఆ అవకాశం దొరికింది.

"ఇన్నాళ్ల నా కోరిక ఫలించి నా ప్రతిభ వెలుగులోకి రాబోతోంది. నా గణిత ప్రావీణ్యాతని విదేశాలు గుర్తించాకనయినా మాతృదేశం గుర్తిస్తుందని ఆశిస్తున్నాను'' అంటున్నాడు గోవిందరాజన్.

హెలికాప్టర్ సాయంతో కారుని కొండమీదికి చేర్చి, అక్కడినించి తన సాహసయాత్రను ప్రారంభిస్తున్న మైఖేల్‌ఖిరోజ్.

సచిత్ర విచిత్రం

# హిమకొండల పైనుంచి డ్రైవింగ్...




ఏమాత్రం ఏమరపాటుగా ఉన్నా కారునిండా మంచు చేరడం ఖాయం.




మంచుమీద జారిపోకుండా పట్టు వచ్చేందుకు, టైర్లస్థానంలో ఇనుపచక్రాలు అమర్చుతున్న మైఖేల్.

మైఖేల్ ఖిరోజ్ మహా సాహసి. ప్రాణాంతకమైన పనులు చేయడం అతని హాబీ. వృత్తిరీత్యా 'స్టంట్‌మాన్' అయిన ఈ ఫ్రెంచి పెద్దమనిషి చేసిన సాహసాల చిటా విప్పి చెప్పాలంటే అదో పెద్ద పురాణమే అవుతుంది. సుమారు 225 అడుగుల లోతైన చెరువులోకి ఒక అర్ధరాత్రివేళ కారుని దూకించిన ఘనుడాయన. అంతేకాదు, కార్లతో హైజంపులు, లాంగ్‌జంపులు చేయించి మూడుసార్లు ప్రపంచరికార్డుని బద్దలు గొట్టిన మొనగాడు. అటువంటి సాహసి ఇటీవల ఐరోపాలోనే అతి ఎత్తయిన మోన్‌బ్లాన్ పర్వతంమీదనుంచి కిందికి కారు నడిపి చరిత్ర సృష్టించాడు. మైనస్ 24 డిగ్రీల ఉష్ణోగ్రతతో ఉంటూ, ఎల్లవేళలా మంచుతో ఆవరింపబడి ఉండే ఆ పర్వతశిఖరంమీదకి హెలికాప్టర్ సాయంతో కారుని తీసుకుపోయి అక్కడినుంచి కిందికి కారుని నడుపుకురావడం అంటే ప్రాణాలతో చెలగాటమే! మంచు తుఫానులు, అంతులేని అగాధాలమధ్య అత్యంత చాకచక్యంగా కారు నడుపుతూ, మంచులో కూరుకుపోతున్న కారు చక్రాల్ని అతి ప్రయాసతో పైకి లేవనెత్తుకుంటూ ఎలాగైతేనేం? ఆ సాహసకార్యాన్ని విజయవంతంగా ముగించాడు మైఖేల్ ఖిరోజ్. యావత్ప్రపంచమూ అతని ధైర్యసాహసాలకు జేజేలు పలికింది.




నేలమీదకి చేరుకున్నాక ఆనందంతో గెంతుతున్న మైఖేల్.

# ఏరిన ముత్యాలు

★ విశ్రాంతి, ఉపవాసం అన్ని మందులకంటె మంచివి.

★ ప్రకృతి, కాలం, ధైర్యం- ఈ మూడు ఉత్తమమైన గొప్పవైద్యులు.

--హెచ్.జి.బోస్

★ కథలు చెప్పాలి, వినాలి. అదే కోరిక మానవనైజంలో ఇమిడివున్న గుణాలలో ఒకటి. కథాకథనం బహుశా ప్రపంచంలోని కళలన్నిటిలోనూ పురాతనమైనది. అందరూ అధికంగా ప్రేమించేది.

--ఎమ్.ఇ. స్ప్రియర్

★ మంచి కథ కల్పించినట్లుకాక నిజంగా జరిగినట్లు వుండాలి. చదివేవారికి కథ అనే శంక కలిగితే అది కథ కాదు.

--చలం

★ అవధులు దాటితే ఓర్పే పిరికితనం అనిపించుకుంటుంది.

★ ఓరిమికి అపారశక్తి వుంది. దండించే అధికారం వున్నా దండించకపోవడం నిజమైన ఓరిమి.

--గాంధీజీ

★ ఓర్పు చేదుగానే వుంటుంది. కానీ దాని ఫలితం మాత్రం మధురంగా వుంటుంది.

--రూసో

★ ఓపికలేని మనిషి నూనెలేని దీపంతో సమానం.

--మేరీబెకర్ ఎడ్డీ

★ అలవాటు ఉత్తముడైన సేవకునివంటిది లేదా దుష్టుడైన యజమాని వంటిది.

★ ఏడాదికి ఒక చెడు అలవాటు మానితే, కొంతకాలానికి దుష్టుడు కూడా మంచివాడుగా మారవచ్చు.

– ఫ్రాంక్లిన్

★ అలవాట్లు అబ్బడం మన చేతిలోనే ఉంది. ఎలాంటి అలవాట్లు ఏర్పరచుకొంటే అలా తయారవుతాము.

– నెహ్రూ

★ మంచి అలవాట్లు, నీతి నియమాలు లేని యువకుడు జీవితంలో ఒక లక్ష్యం ఏర్పరచుకోనకుండా సోమరిగా, జల్సాగా కాలం గడుపుతాడు. అటువంటివాడు బాగుపడటం కష్టం. అతనికన్నా అజ్ఞానినయం. ఏనాటికైనా కన్ను తెరిచే అవకాశముంది.

– జె. హూవెన్

★ కష్టాలు బలహీనుని వంచుతాయి. బలవంతుని పెంచుతాయి.

--బి.సి. ఫోరబ్స్

★ ప్రతి వ్యక్తికి ఎప్పుడూ కొన్ని బాధలు, కష్టాలు అవసరం. ఓడ అడుగున కొంత బరువు వెయ్యనిదే అది తిన్నగా, నిలకడగా ప్రయాణం చెయ్యలేదు.

--షోపన్‌హోవర్

# రచయితలకు సూచనలు







ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'
లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య
పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో
గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి
శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది.
''చతుర''లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి.
నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక
నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు
తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి
ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది
ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం ''చతుర'' కొరకై ప్రత్యేకంగా రాసిన
నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే
పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీని
జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు
తుంది.

ఎడిటర్

# చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# చతుర

సంపుటి : 16
సంచిక : 5
జూన్ : 1993




"శ్యామూ! యవ్వనారంభంలో నువ్వెవరినయినా ప్రేమించావా?" ...నలభైయేళ్ళ నడివయసులో అర్ధరాత్రి హటాత్తుగా భర్త అడిగిన ఆ ప్రశ్న... ఆమె హృదయపు అట్టడుగు పొరల్లో భద్రంగా నిక్షిప్తమైన నిజాలను అలవోకగా వెలికితీయడం ప్రారంభించింది.

సహృదయంతో తననర్థం చేసుకునే భర్తకి... నిజాయితీతో ఆమె చెప్పిన కథ... చివరగా అందించిన అద్భుత సందేశం... ఎలాంటిది?

**వయసొచ్చిన ఆడపిల్లల్లో 'తొలివలపు' కొందరికి వరమైతే మరికొందరికి శాపంగా పరిణమించడం వెనక సత్యాసత్యాలను సాక్షరంగా విశ్లేషిస్తూ కాళ్లకూరి కృష్ణ రాసిన 'టీనేజ్' జూన్ చతుర సమగ్రనవల.**

తల వంచుకుని గబగబా రాసుకుంటోన్న శ్యామల తన వెనుకనుండి పడిన నీడను చూసి రాత ఆపేసింది.

తల తిప్పి చూస్తే కుర్చీ వెనుక భర్త నిలబడి వున్నాడు.

పెన్నుకి క్యాప్ పెట్టేసి, కుర్చీలోనుండే వెనక్కు తిరిగి "ఏం! రావ్! నిద్రపట్టలేదా?" అనడిగింది, అతని చేతులు రెండూ తన చేతుల్లోకి తీసుకుంటూ.

శ్యామలలో రావుకి చాలా నచ్చే గుణం ఇదే. ఒక్కనిమిషంక్రితం భౌతికశాస్త్రంలో పరిశోధనా వ్యాసం రాస్తున్న ఈ శాస్త్రజ్ఞురాలు వెంటనే దానిని హటాత్తుగా ఆపేసి భార్యగా పరకాయ ప్రవేశం చేసేస్తుంది.

రావు చాలా మంచి భర్త. అతనికి సైంటిస్ట్‌గా తన భార్య అంటే ఎంత ఆరాధనా భావమో, భార్యగా ఆమె అంటే అంతే ప్రేమ. ప్రేమతో ఎదుటివాళ్ళను ఉక్కిరిబిక్కిరి చేయటం, బంధించిబాధించటంపట్ల అతనికి నమ్మకం లేదు. అందుకే ఆమె పనికి అతను ఎప్పుడూ అడ్డంరాడు. తను మెలకువగా వుంటే భార్య రాతపని వదిలి తనకి కంపెనీ ఇస్తూ వుండిపోతుందని చాలాసార్లు నిద్ర నటిస్తుంటాడుకూడా.

అటువంటివాడు యిలా అర్ధరాత్రి లేచి వచ్చాడంటే ఏదో విశేషమే వుండివుండాలి.

"శ్యామలా! బాల్కనీలోకి వచ్చి కొంచెంసేపు నాతో కూర్చోవటానికి కుదురుతుందా?"

రావుకి యింగ్లీషులో ఆలోచించి తెలుగులో మాట్లాడ్డం అలవాటు. భౌతికశాస్త్రం శ్యామలకి వృత్తి అయితే అడపాదడపా చిన్నచిన్న కథలు రాయడం ఆమె వ్యావృత్తి.

"వైనాట్? పద" అని వెంటనే లేచి నిలబడింది.

మళ్ళీ ఒక్కక్షణం ఆగి రిఫరెన్సు పుస్తకాలన్నిటిమధ్య బుక్ మార్కులు పెట్టుకుని బాల్కనీలోకి దారితీసింది.

డ్రాయింగ్‌రూములోని కుర్చీలు బాల్కనీలోకి లాగబోయాడు రావు. భర్తని వారించి, నేల మీద కూర్చుని, కాళ్ళు చాపుకుని ఒళ్ళో తల పెట్టుకోమన్నట్టు సైగచేసింది.

ఇద్దరూ రిలాక్సవగానే,

"ఏం టాపిక్‌మీద పేపరు రాస్తున్నావు శ్యామలా?" అనడిగాడు.

శ్యామల చిన్నగా నవ్వింది. రావు తనలాగ ఎలిమెంటరీ స్కూల్లో, జిల్లాపరిషత్ హైస్కూల్లో చదువుకోలేదు. మిషనరీ స్కూల్ ప్రొడక్ట్. అందుకే ఈ మర్యాదలు.

"నీ ఫార్మాలిటీస్ పక్కన పెట్టవోయ్. విషయమేమిటో చెప్పు"

అతను మళ్ళీ మౌనముద్ర వహించి, కుడి చేతిని జాపి ఆమె కాలి వేలి మట్టెలు పైకీ కిందకూ జరుపుతూ వుండిపోయాడు. శ్యామలకి కూడా భర్త సాన్నిహిత్యం సౌఖ్యంగానే వుంది. కానీ మనసులో రాయవలసిన పేపరు మెదులుతూ కొంచెం కంగారుగా కూడా వుంది.

'నలభై యేళ్ళొచ్చినా ఏం చదువే అమ్మడూ! ఆడదన్నాక మొగుడి ఆలనా పాలనా చూడొద్దూ? ఎప్పుడో ఓరోజు అబ్బాయి ఏ వంటపిల్లనో, మరే ఆఫీసు ఆడక్లర్కునో తగులుకుంటాడు. నీ తిక్క అప్పుడు తిరుగుతుంది' అన్న తల్లిమాటలు గుర్తొచ్చాయి.

ఎప్పటిలా నవ్వు రాలేదు.

"రావూ! కొంపదీసి యిప్పుడు నువ్వు నీ పి.యస్.ని రెండోపెళ్ళి చేసుకుంటాననవుకదూ!" అంది హటాత్తుగా.

రావుకి శ్యామల మాట్లాడిందేమిటో వెంటనే అర్థంకాలేదు. అర్థమైనాక ఆమె గొంతులో ఒకవంతు హాస్యం వున్నా మూడొంతులు ఆదుర్దానే తోచిందతనికి.

సమాధానంగా ఆమె పెదవుల్ని గాఢంగా చుంబించాడు. ఆమె అతన్ని కిందకు జారనివ్వకుండా చేతుల్లోనే పొదువుకుని,

"ముద్దు నా ప్రశ్నకు సమాధానం కాదు" అంది.

"అయితే లోపలికి పద"

"ఛీ! అదీ సమాధానం కాదు"

మళ్ళీ నిశ్శబ్దం!

"మనం యిలా అర్ధరాత్రి ఎందుకు సమావేశం అయ్యాం?" అంది తిరిగి శ్యామలే.




''శ్యామూ! నువ్వు యౌవనారంభంలో ఎవరిన యినా ప్రేమించావా?''

''అదేం ప్రశ్న రావ్? ఈ ప్రశ్న అడగటానికా అర్థరాత్రి పేపరు ముందునుండి నన్ను లేవదీసుకు వచ్చావ్?''

''పోనీలే... అంత పెద్దమాటెందుకు? ఎవరి నయినా చాలా గాఢంగా కోరుకున్నావా?''

సమాధానంగా శ్యామల, ''ఎందుకట్లా అడుగుతున్నావ్ రావ్?'' అని ఎదురు ప్రశ్నించింది.

''రవళి వాళ్ళ లెక్కల మాస్టారిని పెళ్ళి చేసుకుంటోందట...''

''వ్వాట్?''

''అవును... సాయంత్రం నాతో చెప్పింది. ఆయన లేకపోతే చచ్చిపోతుందట. ఆయన్ని తప్ప మరెవరినీ పెళ్ళి చేసుకోదట''

''నాన్సెన్స్... పట్టుమని పదహారేళ్ళు లేవు దీనికి. దీన్నిప్పుడు పెళ్ళి చేసుకోమని ఎవడేడ్చాడుట?''

''అదే ఏడుస్తోంది'' రావు నవ్వటానికి ప్రయత్నించాడు.

హఠాత్తుగా శ్యామల మనసులో అణుబాంబులాంటి ప్రశ్న ఉదయించింది.

''రావ్... కొంపదీసి...'' వాక్యం పూర్తిచెయ్యటానిక్కూడా శ్యామలకు భయం వేసింది.

భార్య అనుమానం ఏమిటో అతను బాగానే గ్రహించాడు.

''ఛ! ఛ! అదేం వున్నట్టు లేదు. అతన్ని మనఃస్ఫూర్తిగా ప్రేమించిందట...''

''ఓహో! వ్యవహారం చాలాదూరం వచ్చిందే? ప్రేమంటే దీనికేం తెలుసట?''

''నువ్వొక సత్తెకాలపు సత్తెమ్మవి. ఆదేమయినా నీలాగ పంథొమ్మిది వందల ఏభయ్యో సంవత్సరంలో పుట్టిందనుకున్నావా? ప్రేమంటే ఏమిటో తెలియకపోవటానికి. పంథొమ్మిది వందల డెబ్భై ఏడవ సంవత్సరంలో పుట్టింది. దానికీ, దాని ఈడువాళ్ళకి ప్రేమంటే ఏమిటో తెలియదనా నీ ఉద్దేశం. త్యాగం, హృదయం, బాధ, మనసు, విరహం అన్నీ సినిమాలు చూసీ, నవలలు చదివీ తెలిసేసు కున్నారు. వాటిగురించి పెద్దపెద్ద ఉపన్యాసాలు యివ్వగలరు. వాళ్ళు నీలాగ 'ఆడపిల్లలు పెంటలకడనే నిద్రలేచి... పలుదోమి...' వంటి భావాల్లో పుట్టి పెరిగినవాళ్ళు కాదు. నువ్వు ఎలిమెంటరీ స్కూల్లో, జిల్లాపరిషత్ స్కూళ్ళల్లో, కో ఎడ్యుకేషన్ కాలేజీల్లో చదువుకున్నావ్. మగపిల్లలతో మాట్లాడుతూ మెలికలు తిరిగిపోవటం మీ తరానికి తెలీదు. ఈవ్‌టీజింగ్ తెలుసా? డిగ్రీ కాలేజీల్లో ర్యాగింగ్ తెలుసా? ఏం తెలుసు నీకు? మాస్టార్లని గౌరవించడం తెలుసు. పిండి రుబ్బినట్లు క్లాసు పుస్తకాలు రుబ్బటం తెలుసు''

''అవును... మేము చదువుకున్న స్కూళ్ళు గురుకులాలు, దేవాలయాలు కాకపోవచ్చు. కానీ ప్రేమాలయాలు మాత్రం కావు రావూ?''

''అందుకే నీకు టీనేజ్ లవ్ తెలీదు శ్యామలా! రవళి వయసులో ఎవరినయినా ప్రేమించావా నువ్వు? అసలు ప్రేమంటే తెలుసా నీకు?''

★ ★ ★

పంథొమ్మిది వందల అరవై అయిదో సంవత్సరం... జూలై నెలలోని ఒక ఉదయం... పదకొండు గంటల సమయం...

చిన్నచిన్న అందమయిన బంగళా పెంకు బిల్డింగుతో, అయిదారు తాటాకు పాకలతో, విశాలమయిన ఆటస్థలంలో, బాటకు యిరువైపులా పరుగెత్తుతూ ఆఫీసురూం దగ్గర ఆగిపోయిన పచ్చని గానుగచెట్ల వరుసలలో, సూర్యుడి తీక్షణమయిన ఎండలో మెరుస్తోంది జిల్లాపరిషత్ హైస్కూలు.

స్కూలు ప్యూన్ రంగయ్య మొదటి పిరియడ్ అయిపోయిన సూచనగా గంట కొట్టి అయిదు నిమిషాలయింది. స్కూలంతా బిజీగానూ, నిశ్శబ్దంగానూ వుంది. స్కూల్ ఫైనలు 'బి' సెక్షనుమాత్రం ఎప్పటిలాగే అల్లరితో మారుమోగుతోంది. పిల్లలంతా అల్లరి చేస్తున్నారు. కానీ రాబోయే కొత్త లెక్కల మాస్టారి కోసం ఎదురుచూస్తూనే వున్నారు.

''ప్లీజ్! దయచేసి ఇవాళ ఒక్కరోజయినా అల్లరి చేయకండోయ్'' అధికారంతో అర్థింపు మేళవించి క్లాసులీడర్ మురళి తిరగేసిన

డస్టర్‌తో బల్లమీద గట్టిగా శబ్దం చేస్తూ సహాధ్యాయుల్ని బ్రతిమాలుకున్నాడు.

"పాపం! కొత్తమాస్టార్ఆయినా తన లీడర్ షిప్‌ని మెచ్చుకోవాలని మురళి తాపత్రయం..."

హోమ్‌వర్క్‌లోని మొదటి లెక్కను ఆన్సర్ చేస్తోన్న శ్యామల తలెత్తి సంధ్యను వుద్దేశించి అన్నది మెల్లని స్వరంతో. ఎంత నెమ్మదిగా మాట్లాడినప్పటికీ ఈ మాట మురళి చెవిన పడనేపడింది.

"ఏంటి శ్యామ్లా! డిప్యూటీ లీడర్‌వైయుండీ యింత బాధ్యతారహితంగా ప్రవర్తిస్తే ఎలా?" అని నుదురు చిట్లించాడు.

"ఏయ్ మురళీ! శ్యామ్లా ఏంటి అస హ్యంగా. నా పేరు శ్యా...మ...ల. అట్లా పిలవ లేవూ?"

మురళికి శ్యామల కుట్ర అర్థం అవుతోంది. క్లాసు నిశ్శబ్దంగా వుంటే ఆ అమ్మాయి సహించ లేదు. అందుకే వెంటనే రాజీకి వచ్చేశాడు.

"తల్లీ! నువ్వు శ్యామలవే. శ్యామలాంబవి. సరేనా! దయచేసి నిశ్శబ్దంగా కూర్చో. అల్లరి చెయ్యకు" చేతులు జోడించాడు.

"అదుగో మళ్ళీ... నా పేరేమీ శ్యామలాంబ కాదు. శ్యామల. అయినా నాకు దణ్ణం పెడతా వేంటి నువ్వు? నేనేమయినా గ్రామదేవతనా?"

మురళీ, శ్యామలా పోట్లాడుకోని రోజు వుండదు.

ఆ గొడవ విని మాస్టారు, "ఏంటి మురళీ! క్లాసుకి లీడరువికదా! నువ్వు కూడా అందరితో సమానంగా అల్లరి చేస్తున్నావేమిటి?" అని అతన్ని కోప్పడితే శ్యామలకు సంతోషం. అందుకే అతనితో గిల్లికజ్జాలు పెట్టుకుంటుంది.

"పోనీలే మురళీ! అనవసరంగా ఆడపిల్లల్తో గొడవెందుకు? కొత్తమాస్టారికి క్లాసు తెలిసినట్టు లేదు. నువ్వు పోయి పిలుచుకురారాదూ?" అని ప్రేమగా సర్దిచెప్పాడు.

"ఆహా! లీడరువెధవని నేనిక్కడ వుండగానే క్లాసు చేపల బజారులా వుందే. ఇక నేను వెళ్తే చెప్పనక్కర్లేదు. డిప్యూటీ వుంది ఏంలాభం! తను అందరికంటె ముందు సిద్ధం అల్లరికి!"

శ్యామల యుద్ధానికి పూర్తిగా సన్నద్ధురాలై పుస్తకాన్ని మూసేసింది.

"ఏంటీ? నేనా ముందు అల్లరి చేసింది? నువ్వు కాదూ ముందు దెబ్బలాడటం మొదలు పెట్టింది! అయినా ప్రతిరోజూ నాతో పోట్లాడందే వూసుపోదా నీకు? నేనసలు హెడ్మాస్టారికి చెప్పి 'ఏ' సెక్షన్‌కి మార్పించేసుకుంటాను"

"అబ్బ! శ్యామూ! వూరుకోవే" అని సంధ్య స్నేహితురాలిని శాంతింపచేసి కూర్చోపెట్టింది.

అయిదు నిమిషాలపాటు నిశ్శబ్దం రాజ్యమేలింది. స్కూలు ఫైనల్ 'బి' సెక్షను ఎన్నడూ లేనంత ప్రశాంతంగా వుంది. ఇది ఏమాత్రమూ శ్యామలకు రుచించలేదు. మళ్ళీ సంధ్య వైపుకు తిరిగి,

"ఈ కొత్త లెక్కల మాస్టారు మన దీక్షితులు గారిలా బాగా చెప్తారంటావా? అసలే ఈ ఏడాది పబ్లిక్ పరీక్షలయ్యే!" అంటూ సందేహాన్ని వ్యక్తపరిచింది.

ఒళ్ళంతా కళ్ళతో శ్యామలనే గమనిస్తోన్న మురళి, "చూడండోయ్! నేనేదో ఆడపిల్లల్తో అనవసరంగా గిల్లికజ్జాలు పెట్టుకుంటానను కుంటారు మీరు. శ్యామల చూడండి. మాట్లాడకుండా ఒక్క నిమిషం వుండలేదు. ఏం! మీరంతా నిశ్శబ్దంగా కూర్చోలేదూ? నన్ను రెచ్చగొట్టి క్లాసంతా గందరగోళం చెయ్యాలని తన వుద్దేశం. నేను మెజారిటీ ఓట్లతో లీడర్‌ని అయ్యానని కుళ్ళు. నేనేకాదు, ఎవరు లీడరయినా తనని అదుపులో పెట్టలేరు" అన్నాడు.

శ్యామల వీరనారి ఝాన్సీరాణి పోజులో లేచి నిలబడింది.

"మేమూ మనుషులమే. ఎంతసేపని మాట్లాడకుండా వుండగలం. ఏం! వెనుక బెంచీలో నీ ఫ్రెండు భాస్కరూ, ఆనందరావూ యిందాకటినుండి మాట్లాడుకుంటున్నారు. వాళ్లని ఒక్క మాటయినా అన్నావా? నేను ఒక్కసారి... అదీ మెల్లిగా మాట్లాడితే ఎంత గొడవ చేస్తున్నావే. నీమీద నాకేమీ కుళ్ళు లేదు. స్కూలు ఫైనలు క్లాసులీడర్‌షిప్పంటే ప్రధానమంత్రి పదవి అనుకుంటున్నావా? బల్ల దగ్గర నిలబడి, డస్టర్‌తో బాదుకుంటూ గావుకేకలు వెయ్యడం ఏం గొప్పకాదని తెలుసుకో"

సహాధ్యాయులంతా నవ్వుతోంటే మురళికి చాలా వుక్రోషం కలిగింది.

''మాస్టారు రానీ... నీమీద రిపోర్టు యివ్వకపోతే చూడు''

''సగం పీరియడ్ అయిపోయింది. ఆ మాస్టారు యిప్పటివరకూ రానేలేదు. ఇక యివాల్టికి రారుకూడా! పాపం! కొత్తకదా! స్కూలు ఫైనల్ లెక్కలంటే మజాకానా? లెక్కల పుస్తకం చూసి, దానికి జతగా గైడు కొనుక్కొని, లెక్కలన్నీ ఒకసారి యింటిదగ్గర చేసుకుని, ఆన్సరు అరచేతిలో రాసుకుని రేపు వస్తారు...''

శ్యామల వాక్యం పూర్తవుతుండగానే దీక్షితులుగారు కొత్త లెక్కల మాస్టారిని తీసుకుని క్లాసులోకి వచ్చేశారు.

రెండు జడలు కదిలిపోయేలా... కంఠనాళాలు తెగిపోయేలా అరుస్తూ, దెబ్బలాడుతోన్న శ్యామలను కొత్తమాస్టారు చురుగ్గా చూశారు.

శ్యామలకు జంకు కలిగి బిడియంగా తల దించుకుంది. ఈ పిల్లలకు తొమ్మిదవ తరగతి నుండి దీక్షితులుగారే లెక్కలు చెపుతున్నారు. వాళ్ళ మనసుల్లో లెక్కల మాస్టారంటే దీక్షితులుగారే. ఈ కొత్త మాస్టారికి పంచెకట్టు లేదు. బరువయిన జేబుల లాల్చీ లేదు. బట్టతల లేదు. నుదుట కుంకుమబొట్టు లేదు. తెల్ల పుల్హ్యాండు చేతుల చొక్కాని నల్ల ప్యాంటులో టక్‌చేసుకున్న హిందీ సినిమా హీరోవంటివాణ్ణి పట్టుకొచ్చి 'ఈయనే మీ లెక్కల మాస్టారంటే' పిల్లలకి ఎందుకో ఒక్కక్షణం ఆ నిజం కొరుకుడు పడలేదు.

దీక్షితులుగారు కొత్త మాస్టారి గురించి చాలా గొప్పగా చెప్పారు. ఆయన తమలాగ బియ్యే బియ్యాడీనో, బియ్యెస్సీ బియ్యాడీనో కాదుట. యమ్మే బియ్యాడి అట. పేరు వాసుదేవరావుట.

''యమ్మేలూ, యమ్మెస్సీలూ చదివినవాళ్ళు కాలేజీ లెక్చరర్లు అవతారుకదే... మరేంటి ఈయన...''

''అమ్మా! శ్యామలా! కాసేపు నోరు మూసుకో...'' అన్నారు దీక్షితులుగారు తన పరిచయ కార్యక్రమాన్ని కొనసాగిస్తూ-

'మా బాగా అయ్యింది' అన్నట్టు మురళి కళ్ళెగరేసి వెక్కిరింపుగా నవ్వాడు. అయితే ఈ పిల్ల పేరు శ్యామలన్నమాట అనుకున్నాడు వాసుదేవరావు.

''మాస్టారికి యిదే మొదటి అనుభవం. మీ అల్లరితో విసిగించి చంపకండి. శ్రద్ధగా లెక్కలు నేర్చుకుని చావండి'' అని దీక్షితులుగారు వెళ్ళిపోయారు.

కొత్త మాస్టారు అందంగా వున్నారు. బాగా చదువుకున్నారు. పిల్లలంతా ఆనందపడ్డారు. యివాళే మొదటి క్లాసుకదా! పాఠం వుండదనుకున్నారు. కానీ...

''నిన్న మాస్టారు హోంవర్కు యిచ్చారా?'' అనడిగాడు వాసు.

నిరుత్సాహంగా తలలు వూపారు.

''వెరీగుడ్! ఏదీ మీ పుస్తకాలన్నీ వరుసగా టేబిల్‌మీద వుంచండి. లెక్కలు చేయనివాళ్ళు ఎవరయినా వుంటే దయచేసి క్లాసు నుండి బయటకు వెళ్ళండి''

శ్యామల గుండె ఆగిపోయింది. ఇవాళ దీక్షితులు మాస్టారు రిటైరయిపోతారని తెలుసు. అందువల్ల అలక్ష్యంగా హోంవర్కు చెయ్యలేదు.

అందరి నోట్సులూ టకటకమని ఒకదాని వెంట ఒకటి బల్లమీద పడ్డాయి. తన స్నేహితులంతా యింత ఉత్తమ విద్యార్థులెప్పుడైనారో అర్థంకాక శ్యామల తెల్లబోతూ లేచి నిలబడింది.

తను క్లాసులోకొచ్చేసరికి చెట్టంత మగపిల్లవాడితో మగరాయుడిలా దెబ్బలాడుతున్న ఈ అమ్మాయి, తను రాకముందే, తనను చూడకముందే, తన గురించి వెక్కిరింపుగా, హేళనగా మాట్లాడిన ఈ నల్లపిల్ల హోంవర్కు కూడా చేయలేదన్నమాట.

''ఏం! తమరు హోంవర్కు చెయ్యలేదా?'' కఠినంగానే ప్రశ్నించాడు.

'లేదు' అన్నట్టు తల అడ్డంగా వూపటానిక్కూడా శ్యామల సిగ్గుపడింది. అల్లరికి తప్ప బాధ్యతారాహిత్యానికి తిట్లు తినటం శ్యామలకు తెలీదు.

''గెటవుట్ ఫ్రంది క్లాస్'' కరుగ్గా అన్నాడు




వాను.

ఈవిధమయిన శిక్ష ఆ పల్లెటూరిలోని జిల్లా పరిషత్ స్కూలు విద్యార్థులకు అలవాటు లేదు. శ్యామల అవమానాన్ని దుఃఖాన్ని బిగపట్టి నిలబడివుంది. అతను ఒక్కొక్క పుస్తకమూ తీసుకుని లెక్కలు దిద్దుతూ "ఏం! అర్థంకాలేదా? క్లాసునుండి బయటకు వెళ్ళమంటున్నాను. ఇకనుండి హోంవర్కు చేయకుండా నా క్లాసుకు ఎవరూ రాకండి" అన్నాడు.

శ్యామలకి అభిమానం పొడుచుకువచ్చింది. విసురుగా పుస్తకాలు తీసుకుని బయటకు అడుగు వేసింది. మాస్టారి టేబిల్‌వద్దకు రాగానే కళ్ళెత్తి చూసింది. అప్పుడే యింకొక నోట్సుకోసం చేయిచాపుతూ తలెత్తి చూసిన వాను చూపు ఆమె చూపుని ఢీకొంది. అందమయిన కొలనులో తళతళలాడే చేపల్లా వున్నాయి నీటితో నిండిన ఆ అమ్మాయి కళ్ళు.

అతని మనసు ఛివుక్కుమంది.



మరుసటిరోజు లెక్కల క్లాసులో బల్లమీద పడ్డ హోంవర్కు పుస్తకాలలో మొదటిది శ్యామలదే. మూడవ లెక్కకి ఆన్సరు లేదు. వాను పుస్తకం తిప్పి అట్టమీద పేరు చూసి, "ఏం శ్యామలా! మూడవ లెక్క చేయలేదేం?" అనడిగాడు.

"ఎలా చెయ్యాలో తెలీలేదు మాస్టారూ!" అంది శ్యామల. ఆ అమ్మాయి గొంతులో వినయం వుందో లేదో వాను జడ్జ్ చేయలేకపోయాడు. గబగబా అందరి పుస్తకాలూ తిరగేసి చూశాడు. అందరి నోట్సుల్లోనూ ఆ లెక్క చేసే వున్నది.

"క్లాసంతటికీ తెల్సింది. నీ ఒక్కదానికీ తెలియలేదన్నమాట" ఎంత వద్దనుకున్నా అతని గొంతులో హేళన ధ్వనించింది.

శ్యామల నొచ్చుకున్నట్టు చూసింది.

"ఆ ఛాప్టర్ క్లాసులో చెప్పినప్పుడు నేను స్కూలుకు రాలేదు. అయినా మిగిలిన లెక్కలన్నీ చేయగలిగాను, ఆ ఒక్కటీ తప్ప" అంది కొంచెం గర్వంగానే.

'హుఁ...!' అంటూ పుస్తకాలు జరిపేశాడు వాను.

"ఎవరి పుస్తకాలు వాళ్ళు తీసుకోండి" అన్నాడు ముక్తసరిగా. అతని మాటలకంటె ఈ తృణీకారభావం శ్యామలను ఎక్కువ అవమానపరిచింది. లేచి నిలబడి,

"మాస్టారూ! ఒకసారి ఆ లెక్క చేసి చూపించండి" అంది.

ఆమె స్వరంలో ఈసారి వినయంలేదని వానుకు స్పష్టంగా అర్థమయింది.

అప్పటివరకు కోపాన్ని నిగ్రహించుకున్న వాను యిక సహించలేకపోయాడు.

"ఇంతోటి లెఖ్ఖనూ నేనే చేసి చూపించనవసరం లేదు. నీ స్నేహితులు ఎవరయినా చేయగలరు. ఎవరయినా వచ్చి లెక్క బోర్డు మీద చేయండోయ్. శ్యామల నేర్చుకుంటుంది"

అప్పటివరకు మాట్లాడుతున్న పిల్లలంతా మౌనముద్ర దాల్చేశారు. వాను కూర్చోమనకపోయినా శ్యామల కూర్చుంది. కొంటె కళ్ళతో, బిగించిన పెదవులతో క్లాసునంతటినీ పరికించటం మొదలు పెట్టింది. వాను ఆశ్చర్యపోయాడు.

"అదేమిటి? ఎవరికీ రాదా? మరి నోట్సుల్లో ఎలా చేశారు?" అతని గొంతులో అసహనం ధ్వనించింది.

ఎవరూ సమాధానం చెప్పలేదు. రెండు క్షణాల తర్వాత శ్యామలే సమాధానం చెప్పింది.

"లెక్క చెయ్యకపోతే మీరు క్లాసులో నుండి వెళ్ళగొడతారుగా. అందుకని భయపడి ము

రళి నోట్సులో చూసి ఎక్కించారు. మురళిక్లాసు కి రాలేదు''

''ఆల్‌రైట్'' విసుగ్గా చాక్‌పీసు చేతిలోకి తీసుకుని లేచాడు. పదిహేను నిమిషాలు గడిచాయి. కానీ ఆన్సరు మాత్రం రాలేదు. పిల్లలంతా తనను జాలిగా చూస్తున్న భావన కల్గింది అతనికి.

* * *

ఆ సాయంత్రం దీక్షితులుగారు రిటైరయిన సందర్భంగా స్కూలులో చిన్న మీటింగు ఒకటి ఏర్పాటుచేశారు. స్కూలు తరపున హెడ్మాస్టారు ఆయనకు శాలువా కప్పి, పూలదండవేసి సన్మానించారు. ఆయన కృషినీ, మేధాసంపత్తినీ పొగిడారు. తరువాత ముగ్గురు నలుగురు టీచర్లు ఆయన స్కూలుకు చేసిన సేవను ప్రశంసించాక చివరగా దీక్షితులుగారు మాట్లాడారు.

''నేను ఉపాధ్యాయుడిగా ముప్పయి సంవత్సరాలు పని చేశాను. నా ఉద్యోగ కాలంలో నా విధిని నేను సక్రమంగా నిర్వర్తించాననే అనుకుంటున్నాను. విధి నిర్వహణకు నిర్వచనం చాలా కష్టం. రోజులు మారిపోతున్నాయి. పూర్వం రోజుల్లో మేము స్కూలుకు ఆలస్యంగా వచ్చేవాళ్ళం. ఒక్కోరోజు రాలేకపోయేవాళ్ళం. ధర్మపత్ని మూడు రోజుల శలవో, బిడ్డ అనారోగ్యమో ఏదో ఒక అడ్డంకి, ఠంచనుగా గంట కొట్టేటప్పటికి బడికి రానిచ్చేవి కావు. అంటే ఏమిటన్నమాట? మేమెవరమూ రూల్సుకి బద్ధులమై ప్రవర్తించలేదు. కానీ, అంతరాత్మకు బద్ధులమై ప్రవర్తించాము. మాకు తెల్సిన విద్యను మేము మనఃస్ఫూర్తిగా, కూలంకషంగా మా విద్యార్థులకు నేర్పయత్నించాము. ప్రయివేటు క్లాసులు పెట్టాము. బడి వదిలాక పాఠం చెప్పిన సందర్భాలు ఎన్నో వున్నాయి. ఇంట్లో కూడా పాఠాలు చెప్పాం. డబ్బులు తీసుకుని కాదు సుమా! వీడు ఛైర్మన్ కొడుకు, వీణ్ణి కొట్టకూడదు. ఫలానివాడు హెడ్మాస్టరుగారి కొడుకు. వాడిని దండించకూడదు అనే తారతమ్యం లేదు. ఆ పెద్దలు కూడా పిల్లలను వెనకేసుకువచ్చి మా ఉపాధ్యాయుల్ని బెదిరించినవాళ్ళు కాదు. 'మాస్టారూ! మా పిల్లవాడిని మీ చేతిలో పెడుతున్నాం. నాలుగు తన్నయినా సరే. పాఠం నేర్పండి' అనేవారు.

ఇప్పుడు ఆ రోజులు పోయినాయి. డాక్టరు కోర్సుల్లో, ఇంజినీరింగు కోర్సులో సీట్లు రాని వారు మాత్రమే డిగ్రీలు చదివి, ఆ డిగ్రీల్లో క్లాసు రానివారు మాత్రమే బియ్యీడీలు చేస్తున్న రోజులివి. విధి నిర్వహణకు కొత్తతరం ఉపాధ్యాయులిచ్చే నిర్వచనం వేరు. ఉదయం పది గంటలనుండి సాయంత్రం అయిదు గంటలవరకు బడిలో వుండటం, ఖచ్చితంగా సమయానికి క్లాసుకురావటం, ప్రిపేరయిన పాఠం చెప్పటం, తిరిగి గంట మోగగానే వెళ్ళిపోవటం అంతే! ఇప్పుడు ప్రయివేటు క్లాసులు తగ్గిపోయాయి. పిల్లలకు అర్థంకావాలనే తాపత్రయం ఉపాధ్యాయుల్లో కన్పించటం లేదు. ఇపుడు విద్యాబోధన అంటే టీచింగునోట్సుల ప్రిపరేషన్, సిలబస్ పూర్తిచేయటం. నేను యువతరం ఉపాధ్యాయులను విమర్శిస్తున్నానని వారు కోపగించుకోవద్దని మనవి.

విద్యార్థులు మాత్రం మారలేదూ? గురువుపట్ల వారు చూపిస్తున్న గౌరవాభిమానాలేవీ? పాఠాలపట్ల శ్రద్ధలేదు. మా ఫీజులతోనేగా మీ జీతాలు యిచ్చేది అన్నట్లున్నది వాళ్ళ ధోరణి. పంతుళ్ళు మా మాట వినాలిగానీ, వాళ్ళ మాట మేము విననక్కర్లేదనే రోజు ఎంతో దూరంలో లేదు.

ముసలివాడిని. ఉద్యోగం నుండి విరమిస్తున్నవాడిని. మరీ నిరాశాజనకంగా మాట్లాడుతున్నానని నిందించకండి. మా కాలంలో కూడా బాధ్యతారహితులయిన ఉపాధ్యాయులు, క్రమశిక్షణలేని విద్యార్థులూ వుండేవారు. ఈ కాలంలో కూడా చేస్తున్న ఉపాధ్యాయవృత్తిని దైవంగా కొలిచే మాస్టార్లు, చదువుపట్ల, గురువుపట్ల భక్తిశ్రద్ధలుగల విద్యార్థులున్నారు. ఉదాహరణకి మన స్కూలు ఫైనలు 'బి' సెక్షను వాళ్ళు చూడండి- ముఖ్యంగా శ్యామల, శ్రీధర్, మురళి, భాస్కర్, వనజా వీళ్ళంతా అల్లరిలో ఎంత ఉద్దండులో, చదువులోనూ అంతే పట్టుదలగలవాళ్ళు. గురువును గౌరవించటం తెలిసినవాళ్ళు. చిన్నక్లాసుల పిల్లలు వీళ్ళను ఆదర్శంగా తీసుకోవాలి. ప్రతి విద్యార్థీ మహామేధా

 

విగా వుండాలని నా ఉద్దేశ్యం కాదు. అమాయకత్వంతో కొందరు, అహంభావంతో కొందరు, అసమర్థులుగా కొందరు పాఠశాలకు వస్తారు. మనకి వాళ్ళంతా సమానమే. డాక్టర్ల తర్వాత టీచర్లనే నేను సేవాదృక్పథంగలవారిగా, సమాజానికి ఎక్కువ వుపయోగపడేవారిగా భావిస్తాను. ఉపాధ్యాయుడినైనందుకు గర్విస్తాను.

నేను రిటైరయిపోయాను. ఇక స్కూలులో నెలజీతానికి పాఠం చెప్పను. మీరు నాకంటే ఎక్కువ చదువుకుంటారు. సమర్థులయిన గురువు దొరికారు. కానీ, ఎప్పుడయినా, ఏ సందేహమయినా కల్గితే, దీక్షితులు మాస్టారు తీర్చగలడనుకుంటే తప్పక నా దగ్గరకు రండి. మీ అందరికీ నా ఆశీస్సులు, శలవు''

పిల్లల కరతాళధ్వనులతో స్కూలు ప్రతిధ్వనించింది. వాళ్ళ హృదయాలు భారమయ్యాయి. ఆయన ఆడపిల్లలు, మగపిల్లలనే బేధం లేకుండా చెవి మెలిపెట్టి లెక్కలు చేయించటం, తప్పుచేస్తే వీపుమీద దభీదభీమని గుద్దటం గుర్తుకొచ్చాయి శ్యామలకు. 'ఈ అల్ట్రా మోడరన్ మాస్టారిలా ఆయనకు పిల్లల్ని బయటకు నెట్టేయడం తెలీదు. ఆయన పాత తరం వాడు. పిల్లలకు నయాన్నో భయాన్నో పాఠం నేర్పాలనుకునే ఛాందసుడు అనుకుందామె.

★ ★ ★

కొత్త ప్రదేశం కావటంవల్ల వాసుకు నిద్రపట్టలేదు. గత రెండురోజుల అనుభవాలు నెమరువేసుకున్నాడు. దీక్షితులుగారి ఉపన్యాసం గుర్తుకు వచ్చింది. ఇదేదో ఆలోచించవలసిన విషయమే అనుకున్నాడతను. పెద్దాయన పాపం! తనను వుద్దేశించి మాట్లాడలేదు. కానీ, అవన్నీ తనకు వర్తిస్తాయని గమనించాడు.

ఆయన అన్నట్టు తనకూ ఈ లెక్కల పంతులు ఉద్యోగంమీద గౌరవం లేదు. పైపెచ్చు తృణీకారం భావం వుంది. తన జీవితం గాడి తప్పింది. ఎక్కడ తప్పిందో కూడా తనకు బాగా తెలుసు. ఎమ్మే ప్యూర్ మాథ్స్ తీసుకోవాలని తను నిర్ణయించుకున్న క్షణమే తన జీవితం తలక్రిందులయింది. నాన్న చదువుకోవటానికి డబ్బివ్వగలడు కానీ తనకు చదువు విషయంలో సలహాయిచ్చే సమర్థత లేదాయనకు. సరయిన సలహాయిచ్చే వాళ్ళు లేక బియ్యేస్సీలో వచ్చిన లెక్కల మార్కులు చూసుకుని మురిసిపోయి ఎమ్మే (మాథ్స్)లో చేరాడు. ఆ సబ్జెక్టు అర్థంకావటానికి తనకి ఒకటిన్నర సంవత్సరం పట్టింది. ఫలితం థర్డుక్లాసు పోస్టుగ్రాడ్యుయేషన్ డిగ్రీ. పేరు చివర రాసుకోవటానికి తప్ప మరెందుకూ పనికిరాని పట్టా చేతికి వచ్చింది. కుటుంబ ఆర్థిక పరిస్థితి అంతంతమాత్రంగా వుంది. ఈ థర్డ్‌క్లాసు డిగ్రీని చేతబట్టుకుని 'నాన్నా! అయ్యేయస్‌కి ప్రిపేరవుతాను' అని ఏ ముఖంతో అనగలను. తమ్ముడూ, చెల్లెలూ కాలేజీ చదువులకు వచ్చారు. తాను త్యాగం చేస్తున్నాననుకుని 'బియ్యీడి చేస్తానన్నాను'. తమ యింట్లో పిల్లల్ని ఎప్పుడూ దేనికీ అభ్యంతరపెట్టరు. యిప్పుడూ అదే అయింది. బియ్యీడీలో చేరాను. వూహించినట్టే వెంటనే వుద్యోగం వచ్చింది. ఎవరిమీదా ఆధారపడక్కర్లేదు. నేను సంపాదనపరుణ్ణి అయ్యానని ఆనందంపడిన మాట వాస్తవమే. కానీ... యిదేనా జీవితం? ఇష్టంలేని చదువు... ఇష్టంలేని ఉద్యోగం... ఇష్టంలేని పెళ్ళి.

ఛ! మరీ యింత నిరాశావాదం పనికిరాదు. ఏది ఏమయినా తనకు లభించిన జీవితం యిదే. దీనిని తాను ప్రేమించి తీరాలి. నా 'ఫ్రస్ట్రేషన్'తోనేను పిల్లల్ని శిక్షించకూడదు. వాళ్ళంతా తనకంటె పదిపన్నెండేళ్ళు చిన్నవాళ్ళు. వాళ్ళతో పంతగించటం, కోపగించుకోవటం మూర్ఖత్వం. నేను మంచి టీచర్‌ని కావటానికి తప్పక ప్రయత్నిస్తాను అనుకున్నాడతను ఆఖరుగా లైటు తీసేసి నిద్రకుపక్రమిస్తూ.

★ ★ ★

''వాసుదేవరావుగారూ! వీరు మన లోయర్ ఫారమ్స్‌కు సైన్సు టీచరు. నిన్నా మొన్నా సెలవులోవున్నారు. అందువల్ల, మీకు పరిచయం కాలేదు. ఏకాక్షరిగారూ! వీరు వాసుదేవరావుగారని మన దీక్షితులుగారి స్థానంలో వచ్చారు''

పరస్పరం పరిచయం చేశారు సోషల్‌స్ట

డీస్ మాస్టారు జార్జిగారు.

"మీ పేరు ఏకాక్షరా?" అని ఆశ్చర్యపోయాడు వాసు.

"ఆమె పేరు రాజ్యలక్ష్మిగారులెండి. కానీ మోనో సింబల్స్‌లో తప్ప మాట్లాడరని మేమే ఆ పేరు పెట్టాం" అన్నారు జార్జిగారు. వాసుని చూసి ఆమె ఎంతగానో ఆశ్చర్యపోయింది. ఆ ఆశ్చర్యం దాచుకునేటందుకు కూడా ఆమె ప్రయత్నించలేదు.

"ఏమిటండీ అలా చూస్తున్నారు?" అనడిగారు జార్జిగారు.

ఆవిడ సహజధోరణిలో ఆ ప్రశ్నకు సమాధానం ఇవ్వలేదు. ఎవ్వరినీ పట్టించుకోనట్టుగా వెళ్ళి తన స్థానంలో కూర్చుని చదువుకోటం మొదలెట్టింది. ఆవిడ చేతిలో పుస్తకం వుంది గానీ, దృష్టంతా తనమీదే వుందని గ్రహించాడు వాసు.

'దేశంలోని దుఃఖమంతా తన భుజస్కంధాలమీదనే వున్నట్టు దైన్యం మూర్తీభవించిన ఈ వృద్ధ వనిత నన్నెందుకిలా వట్టిపట్టి చూస్తోంది' అని మనసులో విసుక్కున్నాడు వాసు.

అతనికి పదవ తరగతి రెండు సెక్షన్లకు ఇంగ్లీషు, స్కూల్ ఫైనల్ రెండు సెక్షన్లకు లెక్కలు ఎలాట్ చేసారు. క్లాసులకు ప్రిపేరవుతూ తర్వాత రాజ్యలక్ష్మిని పట్టించుకోలేదు వాసు.

ఆ రాత్రి రాజ్యలక్ష్మి నిద్రపోలేదు. ఆ రాత్రే కాదు తర్వాత ఎన్నో రాత్రులు ఆవిడ నిద్రకి దూరమయిందనీ, తన గురించే ఆలోచిస్తూ వుండిందనీ వాసుకి తెలీదు.

★ ★ ★

రెండు నెలలు గడిచేసరికి వాసు స్కూలు వాతావరణానికి బాగా అలవాటుపడ్డాడు. ఎన్నడూ, ఎవరినీ పలకరించని రాజ్యలక్ష్మి అతన్ని చూసి చిరునవ్వు నవ్వుతుంది.

"భోజనం చేశావా?" అనడుగుతుంది.

"ఎప్పుడయినా ఒకరోజు స్కూలుకు సెలవు పెడితే ఎంతో ఆదుర్దాగా ఆరోగ్యం బాగానే వుంది కదూ!" అని పరామర్శిస్తుంది. వాసు యిదివరకు ఆమెను ఎరుగడు కాబట్టి యిందులో అతనికి వింతేమీ తోచలేదు కానీ, మిగిలిన టీచర్లందరికీ ఆవిడ ధోరణి చాలా ఆశ్చర్యం కలిగిస్తోంది.

"ఏకాక్షరిగారు కూడా మానవప్రపంచంలోకి వస్తున్నారోచ్!" అన్నారు జార్జిగారు. విడ్డూరం! ఆవిడ చిరునవ్వు నవ్వింది.

వాసుకి దీక్షితులుగారి 'విధినిర్వహణ' ఉపన్యాసం బాగా తలకెక్కి వుండాలి. అతను తాను యూనివర్శిటీలో కన్న రంగుల కలల్ని వెనక్కు పెట్టాలని ప్రయత్నిస్తున్నాడు. ఒంటరితనంవల్ల పిల్లలతో ఎక్కువ సమయం గడుపుతున్నాడు. వాళ్ళ స్థితికి తను దిగి సానుభూతితో వాళ్ళ సమస్యల్ని అర్థంచేసుకుంటున్నాడు. అందరూ అన్నట్టుగానే స్కూల్ ఫైనల్ 'బి' సెక్షన్ వాళ్ళు అల్లరిలో అపర ఆంజనేయులే కానీ, తెలివి తేటల్లో మెరికల్లాంటి వాళ్ళు కూడా. ఏ లెక్కయినా చెపితే క్షణాల మీద అర్థంచేసుకుంటారు.

★ ★ ★

"ఏమే? ఇంకా తయారు కాలేదూ? స్కూలు లేదా ఏం?"

తల్లి కేకతో స్పృహలోకి వచ్చింది శ్యామల. ఊహ తెలిశాక ఎప్పుడూ ఇలా బీరువాముందు నిలబడి 'ఏ బట్టలు కట్టుకోవాలి?' అని యింత దీర్ఘంగా ఆలోచించలేదు. స్నానానికి వెళుతూ చేతికి ఏవి అందితే అవి తీసుకువెళ్ళేది. 'ఈమధ్య నాకు చదువుపట్ల శ్రద్ధ తగ్గి అలంకరణలో శ్రద్ధ పెరిగింది' అని తనకు తాను విమర్శించుకుంది. దానికి కారణం తెలుస్తూనే వుంది మనసుకి. అనుకోవటానికి తనకే భయంవేస్తోంది. ఆలోచిస్తూనే రెండు మూడు జతలు బట్టలు తీసుకుని పెదవి విరిచి ప్రక్కన పడేసింది. చివరకు పండుగకు కుట్టించుకున్న వంగపండు రంగు పరికిణీ, జాకెట్టు, తెల్ల ఓణీ వేసుకుంది. శ్రద్ధగా దోస గింజ ఆకారంలో బొట్టు దిద్దుకుంది.

"అమ్మా! రెండు జడలు వద్దు. ఒక్క జడ... వదులుగా వెయ్యి" అంటూ తల్లికి సూచన యిచ్చి మరీ జడ వేయించుకుంది. ఒక గులాబీని అలవోకగా ఒకపక్క అమర్చుకుని స్కూలుకు బయలుదేరింది.

ఆమె కళ్ళు ఒక్క మనిషికోసం మాత్రమే




చూస్తున్నాయి. ఆ మనసు అతని రాకకు మాత్రమే స్పందిస్తున్నది. అతనిని చూడటమే జీవిత ధ్యేయమై మిగిలిన దినచర్య అంతా వ్యర్థంగా తోస్తున్నది. ఎందుకో? ఇలా ఎందుకు జరుగుతోందో?

స్కూల్ అసెంబ్లీలో అతను కనపడకపోతే గుండెల్లో ఎందుకింత అలజడి? తన అలజడి ఎవరయినా గమనిస్తారని ఎంత ఆదుర్దా! ప్రార్థన ముగిసింది. పిల్లలందరూ ముక్తకంఠంలో 'జైహింద్' అని గూబలు బద్దలయ్యేలా అరిచి, బారులుగా క్లాసుల్లోకి వెళ్తున్నారు. శ్యామల యాంత్రికంగా సంధ్యను అనుసరించి క్లాసులోకి వచ్చేసింది. క్లాసులో కూర్చుందిగానీ కళ్ళు గుమ్మంవైపే చూస్తున్నాయి. ఈ క్షణాలకోసమే నిన్న సాయంత్రం స్కూలు వదలినప్పటి నుండీ ఈ గడియవరకు బతికివున్న దన్పిస్తోంది. గుండె వేగంగా కొట్టుకుంటున్నది. ఈ కొత్తభావం శరీరాన్ని కూడా ప్రభావితం చేసి కంపింపచేస్తోంది. కళ్ళు తప్ప మిగిలిన యింద్రియాలేవీ పనిచేస్తున్నట్టు లేవు. తన చుట్టూ క్లాసు వుందన్న స్పృహలేదు. సంధ్య మాట్లాడేది చెవుల్లోకి వెళ్తోందేమో కానీ తలలో రిజిస్టర్ కావటంలేదు. మొహమాటానికి సంధ్య వైపు తిరిగి నవ్వాలని ప్రయత్నించింది. 'అమ్మో! మిస్ అవుతానేమో'ననే భయంతో తిరిగి గుమ్మంవైపు చూపు మరల్చింది.

అయిదు నిమిషాల తర్వాత వాసు చకచక నడుచుకుంటూ గుమ్మం ముందునుండి పక్కనున్న ఫిఫ్తుఫారం క్లాసులోకి వెళ్లాడు. వాళ్ళకు అతను క్లాసుటీచరు.

శ్యామల గుండె ఒక్కక్షణం ఆగి, రెట్టింపు వేగంతో కొట్టుకుంది. పుస్తకాలమీది చేతులు సన్నగా వణికాయి. ప్రక్కన కూర్చున్న సంధ్య తన భావాలను పసికడుతోందా? అనే బిడియంతో కనురెప్పలు అల్లల్లాడాయి. ఇంతలోకి తమ క్లాసులోకి ఇంగ్లీషు మాస్టారు వచ్చారు. శ్యామల గుండె కొంచెం కుదుటపడింది. ఉద్వేగం తగ్గింది. అరగంటపాటు శ్రద్ధగా పాఠం వింది. పూర్తిగా పాఠంలో నిమగ్నమయింది. అక్కడినుండీ మళ్ళీ ఎదురుచూపులు ప్రారంభమయినాయి. ఇంకొక పదినిమిషాలలో క్లాసు అయిపోతుంది. రంగయ్య కొట్టే గంటకోసం శ్యామల ఒళ్ళంతా కళ్ళుచేసుకుని విన్నది. రెండు మూడు నెలలక్రితం తనను క్లాసులో నుండి వెళ్ళగొట్టిన 'ఈ దుర్మార్గపు లెక్కల పంతులు' తన మనసుకు ఎప్పుడింత సన్నిహితుడయినాడో శ్యామల గుర్తించలేదు. బెల్ మోగింది. వాసు మళ్ళీ గుమ్మం ముందు నుండి నడుచుకుంటూ స్టాఫ్ రూంవైపుకి వెళ్ళిపోయాడు. మళ్ళీ అదే ప్రకంపనం! ఉద్వేగాన్ని అణచుకుని మామూలు మనిషి కావటానికి ప్రతిసారీ రెండు మూడు నిమిషాలు పడుతుంది. 'మధ్యాహ్నం మూడు గంటలకు లెక్కల క్లాసువుంది' అనుకుంది శ్యామల.

★ ★ ★

పదిహేను సంవత్సరాలు నిండి పదహారవ వసంతంలో అడుగుపెట్టిన శ్యామల తన మనసునెన్నడూ తరచి చూసుకోలేదు. తన ప్రవర్తనకు అర్థమేమిటి? అని ప్రశ్నించుకోలేదు. చదువుపట్ల శ్యామలకు చాలా శ్రద్ధవుంది. ఇప్పుడు ఆ శ్రద్ధ కొంత తగ్గిన మాట వాస్తవం. వాసు తనను మెచ్చుకుంటోంటే మనసు ఆనందంతో గంతులువేస్తుంది. ఆ ఆనందంకోసం లెక్కలు మాత్రం విపరీతమయిన శ్రద్ధాసక్తులతో చేస్తుంది. ఇరవైఐదు సంవత్సరాల ఆ యువకుడిపట్ల తన మనసులో ఏర్పడిన భావం యొక్క స్వరూప స్వభావాలు తెలుసుకోగల వయసు, లోకజ్ఞానం శ్యామలకి లేవు. ఈ భావం తనను ఒక చోట నిలవనియ్యకుండా చేస్తోందని, అతనిని చూడటంవల్ల స్వాంతన లభిస్తోందని మాత్రం తెలుసు. అందువల్ల అతనిని చూడాలని కోరుకుంటున్నది తప్ప దీనికి ప్రతిఫలాన్ని ఆశించటంలేదు.

★ ★ ★

వాసు దీక్షగా నల్లబల్లమీద లెక్కవేసి పిల్లలకు వివరిస్తున్నాడు. లెక్క పూర్తవగానే వెనక్కి తిరిగి ఆడపిల్లల బెంచీ వంక చూశాడు. అతన్నే తదేకంగా చూస్తోన్న శ్యామల తడబడి, ఠక్కున తలవంచుకుని లెక్క పుస్తకంలోకి ఎక్కించుకోవటం మొదలుపెట్టింది. వాసు, శ్యామలలాగ యౌవనారంభంలోనూ, బాల్యపు చివరి మెట్టుమీదా లేడు. యువకుడయిన

అతనికి ఆ చూపులలోని ఆరాధన అర్థం అయింది. అతని అరచేతుల్లో చెమటపట్టింది. నిలబడలేని నిస్సత్తువ ఆవరించింది. కుర్చీలో కూర్చుని పిల్లల 'హోంవర్కు' పుస్తకాలు ముందుకు లాక్కున్నాడు. విద్యార్థులంతా నల్ల బల్లమీద లెక్కని నోట్సులో ఎక్కించుకుంటు న్నారు. అతను ఓరచూపుల్తో, పుస్తకాలు దిద్దు తూనే శ్యామలను గమనిస్తున్నాడు. ఆమె 'రెస్ట్ లెస్'గా వుంది. పుస్తకం అడ్డుపెట్టుకుని తననే గమనిస్తోంది. అతను తలవంచుకుని పుస్తకా లు దిద్దడంవల్ల, తనను గమనిస్తూ వుండవ చ్చుననే వూహ ఆ అమ్మాయికి కలగలేదు. ఈ దాగుడుమూతల్లో గంట ఎప్పుడు కొట్టారో అత ను గమనించలేదు. పిల్లలు పుస్తకాలు మూసె య్యడమూ, ఒకరితో ఒకరు చిన్నగా మాట్లాడు కోవటమూ చూసి పీరియడ్ అయిపోయి వుంటుందని వూహించాడు. క్లాసు గుమ్మం వరకూ వచ్చేక, హఠాత్తుగా ఒక్కసారి వెనక్కు తిరిగి చూశాడు. శ్యామల కళ్ళు తన వీపుకు అతుక్కునే వున్నాయి. అతను తనని చూడ గానే బిడియంగా తలదించేసుకుంది.



శ్యామల కళ్ళు ఇంద్రనీలాలు కావు. ముక్కు సంపంగి, పెదవులు పగడాలు, పలువరుస దానిమ్మ గింజలూ కావు. కానీ, అమ్మాయిచక్కగా వుంటుంది. పదిహేను సంవత్సరాల విరిసీ విరియని యౌవనం, ఆరోగ్యమయిన శరీరం, తెలివితేటలతో మెరిసే కళ్ళు, ఆత్మవిశ్వాసాన్ని సూచిస్తున్నట్టుగా కొనదేరిన చుబుకం, నల్లటి నలుపు కాదుగానీ, చామన ఛాయ కంటె కూడా తక్కువయిన శరీర ఛాయ, పైకి మడిచికట్టిన నల్లని ఒత్తయిన రెండు జడలు. మాయాబజార్‌లో శశిరేఖలా అందంగానూ, ముద్దుగానూ వుంటుంది.

ఈ అనుభవం వాసుకి కూడా కొత్తగానే వుంది. ఒకమ్మాయి, తనని ఆరాధనా పూర్వకంగా చూడటం, తనను చూసి తడబడటం. పిల్లలందరికీ తనంటే యిష్టమని తెలును. ఎక్కడవున్నా తన చుట్టూ మూగుతారనీ తెలుసు. అది అతనికి అలవాటయిపోయింది. కానీ శ్యామలచూపు అతన్ని స్టాఫ్ రూంకు వచ్చేసినా వెన్నాడుతూనే వుంది. హృదయానికి చక్కిలిగింతలు పెడుతూనే వుంది.

'ప్రేమా? దీని పేరు ప్రేమా?' వాసుకి తెలియలేదు. అతనికి ఎమ్మేలో తృతీయశ్రేణి వచ్చింది కానీ బి.యస్సీ వరకు ప్రథమ శ్రేణిలో పాసయ్యాడు. అతనికి తన కుటుంబమూ, చదువూ తప్ప మరే విషయాలూ పట్టలేదు. బియస్సీ మూడవ సంవత్సరంలో వుండగా కాబోలు స్నేహితులంతా సరదా చేసుకుందామన్నారు. వాసుకు దాని అర్థం తెలియలేదు. అలాగే అని ఉత్సాహపడ్డాడు. తీరా చూస్తే వూరి చివరి తోటలోకి నలుగురయిదుగురు అమ్మాయిలను తీసుకువచ్చారు. అతనికి చాలా అసహ్యం అన్పించింది. స్నేహితులు తన పిరికితనానికి వేరే పేరు పెడతారేమోనని భయమూ కలిగింది. అయినప్పటికీ అపరిచిత వ్యక్తితో, అదీ ధనం కోసం వచ్చిన ఆడదానితో ప్రేమ నటించటం అతనికి చేతకాలేదు. తర్వాత యమ్మేలో కూడా అతని సహాధ్యాయినులెవ్వరూ అతన్ని ఆకర్షించ లేకపోయారు. అటువంటిది... అటువంటిది... ఈ చిన్న పిల్ల




పదిహేను... పదహారు సంవత్సరాల ఆడపిల్ల... తనకంటే దాదాపు పది సంవత్సరాలు చిన్నదయిన తన విద్యార్థిని తన మనసును గాలం వేసి పట్టుకుంటుందా? అతని మనసు తొలిసారిగా స్పందించింది. చురుకయిన కళ్ల ఈ తెలివయిన ముద్దరాలు తనను ఆరాధనా దృక్కులతో వీక్షించటం అతనికి చాలా మధురంగా తోచింది. కానీ ఆ భావాన్ని సంపూర్ణంగా అనుభవించగల పరిస్థితిలో అతనులేడు.



మరురోజు స్కూలుకు వెళుతూ వాసు టైంటేబిల్ చూసుకున్నాడు. స్కూలు ఫైనల్ బి సెక్షను వాళ్లకు రెండవ పీరియడ్ లెక్కలు. అతని హృదయం ఒకసారి తృళ్లిపడి సర్దుకుంది. కానీ అతనికి తెలియకుండానే అతను శుభ్రంగా వున్న గడ్డాన్ని షేవ్ చేసుకున్నాడు. శుభ్రంగావున్న బూట్లను పాలిష్ చేసుకున్నాడు. నున్నగా వున్న తలను దువ్వుకున్నాడు. నిన్ననే తీసిన యిస్త్రీ బట్టలను వేసుకున్నాడు. చెప్పవలసిన లెక్కలను పదేపదే చూసుకున్నాడు. ఆ క్లాసుకు ముందు తనకు పదవ తరగతి ఇంగ్లీషుక్లాసు వుందన్న స్పృహ అతనికి లేదు. అతను మొదటి పీరియడ్ సగంలో ఉండగా, స్కూల్లో హడావుడి మొదలయింది. అతను బయటకు వచ్చేసరికి రాజ్యలక్ష్మిగారు స్పృహ తప్పిపడిపోయారని చెప్పారు. అతను క్లాసును మధ్యలో వదలి స్టాఫ్ రూముకు వచ్చాడు. చూస్తే అసలే సన్నగా, రివటలా ఉండే ఆవిడ వడలిపోయిన తీగెలా నేల మీద పడివుంది. వాసు, సోషల్ మాస్టారు కలిసి ఆమెను హాస్పిటల్‌కి తీసుకు వెళ్లారు. వాసు స్కూలు వదలి వెళుతోంటే శ్యామల నిస్సహాయంగా చూస్తూ

వుండిపోయింది. ఈ క్లాసు కోసమే తాను నిన్న సాయంత్రం నుండి గంటలు లెక్కపెడుతూ ఎదురు చూసింది. చదువు సంధ్యలు మానేసి బట్టల ఎన్నికలలోనూ, తలదువ్వుకోవటంలోనూ సమయం గడిపింది. ఉదయం నుండీ మనసు ఎగిరెగిరి పడుతూ ఎదురు చూసిన క్షణం రానేవచ్చింది. కానీ ఎదురు చూసిన అనుభవం మాత్రం వెక్కిరిస్తూ అందకుండా పోయింది. లెక్కలక్లాసుకు బదులు హిందీ మాష్టారి క్లాసు మొదలయింది. ఉక్రోషంతో ఎవరి మీదో తెలియని కోపంతో శ్యామల కంట నీరు తిరిగింది. తననుతాను సంబాళించుకుని హిందీ నోట్సు తీసింది. రాజ్యలక్ష్మి టీచరుని హాస్పిటల్‌లో చేర్చి, మూడవ పీరియడ్‌కి మాష్టారు అందుకుంటారని చిన్న ఆశ మాత్రం మనసులో మినుకు మినుకు మంటోంది.

అయితే హాస్పిటల్‌లో వాసు పని శ్యామల అనుకున్నంత సులువుగా అయిపోలేదు. డాక్టరు, రాజ్యలక్ష్మిని పరీక్షించి, "చాలా నీరసంగా వున్నారు. బాగా లోబీపీ కని పిస్తోంది. సెలైన్ పెట్టవలసి వుంటుంది" అన్నారు. సోషలు మాష్టారు స్కూలుకు వెళ్లాలని కంగారు పడుతోంటే తాను, "నేను టీచరుగారి దగ్గర వుంటానులెండి. మీరు వెళ్లిరండి" అని ఆయనకు చెప్పి తనకు మధ్యాహ్నానికి శలవు రాసి ఆయనతో పంపించాడు.

సాయంత్రానికి రాజ్యలక్ష్మికి స్పృహ వచ్చింది. తను ఆసుపత్రిలో వుండటం, వాసు తన ప్రక్కన వుండటం ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించింది.

"నువ్వా? నేనిక్కడ ఎందుకున్నాను?" అని ప్రశ్నించింది.

"మీరు చాలా బలహీనంగా వున్నారు. మీ శరీరం విశ్రాంతి కావాలని మొరాయించి, మీ మాట వినక స్పృహ తప్పి పడిపోయింది. నేనూ, జార్జిగారూ మిమ్మల్ని ఆసుపత్రికి తీసుకువచ్చాము" అని సమాధానమిచ్చాడు వాసు.

ఆమె ఆరాగా అటూ యిటూ చూస్తోంటే, "జార్జిగారు లేరు. స్కూలుకు వెళ్లిపోయారు. నేను మధ్యాహ్నం శలవుపెట్టి వుండిపోయాను" అని చెప్పాడు.

కృతజ్ఞతో, మరే భావనో ఆమె కన్నుల్లో నీరు నిండింది. అతన్ని చూసి 'థాంక్స్' అన్నట్టు గొణిగింది.

కాసేపటికి డాక్టరుగారు వచ్చారు.

"ఏమమ్మా? ఎలా వున్నారు? ఇంటికి వెళతారా? లేక ఇక్కడనే యింకోరోజు ఉంటారా? మిమ్మల్ని కనిపెట్టుకు కూర్చుని, మీ అబ్బాయి ఉదయం నుండీ కాఫీకి కూడా వెళ్లలేదు" అన్నారు. రాజ్యలక్ష్మిగానీ, వాసుగానీ ఆయన మాటలను ఖండించలేదు. ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకుని సన్నగా నవ్వుకున్నారు. వయసు తారతమ్యాన్నిబట్టి, తన ఆదుర్దానుబట్టి డాక్టరుగారు అలా భావించటం ఆశ్చర్యం కాదు అనుకున్నాడు వాసు.

"ఇంటికి వెళతాను డాక్టరుగారూ!" అంది రాజ్యలక్ష్మి. వాసు ఆశ్చర్యపోయాడు. ఆమెకు ముందూ, వెనుకా ఎవరూ లేరని అతనికి చూచాయగా అర్థం అయింది. యింటికి వెళ్ళటం... యింత నీరసంలో మంచిది కాదని అతనికి తోచింది.

"పోనీ యింకొక రోజు యిక్కడే వుంటే మంచిదేమో! మీరు చాలా బలహీనంగా వున్నారు. ఇక్కడయితే నర్సులు, ఆయాలు ఎవరో ఒకరు ఉంటారు"

"వద్దయ్యా! స్పృహలో లేనపుడు తెలియదుగానీ, నాకు ఆసుపత్రి వాతావరణం నచ్చదు. యింటికి వెళ్లిపోతాను" అంది. సన్నని ఆమె స్వరంలో దృఢనిశ్చయం అతనికి అర్థం అయింది.

"మీ ఇష్టం!"

అతనే ఆసుపత్రి బిల్లు చెల్లించాడు. రిక్షా పిలుచుకువచ్చాడు. పసిపిల్లలాగ, ఆమెను జాగ్రత్తగా పొదివి పట్టుకుని రిక్షా ఎక్కించి యిల్లు చేర్చాడు.

"మంచిది నీ సహాయం మరువలేను... వెళ్లిరా!" అంది రాజ్యలక్ష్మి.

"లేదండీ! నేను వెళ్లటం లేదు. మీరు చాలా నీరసంగా వున్నారు. యింట్లో ఎవరూ వున్నట్టు లేరు. నేను మీకు తోడుగా పడుకుంటాను. నేనూ రూముకి వెళ్లి చేసేదేమీ లేదు" అన్నాడు వాసు. అతనే ఆమెకు రొట్టె తెచ్చియిచ్చి, పాలు కాచి యిచ్చాడు.

''నీ భోజనం?'' అని అడిగిందావిడ.

''నేను రోజూ హోటల్లో భోంచేస్తాను. కానీ యివాళ ఆకలిలేదు''

''పోనీ కొంచెం హార్లిక్స్ తాగు. అదుగో! అక్కడ సీసాలో వుంది'' అని ఆవిడ కళ్లు మూసుకుంది. మూసిన కళ్ల వెనుక ఏ భావాలు కదలాడుతున్నాయో ఎవరికి తెలుసు. అతను వంటింట్లోకి వెళ్లి హార్లిక్స్ కలిపి తెచ్చుకున్నాడు. కూర్చుందామని కుర్చీ లాగితే ఆ చిరుసవ్వడికే ఆమె కనులు విప్పి చూసింది.

''టెలిగ్రాం యివ్వమంటారా?''

''ఎవరికి యిస్తావు?''

''మీ తల్లిదండ్రులకి?''

''లేరు...''

''అన్నదమ్ములు... అక్కచెల్లెళ్లు...''

''ఉహూఁ! ఎవరూ లేరు''

''బంధువులెవరైనా...''

''లేరు!''

''పోనీ పిల్ల...లు...''

రాజ్యలక్ష్మి సమాధానం యివ్వకుండా నిస్త్రాణగా కళ్లు మూసుకుంది.

అతను, ఆమె వంక జాలిగా చూశాడు. ఈమె ఒంటరి స్త్రీ! వృద్ధాప్యంలో కూడా ఏ తోడు లేని దీనురాలు! ఎందుకిలా దైన్యంగా దుఃఖం మూర్తీభవించినట్టు వుంటుంది. ఈ నిస్సహాయత్వం, ఒంటరితనం ఎంత దురదృష్టం.

★ ★ ★

అతనికి నిద్రపడుతూ పడుతూ వుండగా ఎడమ చెంప మీద ఎవరో సున్నితంగా ముద్దు పెట్టుకున్నారు. కనులు విప్పి చూస్తే శ్యామల.

చిన్ని చిన్ని చేపల్లాంటి సోగకళ్లు కొంటెగా నవ్వుతున్నాయి. మడిచి బిగించిన రెండు జడల్లో ఒకటి ముందుకు పడి వయ్యారంగా వూగుతోంది. నడుము చుట్టూ బిగించిన పసుపువచ్చ ఓణీకి, జాకెట్టుకీ మధ్య పలచగా తమలపాకుల వంటి పొట్ట ముడత! అతను వివశుడై తననుతాను మరిచి చెయ్యి జాచి ఆమెను దగ్గరకు లాక్కోబోయాడు. చాచిన చేతికి ఏమీ అందలేదు. అతనికి మెలకువ వచ్చేసింది. యిది నా మనసులో నిద్రాణమైవున్న కోరిక. వాస్తవం కాదు. అనుకున్నాడతను నిట్టూర్చి.

★ ★ ★

స్కూలు ఫైనల్ 'బి' సెక్షనులోకి అడుగుపెడుతూనే అతను అమ్మాయిల బెంచీ వంక చూశాడు. కళ్లనే వాకిళ్లు చేసి ఎదురు చూస్తూ శ్యామల. ఆ చూపుల్లో భావమేమిటి? ఆ కళ్లకి భాషవస్తే తనతో ఏం చెప్తాయి? అది ప్రేమా? ఆరాధనా? ఈ చిన్న పిల్లకు తననుండి ఏం కావాలి? తనను ఆమె వైపుకు ఆకర్షిస్తోన్న ఈ అదృశ్య శక్తి పేరేమిటి? తాను కూడా ఆమెనే చూస్తూ కూర్చున్నాడా యిద్దరూ అభాసుపాలవుతారు. నేను ఈ పిల్లకంటే పదేళ్లు పెద్దవాణ్ణి. ఉపాధ్యాయుడిని. నేను బాధ్యతమరిచి ప్రవర్తించరాదు. అని తననుతాను హెచ్చరించుకున్నాడు వాసు.

అతను లెక్కలు చెప్తున్నాడు. మధ్య మధ్యలో లేచి బోర్డు మీద ఆ లెక్కలను వివరిస్తున్నాడు. ఇంత చేస్తూవున్నా శ్యామల కళ్లలో కళ్ళు కలవకుండా జాగ్రత్త పడుతున్నాడు. కానీ అతనికి తెలుస్తూనే వుంది. శ్యామల తననే చూస్తోంది. తననే వింటోంది. ఆమెకు తనొక్కడే వాస్తవం! చుట్టూవున్న ప్రపంచం అవాస్తవం! అతని హృదయం ఎదురు తిరుగుతోంది. ఆమెనే చూడమంటోంది. బుద్ధి నిగ్రహంతో అతన్ని తల తిప్పనివ్వకుండా చేస్తోంది. ఆ యాభై నిమిషాల క్లాసు అతనికి కత్తి మీద సాములా గడిచింది. గంట మోగగానే వాసు తనకు తెలియకుండానే దీర్ఘంగా నిశ్వసించాడు. కానీ వెళ్లిపోయే ముందు అతను వెను తిరిగి ఆమెను చూడకుండా వుండలేకపోయాడు. ఆ కళ్లల్లోని నిరాశ అతన్ని కదిల్చి వేసింది. ఒక క్షణం తన వుద్యోగ ధర్మాన్ని, బాధ్యతను అతను విస్మరించాడు. కాళ్లు క్లాసు వదలమని మొండి కేశాయి. ఆమె దగ్గరకు వెళ్లి మోకాళ్ల మీద మోకరిల్లి,

'అలా చూడకు! నా హృదయాన్ని చీల్చకు. నా నిగ్రహానికి పరీక్ష పెట్టకు' అని వేడుకోవాలన్పించింది. అయినా సంబాళించుకుని, మధువు తాగిన వాడిలా తూలుతూ అతను స్టాఫు రూములోకి వచ్చి పడ్డాడు.

★ ★ ★

''శ్యామూ! సినిమాకు వెళదామే!'' అంది




సంధ్య. శ్యామలకు సినిమాలంటే ఇష్టంలేదు. సమయం వృధా అవుతుందని భయం. శలవుల్లో ఒకటి రెండు సినిమాలు చూస్తుంది తప్ప బడి వున్నప్పుడు సినిమాకి వెళ్లడానికి ఇష్టపడదు. సంధ్య ఎప్పుడు సినిమాకు వెళ్దామన్నా శ్యామల వద్దు అనాల్సిందే శలవుల్లో తప్ప. అటువంటిది ఇవాళ సంధ్య సినిమా అనగానే శ్యామల సరే అనేసింది.

సంధ్య ఆశ్చర్యపోయి, నోరు తెరిచి చెయ్యి గిల్లుకుంది. ''వాల్లే బడాయి! నిజంగానే'' అంది శ్యామల నవ్వాపుకుని.

సంధ్యకు సావిత్రి అభిమాన నటి. శ్యామలకు సినిమాల గురించి ఓనమాలు తెలియవు. వాళ్లు వెళ్లిన సినిమా పేరు 'సుమంగళి'. సినిమా మొదలయిన కాసేపటికి వాసు హాలు ముందునుండి వెళుతూ ఇదేదో మంచి సినిమాలా వుందే! అనుకుని టికెట్టు కొనుక్కుని లోపలకు వచ్చాడు. అప్పటికే లైట్లు ఆర్పేశారు. సినిమా మొదలై పది నిమిషాలయింది. అతనికి కుటుంబం వూళ్ళోలేక ఏమీ తోచకుండా వుంది. మనసుకు ఏకాగ్రత లోపించింది. అందువల్ల సినిమాహాల్లోకి చొరబడ్డాడు. సినిమా కథ కూడా అతని జీవితంలానేవుంది. లెక్చరరూ, అతని విద్యార్థినీ ప్రేమలో పడ్డారు. ఈ సినిమాలో పంతులు నాలా బాధ్యతలకు బందీ కాడు. అదృష్టవంతుడు, అనుకున్నాడు వాసు నిట్టూర్చి. సంధ్య సినిమాలో లీనమైపోయింది కానీ శ్యామలకు చాలా అశాంతిగా వుంది. ఇదేమిటి సినిమా ఇలా వుంది అనుకుంది. తన మనసు పొరల్లోకి ఎవరో తొంగి చూస్తోన్న భావన కలిగింది.

''బావుంది కదే సినిమా?'' అంది సంధ్య.

''తప్పుకాదూ సంధ్యా! అలా మాష్టారిని ప్రేమించవచ్చా?'' అంది శ్యామల బెరుగ్గా.

''ఆఁ! నిక్షేపంలా మాష్టార్లు ఈ సినిమాలో నాగేశ్వరరావులాగానూ మన వాసూ మాష్టారిలానూ వుంటే ఆడపిల్లలు ప్రేమించరూ మరి'' అన్నది సంధ్య.

ముందు వరసలో నుండి తన పేరు వినపడగానే వాసు కంగారు పడ్డాడు. ముందు వరుసలో కూర్చున్న ఇద్దరు ఆడపిల్లలు ఎవరో కూడా అతను చూచాయగా గ్రహించాడు.

సంధ్య సమాధానంతో శ్యామల తత్తరపడింది. స్నేహితురాలు తన మనసు గ్రహించిందా? తనని అల్లరి పట్టిస్తోందా? అని భయపడింది శ్యామల. కానీ సంధ్య ఎటువంటి వుద్దేశ్యమూ లేకుండా యధాలాపంగా మాట్లాడినట్టు తోచింది. విశ్రాంతి సమయంలో లైట్లు వెలిగీ వెలగటంతో ఎవరో తరిమినట్లే వాసు బయటకు పరుగెత్తాడు. ఆడపిల్లలిద్దరూ బయటకు రాలేదు. అతనికి వాళ్లు సంధ్యా, శ్యామలా అని రూఢీ అయింది. తిరిగి లైట్లు ఆరి, సినిమా ప్రారంభం అయినాక కానీ అతను లోపలకు వెళ్లటానికి సాహసించలేదు.

సినిమా రెండవ భాగం అతనిని మరింత కదల్చి వేసింది. ముందున్న తరుణ వయస్కులయిన ఆడపిల్లలిద్దరికీ అది అర్థమయీ కాకుండా వుంది.

''ఏంటే? ముద్దు పెట్టుకుంటే చచ్చిపోతాడా?'' అంది శ్యామల గట్టిగానే కథానాయకుడిని వుద్దేశించి స్నేహితురాలితో.

''ష్! అరవకు. ఎవరయినా వింటే బావుండదు'' అంది సంధ్య. వాసుకి శ్యామల సందేహం అర్థం అయింది. వాళ్లిద్దరి మనోభావాలు కూడా అర్థం అయ్యాయి. ఇద్దరిలోనూ సంధ్య కొంచెం లోకం పోకడ తెలిసిన వ్యక్తి. పూర్తిగా కాకపోయినా, ఆ అమ్మాయికి చాలా వరకు సినిమా అర్థమయినట్టే వుంది. హీరోకి ప్రమాదవశాత్తు వెన్నెముక దెబ్బతిన్నది. అందువలన, అతను సాంసారిక జీవితానికి అనర్హుడు. ఆ సంగతి అతనికి తెలియదు. అతని భార్యకు తెలుసు. ఆమె అతన్ని దూరంగా వుంచుతోంది. అతని ప్రాణానికి ముప్పు వాటిల్లుతుందని తల్లడిల్లుతోంది. తన బలహీనత తెలియని అతను ఆమెకు దగ్గర కావాలని ప్రయత్నం చేస్తున్నాడు. ఈ సంగతి శ్యామలకు చాలా వరకు అర్థం కాలేదు. ఆమెకు సందేహ నివృత్తి కాకుండానే సినిమా అయిపోయింది.

శ్యామల ప్రశ్న సంధ్యకు ఎంత స్పష్టంగా వినిపించిందో వాసుకి కూడా అంత స్పష్టంగానూ విన్పించింది. సో ఈ అమ్మాయికి శృంగారం అంటే ఏమిటో కూడా స్పష్టమయిన

అవగాహన లేదు. అనుకున్నాడతను. ఆ అమాయకత్వం అతనికి ఎంతో ముద్దొచ్చింది. విరిసీ విరియని గులాబీ పువ్వువంటి ఈ అమ్మాయి హృదయంలోకి ప్రేమ యిప్పుడిప్పుడే తన రూపంలో తొంగి చూస్తోంది. ఇప్పుడు తాను నిగ్రహం కోల్పోయాడు. ఆ అమ్మాయికి ఈ అనుభవం ఎంతో చేదుగా మిగులుతుంది. జీవితంలో ఎవరి మీదా నమ్మకం మిగలదు. తాను బాధ్యతగల ఉపాధ్యాయుడు! తను అలాగే ప్రవర్తించాలి. అదే తనకూ చిన్నారి శ్యామలకూ కూడా ఎంతో మంచిది.

ఈసారి లైట్లు ఆరకముందే అతను బయటకు పరుగెత్తలేదు. ఆగి ఆడపిల్లలిద్దరినీ పలకరించాడు.

''ఏమిటీ సినిమాకు వచ్చారా?''

''అవును మాస్టారూ!'' అంది సంధ్య నిస్సంకోచంగా. శ్యామల ఈ ఆకస్మిక దర్శనానికి అమందానంద కందళిత హృదయారవిందురాలై సమాధానం కూడా ఇవ్వకుండా అతన్నే చూస్తూ వుండిపోయింది. అతనే జనం మధ్యలోనుండి ఇద్దరినీ గేటు వరకూ జాగ్రత్తగా తీసుకువచ్చి రిక్షా మాట్లాడి ఎక్కించాడు.

''జాగ్రత్తగా వెళ్లగలరా? ఇంటి వరకూ రానా?'' అనడిగాడు.

'వెళ్లగలం మాస్టారూ! మాకు అలవాటే' అంది సంధ్య. శ్యామల కళ్లు బలవంతాన అతన్నుండి మరల్చుకుని మౌనంతోనే అతనికి వీడ్కోలు పలికింది.

''నేను చాలా బాగా ప్రవర్తించాను'' అని వాసు తననుతాను అభినందించుకున్నాడు.

శ్యామలకు ఆ రాత్రి ఎంతకూ నిద్రపట్టలేదు. సినిమాకు వెళ్లటం... హఠాత్తుగా వాసు మాస్టారు కన్పించటం... సినిమాలో కూడా నాయికా నాయకులు ఉపాధ్యాయుడు, విద్యార్థినీ కావటం... అంతా గమ్మత్తుగా తోచింది. సినిమాలోని దృశ్యాలు పదేపదే కళ్లముందు కదలాడాయి. తెలియనిదేదో కొంతకొంత తెలుస్తున్న భావన కలిగింది. తెల్లవారు ఝామున నిద్రపడితే ఒకటే కలలు... ఆ కలల నిండా వాసు మాస్టారు, నాగేశ్వరరావూ... తనూ... గజిబిజిగా.

★ ★ ★

రాజ్యలక్ష్మి స్టాఫ్‌రూములో ఒక్కత్తే కూర్చున్నది. 'అకులీన' అనే మరాఠీ నవలకు తెలుగు అనువాదం చదువుతున్నది. అది ఆమె స్వంత పుస్తకం. నాలుగయిదు సంవత్సరాల క్రితం పాత పుస్తకాల దుకాణంలో కొన్నది. అది మొదటిసారి చదివినపుడు ఆమె వారం రోజులపాటు మామూలు మనిషి కాలేకపోయింది. దేవదాసీల కులంలో పుట్టిన ఒక యువతి ఆ విధమయిన జీవితం గడపటం యిష్టంలేక ఒక 'సేల్స్‌గర్ల్'గా జీవితాన్ని ప్రారంభిస్తుంది. అప్పుడే ఆమెకు కథానాయకుడితో పరిచయం కలుగుతుంది. ఆ పరిచయం ప్రేమకు, ప్రేమ సాన్నిహిత్యానికి దారి తీస్తాయి. చివరకు ఆమె కోరుకున్న జీవితం చాలా సాధారణమయిన జీవితం... ఒక వ్యక్తికి యిల్లాలుగా వుండాలనే జీవితం... ఆమెకు లభించనే లభించదు. వేశ్యగా జీవితం గడిపి దుర్భరంగా మరణిస్తుంది.

ఆ నవలను ఎప్పుడు చదివినా, ఎన్నిసార్లు చదివినా రాజ్యలక్ష్మికి కళ్లు చెమర్చక మానవు. ప్రతిసారీ ఆ కథానాయికకూ, తనకూ సారూప్యం గోచరిస్తుంది. తన జీవితాన్నే తాను మరొకరి దృష్టితో చూస్తున్న భావన కలుగుతుంది. ఏ స్త్రీ కూడా వేశ్యగా పుట్టాలనీ, వేశ్యగా బతకాలనీ కోరుకోదు. అయినా చాలా మంది స్త్రీలకు ఆ తరహా జీవితమే లభిస్తోంది. విద్యావంతులై ఆ పంకం నుండి తప్పించుకోవాలనుకునే స్త్రీలకు కూడా యిది తప్పటం లేదు. అయితే కొందరు స్త్రీలు అసహాయతతో లొంగిపోతే, ఈ చదువుకున్న స్త్రీలు తమ దౌర్భాగ్యంనుండి తప్పించుకోవాలని తమ శాయశక్తులా ప్రయత్నిస్తారు. కానీ, ఈ యౌవన సహజమయిన ప్రేమ వున్నదే అది చాలా ప్రమాదకరమయిన భావన. ఈ తొలివలపు, ప్రథమ పురుష స్పర్శ స్త్రీల పతనానికి ప్రథమ సోపానాలు. ఈ మొదటి మెట్టు బలమయినదయితే ఆ స్త్రీ జీవితం నందనం. కానీ ఎప్పుడూ ఆ విధంగా జరిగినట్టు రాజ్యలక్ష్మి వినలేదు. ఆ మెట్టు జారుడు మెట్టుగా స్త్రీని అధఃపాతాళానికి తోసిన సందర్భాలే ఎక్కువ. ఆమె పుస్తకంలో









# పాలబుగ్గల పసివాడి స్నేహం

ఎక్కడయినా కుక్కలు, పిల్లులు, చిలకలు లాంటి ప్రమాదరహితమైన జంతువులను పెంచుకోడం చూశాంగానీ, మొసళ్లలాంటి క్రూరజంతువులను, అందులోనూ అయిదేళ్లయినా నిండని పసివాడు పెంచడం ఆశ్చర్యకరమే. బ్రెజిల్‌లోని చాలామంది పిల్లలకి పెంపుడు జంతువులుంటాయి. అలాగే రఫీల్ బార్బోసా అనే ఈ పాల బుగ్గల పసివాడికి నేస్తం ఓ మొసలి. అప్పుడప్పుడు. నీటితొట్టిలో మునుగుతూ మిగిలిన టైంలో బయటకొచ్చి రఫీల్‌తో ఆడుకుంటుంది ఆ మకరం. దాని పేరు వెల్హా. ఇది ఎప్పుడూ ఆ పసివాడి కూడా వుంటూ, వాడు ప్రమాదాల జోలికి పోకుండా కాస్తూ వుంటుందిట. కానీ 'కంచే చేను మేసినట్టు' ఎప్పుడయినా బుద్ధిమారితే బిస్కట్లు, చాక్లెట్లు పెట్టే ఆ పసివాడి చేతులను అమాంతం కొరికి పారెయ్యదుకదా అనే భయం లేక పోలేదు చూసేవారికి.

# చతుర సమీక్ష



ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/–, రూ. 75/–, రూ. 50/– చొప్పున, మరో మూడింటికి రూ. 25/– చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలో పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడు జాగ్రత్తపడటం మంచిది.

---------- కూపన్ ----------

జూన్ 'చతుర' నవల టీనేజ్

సమీక్షకుని పేరు : ..................................................

చిరునామా : ..................................................

..................................................

..................................................

..................................................

లీనమైవున్న సమయాన ఎవరో గుమ్మంముందు తచ్చాడుతున్నట్టు తోచి రాజ్యలక్ష్మి, తలపైకెత్తి.

"ఎవరక్కడ?" అంది.

గుమ్మం వెనుకనుండి శ్యామల ముందుకు వచ్చింది. బెదురు కళ్ళతో స్టాఫ్‌రూముని పరికిస్తోంది. ఎనిమిదవ తరగతివరకు ఆ అమ్మాయికి రాజ్యలక్ష్మి సైన్సు టీచరు. ఈ రెండేళ్ళల్లో శ్యామల ఎంతో ఎదిగి పోయింది. లంగా జాకెట్టు వేసుకునే శ్యామల ఓణీలు వేసుకుంటున్నది. క్రొత్తగా తన శరీరం మీదకు వచ్చిన ఓణీ జారకుండా నడుంచుట్టూ త్రిప్పి దోపుకుంది. ఆమె చిన్నారి శరీరంమీద యౌవనం తన తొలి అడుగు వేసింది. కళ్ళల్లో నుండి బాల్యం వెళుతూ వెళుతూవుంది. మంచుకు తడిసిన మల్లెమొగ్గలా స్వచ్ఛంగా నిర్మలంగా వుంది.

"ఏమ్మా? శ్యామలా? ఏం కావాలి?"

"వాసు మాస్టారు లేరా టీచర్?" అనడిగింది శ్యామల తలదించుకునే. అతని పేరు ఉచ్ఛరిస్తోంటేనే ఆమె బుగ్గల్లోకి కెంపు రంగు ఎగచిమ్మింది. బుగ్గలు రెండూ మల్లెరేకుల మీద కుంకుమ అందిన చందాన వున్నాయి.

"లేరమ్మా! బయటకు వెళ్ళారు. పోస్టాఫీసు కనుకుంటాను. క్లాసు వుందా మీకు?"

"లేదు టీచర్! లెక్కల్లో కొంచెం అనుమానాలున్నాయి. చెప్పించుకుందామని"

ఇంటర్వెల్‌లో రా. అప్పుడుంటారు" అంది రాజ్యలక్ష్మి తిరిగి పుస్తకంలో లీనమవుతూ.

శ్యామల నిరాశగా వెనుతిరిగింది. ఆ అమ్మాయి గుమ్మంవరకూ వెళ్ళేసరికి వాసు మెట్లెక్కుతున్నాడు. ఇద్దరూ ఒకరికొకరు ఎదురయ్యారు. ముఖం పుస్తకంలోనే వుంచి రాజ్యలక్ష్మి కళ్ళెత్తి యిద్దరినీ పరికించి చూసింది. శ్యామల ముఖం అటువైపు ఉండటంతో ఆమెకు ఆ అమ్మాయి భావాలు చూసే అవకాశం లభించలేదు. కానీ, వాసు ముఖంలో కొంచెం తడబాటు, ఉద్వేగం కన్పించాయి. అతను శ్యామలను పలకరించను కూడా లేదు. ఒక లిప్తపాటు ఆమెవద్ద ఆగి లోపలకు వచ్చేశాడు.

శ్యామల కూడా అతనితో ఏమీ మాట్లాడలేదు. మెల్లగా మెట్లు దిగి వెళ్ళిపోయింది. రాజ్యలక్ష్మి వాసువైపు చూసింది. అతను వచ్చి తన టేబిల్ ముందు కూర్చున్నాడు. నుదుట పట్టిన చెమట తుడుచుకుని కూజాలోనుండి మంచినీళ్ళు వంచుకుని తాగాడు. ఒక అయిదు నిమిషాల తర్వాత అతను స్థిమితపడ్డాడని రూఢి అయినాక రాజ్యలక్ష్మి యాధాలాపంగా అన్నట్టు అంది.

"వాసూ! నీ కోసం శ్యామల వచ్చింది"

అతను ఉలిక్కిపడ్డాడు.

"లెక్కలు ఏవో చెప్పించుకోవాలన్నది"

వాసు తలవూపాడు. రాజ్యలక్ష్మి సన్నగా నవ్వుకుంది. 'శ్యామల సంగతి తెలియదు. కానీ వాసు మాత్రం బాధ్యత తెలిసిన యువకుడు. అతడు తప్పు చెయ్యడు' అనుకుందామె తిరిగి పుస్తకంలో లీనమవుతూ.

★ ★ ★

స్కూలుకు దసరా శలవులు ప్రకటించారు. స్కూలుకు ఎప్పుడు శలవులిచ్చినా శ్యామల చాలా సంతోషపడేది. తెలివిగల పిల్ల కావడంతో ఉపాధ్యాయులందరూ ఆ అమ్మాయిని ముక్తకంఠంతో మెచ్చుకునే వారు. దీనివల్ల, ఆ చిన్ని భుజాలమీద ఎప్పుడూ ప్రథమురాలిగా రావలసిన పెద్ద బాధ్యత ఉండేది. దానికోసం చాలా శ్రమపడి చదవవలసి వచ్చేది. ఆ అలసట తీరటానికి మానసిక విశ్రాంతికి శలవులు చాలా ఉపయోగపడేవి. ఎప్పుడూ చదువుతూ వుండటంవల్ల నోట్సులు రాసుకోవటం, పుస్తకాలకు అట్టలు వేసుకోవటం, బట్టలన్నీ సరిచూసుకోవటం, వంటి చిన్నచిన్న పనులన్నీ పెండింగు ఉండిపోయేవి. అందువల్ల శ్యామలకు శలవులు చాలా అపురూపంగా తోచేవి. శలవులివ్వగానే ఈ చిన్నా చితకా పనులన్నీ గబగబా నాలుగయిదు రోజుల్లో తెమిల్చేసుకుని మెదడంతా 'ఓవర్‌హాల్' చేసుకునేందుకు వీలుండేది. ఇప్పుడు దసరా శలవులనగానే శ్యామలకు గుండెల్లో బాంబు పేలినట్టయింది. ప్రతిసాయంత్రమూ, ఉదయమవుతుందనే ఆశతో యింటికి వెళ్ళేది. యిప్పుడు శలవులంటే పదిరోజులు తనకు మాస్టారు

కనపడరు. ఎలా? ఎలా? అన్పించింది. లేడి కూనను అడివిలో వదలి నిప్పుపెడితే పొగకు ఊపిరందక ఎలా కొట్టుకుంటుందో శ్యామల హృదయం ఈ వియోగాన్ని తలచుకుని అలా తల్లడిల్లింది. ఎన్నోసార్లు ఆ అమ్మాయిని వదలి తల్లి పుట్టింటికి వెళ్లింది. 'అమ్మ లేదు. తోచటం లేదు' అనుకునేది 'ఇంకో మూడురోజుల్లో అమ్మొస్తుంది' 'ఇంకో రెండురోజుల్లో అమ్మొస్తుంది' అని రోజులు లెక్కపెట్టుకునేది. కానీ, యిలా ప్రపంచం ఆగిపోతుందనే భావన ఎప్పుడూ కలగలేదు. ఈ సాయంత్రం ఇంటికి వెళితే మరోరోజు తెల్లవారదు అన్పించింది. వదలలేక వదలలేక స్కూలు వదలి, బరువయిన మనసుతో యిల్లు చేరింది.

★ ★ ★

స్కూలుకు శలవులిచ్చారని శ్యామల యింట్లో చెప్పలేదు. రోజూలాగానే తయారయ్యి, స్కూలుకు వచ్చింది. రోజూలా ఉత్సాహంగా లేదు, తడబాటులేదు, నిరీక్షణలేదు, నిర్లిప్తంగా నిరుత్సాహంతో స్కూలుకు వచ్చింది. ఎందుకు వచ్చిందో ఆ అమ్మాయి మనసు ఆ అమ్మాయికే తెలీదు.

స్కూలులో అనుకోని దృశ్యం ఎదురయింది. స్టాఫ్ రూము తెరిచివుంది. 'ఆ గదిలో వాసు మాస్టారు వుండి వుంటారా?'

ప్యూన్ రంగయ్య,

''ఏం శ్యామలమ్మా? శలవుల్లో కూడా స్కూలికి వచ్చినావు?'' అని ప్రశ్నించాడు.

''ఏం లేదు రంగయ్యా! యిక్కడయితే చదువుకోవటానికి బాగుంటుందని''

''ఊరి చివరి బడి. ఒంటరిగా యిక్కడొద్దులే. ఇంటికి పో'' అన్నాడతను.

యాధాలాపంగా తలత్రిప్పి చూస్తే స్టాఫ్ రూములో ఎవరో కదులుతున్నట్టు తోచింది.

''ఆ గది తెరిచి వుందేం రంగయ్యా!''

''వాసు మాస్టారు ఏదో రాసుకుంటూ ఉండారు''

శ్యామల యింకేమీ మాట్లాడలేదు. వెళ్ళి తన క్లాసు రూములో కూర్చుంది. అక్కడికి కిటికీలోనుండి వాసు కన్పిస్తున్నాడు. తలవంచి ఏదో రాసుకుంటున్నాడు. ఆమె అతన్నే చూస్తూ కూర్చుంది. అతను కూడా కొంత సేపటికి తలపైకెత్తి చూసాడు. ఎదురుగా క్లాసులో కూర్చుని శ్యామల యిటే చూస్తున్నది. 'శలవుల్లో కూడా ఈ పిల్ల స్కూల్లో ఏం చేస్తున్నది? అనుకుని అతను తలదించుకుని మళ్ళీ టీచింగు నోట్సు రాసుకుంటూ కూర్చున్నాడు. అరగంట తర్వాత తల ఎత్తి చూస్తే శ్యామల అదే భంగిమలో కూర్చుని వుంది. తనకు తెలియకుండానే అతను బలంగా నిశ్వసించాడు.

'అయ్యో! స్కూలు ఫైనల్లో ఈ అమ్మాయి సమయమంతా వృధాచేసుకుంటున్నదే' అని తోచి మనసు చివుక్కుమన్నది. అయినా కొంత సంతోషం కలగకపోలేదు. అకారణ సంతోషం! వాసు కూడా తనను గమనిస్తున్నాడని తోచగానే శ్యామల కొంచెం స్తంభం చాటుకు తప్పుకున్నది. అతను నోట్సు తయారుచేసుకుంటూనే వున్నాడు. గంట గడిచింది. రెండు గంటలు గడిచాయి. అతను అప్పుడప్పుడూ ఓరకంటితో స్కూల్‌ఫైనల్ క్లాసువంక చూస్తూనే వున్నాడు. స్తంభం చాటునుండీ పచ్చ ఓణీ రెపరెపమంటున్నది. అతను ఉత్సాహం పుంజుకుని రాస్తూనే వున్నాడు. సమయం ఒంటిగంట దాటుతుండగా అతనికి ఆకలివేసింది. తను ఎంతసేపు స్టాఫ్‌రూములో ఉంటే, ఆమె కూడా అంతసేపు క్లాసురూములో వుంటుందని అతనికి తోచింది. నోట్సు పక్కనపెట్టి లేచి గబగబా బయటకు వచ్చాడు.

''రంగయ్యా! తలుపులు వేసెయ్యి. రేపటి నుండి నేనురాను'' అన్నాడు కంఠస్వరం హెచ్చించి, శ్యామలకు వినిపించాలనే వుద్దేశ్యంతోనే.

''అలాగేనయ్యా!'' అన్నాడు రంగయ్య.

వాసు చకచకా నడుచుకుంటూ గేటువరకూ వచ్చి అప్రయత్నంగా తల తిప్పి చూసాడు. యింకా స్తంభం చాటునుండి పచ్చ ఓణీ కనిపిస్తూనే వుంది. అతను ఆశ్చర్యపడి, సందేహిస్తూనే వెనక్కు తిరిగి వచ్చి, దగ్గరకు వెళ్ళి చూశాడు. ఆ పచ్చటి వస్తువు శ్యామల తాలూకు ఓణీ కాదు. స్కూలు ఫంక్షన్ సందర్భంగా ఎప్పుడో అంటించిన పచ్చని రంగు




కాగితం! అతనికి నవ్వొచ్చింది. ఈ పచ్చటి కాగితం తనను రెండు గంటలపాటు ఉత్తేజపరిచింది. కాదు... కాదు... ఆ కాగితానికి తాని చ్చిన ప్రాధాన్యత... తన మనోభావన తనను ఉత్తేజపరిచింది. 'అంతా మనసులోనే వుంది' అంటే యిదే కాబోలు! అతను అటునుండి అటే హెూటలుకు వెళ్ళి భోజనం చేసి, గదికి చేరుకున్నాడు. మంచం మీద పడుకుని తనను తానే శోధించుకున్నాడు. నా మనసులో ఏమున్నది? నాకేం కావాలి? ఎంతో సమయం గడిచాక అతనికి అన్పించింది. ఎవరికయినా కావలసింది శాంతి. ఈ శాంతిని కొనుక్కోవాలంటే కొన్నింటిని, ఎంత ప్రియమయిన వాటినయినా సరే త్యజించవలసిందే. అది ప్రథమంలో కష్టతరంగా తోచవచ్చు. అయినప్పటికీ భవిష్యత్తులో అందరికీ అదే మంచిది. అతనికి శలవులయినప్పటకీ యింటికి వెళ్ళాలన్పించలేదు. 'నేను యింట్లో వాళ్ళను ఎదుర్కొనడానికి మానసికంగా సిద్ధంగా లేను' అనుకున్నాడతను. అలాగని, యిక్కడే వుండి, అగ్ని పరీక్షను ఎదుర్కొనే ధైర్యమూ లేదు. అందుకే, స్నేహితుడి యింటికి ప్రయాణం పెట్టుకున్నాడు.



"ఎక్కడికీ శలవుల్లో కూడా బయలుదేరావు? పెద్దదానివయ్యావు బాధ్యత తెలుసుకోవద్దూ?" అంది తల్లి కొంచెం కఠినంగానే మరురోజు శ్యామల స్కూలుకు బయలుదేరుతుంటే.

"స్కూల్లో చదువుకుంటాను. ప్రశాంతంగా వుంటుంది" అని గొణిగింది శ్యామల.

"నీ మొహమేం కాదూ? ఊరి చివర బడి. ఏ దొంగ వెధవో పీక నొక్కి పారేశాడంటే తిక్కకుదిరిపోతుంది. యింట్లో చదవటానికేమిటట? యిన్నేళ్ళూ చదువుకోలేదూ?"

శ్యామలకు తల్లితో యింకా వాదించటానికి భయంవేసింది. మౌనంగా ఆవిడ ఆజ్ఞను పాటించింది. పుస్తకాలకు అట్టలు వేసుకుంది. హెూం వర్కులు చేసింది. పెన్నులు శుభ్రం చేసింది. తల్లికి వంట పనిలో సాయంచేసింది. ఎంత చేసినా కాలం కదలనని మొండికేసింది. తల్లితో చెప్పి సంధ్య దగ్గరకు వెళ్ళింది. సంధ్యకికూడా నోట్సులు రాసుకోవటంలో సహాయం చేసింది. స్నేహితురాళ్ళిద్దరూ చాలాసేపు స్కూలు కబుర్లు చెప్పుకున్నారు. సంధ్య యాథాలాపంగా వాసు పేరెత్తిన ప్రతిసారీ శ్యామల గుమ్మడికాయల దొంగలా భుజాలు తడుముకున్నది. స్నేహితురాలు తన మనసు పొరల్లోకి గుచ్చిగుచ్చి చూస్తోన్న భావన కలిగింది. అక్కడినుండి యిద్దరూ వేణుగోపాల స్వామి గుడికి వెళ్ళారు. దైవదర్శనం తర్వాత యిద్దరూ మంటపంలో కూర్చున్నాక,

"దేవుణ్ణి ఏం కోరుకున్నావే శ్యామలా? "అనడిగింది సంధ్య.

"నువ్వు!" అని ఎదురు ప్రశ్నించింది శ్యామల.

"మామూలే. పబ్లిక్ పరీక్షలో పాసవ్వాలని మాయింట్లో యిప్పటి వరకు ఎవరూ మొదటిసారి స్కూలు ఫైనల్ పాసవలేదనుకో మానాన్నగారితోసహా" సంధ్య నవ్వింది.

శ్యామలకు గిల్టీగా అన్పించింది. తాను కూడా ఊహ తెలిసినది మొదలు 'భగవంతుడా' ఫస్టు మార్కులతో పాసయ్యేలా చూడు' అని దణ్ణం పెట్టుకునేది. తన కృషి ఫలితమో, దైవకృపో ఎప్పుడూ అలాగే పాసవుతూ వచ్చింది. ఫలితాలు తెలియగానే గుడికి వచ్చి కొబ్బరికాయ కొట్టేది. అటువంటిది ఈ రోజు తాను మొదటిసారిగా పాసవ్వాలనే కోరిక భగవంతుడిని కోరనే లేదు.

"ఏమని దణ్ణం పెట్టుకున్నావే?" సంధ్య రెట్టించి అడిగింది. తాను భగవంతుడిని ఏం కోరుకుందో తిరిగి తలుచుకోవటానికే తనకు ధైర్యం లేదు. బయటకు మిత్రురాలితో చెప్పటం కూడానా?

"నేనూ అంతే!" అని అబద్ధం ఆడేసింది.

సంధ్యను యింటివద్ద దిగవిడిచి, గుమ్మంలోనే నిలబడి యింకో అరగంట కబుర్లు చెప్పి యిల్లు చేరేసరికి పొద్దుపోయింది. అమ్మ ఈ మధ్య తరచూ 'పెద్దదానివవుతున్నావు ఏం తిరుగుళ్ళే' అని కోప్పడటం రివాజై పోయింది. భయపడుతూ యింట్లోకి వచ్చింది. కానీ అమ్మ కోప్పడ్డానికి తీరిక లేకుండా వంట యింట్లో హడావుడిపడుతూ కన్పించింది. శ్యామలను చూడగానే మందలించటానికి బదులు,



"రావే శ్యాము! అత్తయ్యా, పిల్లలు వచ్చారు చూడు. నువ్వు కూడా శలవులని తోచక కొట్టుకుంటున్నావు. సమయానికి వచ్చారు కదూ!" అంది.

శ్యామల తల్లికోప్పడనందుకు, చుట్టాలు వచ్చినందుకు నిజంగానే సంతోషపడింది.

★ ★ ★

అత్తయ్య పిల్లల్లో శ్యామల ఈడు వాళ్ళెవరూ లేరు. పెద్దవాడు రవి. యిరవై ఏళ్ళవాడు.



మొదటిసంవత్సరం బియ్యే చదువుతున్నాడు. అతని తర్వాత ఆడపిల్లలిద్దరూ కవలలు. లలిత, పద్మిని వాళ్ళ పేర్లు. పన్నెండు సంవత్సరాల వాళ్ళు. ఎనిమిదవ తరగతి చదువుతున్నారు. తన ఈడు పిల్లలు కాకపోయినా, కాలం గడవక కష్టపడుతోన్న శ్యామల ఆడపిల్లలిద్దరితోనూ, చిన్న పిల్లలా కలిసి మెలిసి ఆడింది. మట్టి తీసుకువచ్చి పెరట్లో బొమ్మరిల్లు కట్టింది. తన బొమ్మలు ఏనాడో మూలపడవేసినవి తీసి వంటలు చేసింది. బొమ్మల పెళ్ళిళ్ళు చేసింది.

''ఏంటమ్మా అర్థంలేకుండా చిన్న పిల్లలతో చేరి బువ్వాలాటలు ఆడుతున్నావు? ఈ ఏడాది పబ్లిక్ పరీక్షలు కాదూ! చదువుకో రాదూ?'' అని తండ్రి మందలిస్తే, తల్లి కూతురిని వెనకేసుకు వచ్చింది.

''అది చదువులో ఎప్పుడూ ఫస్టే. దానికి మనం చెప్పటం అనవసరం. ఏమీ తోచటం లేదంటోంది ఆడుకోనివ్వండి'' అంది.

రవి మాత్రం ఆడపిల్లల్తో కలవకుండా వాళ్ళ ఆటలు గమనిస్తూ కూర్చున్నాడు.

సాయంత్రంవేళ, ''నాకేమీ తోచటంలేదు. అలా ఊళ్ళోకి వెళ్ళొస్తాను'' అని బయలుదేరాడు. శ్యామల లలితతోనూ, పద్మినితోనూ గచ్చనగాయలు ఆడుతూ కూర్చుంది.

రవి గుమ్మంవరకూ వెళ్ళినవాడల్లా ఆగి,

''వేణుగోపాలస్వామి గుడికి ఎటువైపు శ్యామలా?'' అనడిగాడు. శ్యామల ఆట ఆపకుండానే తలపైకెత్తి.

''నువ్వు యిదివరకు వచ్చినపుడు ఎటు వైపో యిప్పుడు కూడా అటువైపే బావా!'' అని సమాధానం చెప్పింది.

శ్యామల సమాధానం విని తల్లీ, అత్తయ్యా యిద్దరూ నవ్వుకున్నారు. రవి మాత్రం ఉక్రోషపడి,

''నాకు గుర్తులేదు. అందుకని అడిగాను. కొంచెం వచ్చి చూపించవచ్చుగా'' అన్నాడు ముక్కు పుటాలు ఎగరేస్తూ.

ఆడపడుచు కొడుక్కి కోపం వచ్చిందని తల్లి గ్రహించింది. ''శ్యామూ! ఆట ఆపి ఒక్కసారి బావతో గుడికి వెళ్ళిరా. ఏంటి చిన్నపిల్లలతో ఆటలు నీకు?'' అంది తెచ్చిపెట్టుకున్న కోపంతో.

శ్యామల అయిష్టంగానే ఆట ఆపి అతనితో బయలుదేరింది. శ్యామలను అనునయించటానికి అతనే సంభాషణ ప్రారంభించాడు.

''కోపం వచ్చిందా శ్యామలా?''

''లేదు'' అంది శ్యామల ముక్తసరిగా.

''ఎందుకు లేదు? అదుగో వచ్చింది. అక్కడ ముక్కుమీద కనిపిస్తోంది. చూపిస్తానుండు'' అని అతను దగ్గరకు వచ్చి ముక్కు పిండాడు.

''అబ్బ! వదులు బావా! నెప్పి'' అని శ్యామల గింజుకుంది.

ఆ అమ్మాయికెందుకో అతను అంత దగ్గరగా రావటం నచ్చలేదు. దారిలో సంధ్య యిల్లు కన్పించింది. శ్యామల హుషారుగా అటువైపు వెళ్తోంటే-

''ఏయ్! అటెక్కడికి'' అని అతను చేయి పట్టుకుని ఆపాడు.

''ఇది మా ఫ్రెండు యిల్లు. దాన్ని కూడా తీసుకువస్తాను. సరదాగా వుంటుంది''

''మనమధ్యలో ఆపిల్లెందుకు? వద్దు. రా'' అన్నాడతను యింకా చేయి వదలకుండానే. శ్యామల చేయి వదలించుకుంది.

ఇద్దరూ గుడికి వెళ్ళి, దైవదర్శనం చేసుకుని వచ్చి మంటపంలో కూర్చున్నాక,

''ఏమని మొక్కుకున్నావు శ్యామలా?'' అనడిగాడు.

''పబ్లిక్ పరీక్షల్లో స్కూలు ఫస్టు నేనే రావాలని దణ్ణంపెట్టుకున్నాను'' అంది శ్యామల. ఆమెకు హఠాత్తుగా మూడు రోజులక్రితం స్నేహితురాలితో రావటం గుర్తుకు వచ్చింది. ఆ రోజు తనీ కోరిక కోరుకోనే లేదు. 'బడి తెరవటానికి యింకా మూడు రోజులుంది' అనుకుంది నిరుత్సాహంగా. రెండు రోజులుగా చుట్టాల రాకతో తెచ్చి పెట్టుకున్న ఉత్సాహమంతా చేత్తో తీసేసినట్టు మాయమయింది.

''సిల్లీ! అది కూడా ఒక కోరికేనా?'' అన్నాడు రవి వెక్కిరింతగా.




''అయితే నువ్వేం కోరుకున్నావో చెప్పు''

''పాసవ్వాలని కోరుకోవటంలో నాకేం నమ్మకం లేదు. నేను మనిషి కృషిని నమ్ముతాను''

''మరయితే స్కూలు ఫైనల్లో ఒకసారి, పియ్యూసీలో ఒకసారి తప్పావుగా'' అంది శ్యామల కొంచెం కసితోనే. తన కోరికను ఎగతాళి చేయటం ఆ అమ్మాయికి నచ్చలేదు.

రవికి ఆమె అలా దెప్పటంతో చాలా కోపం వచ్చింది. కానీ సంబాళించుకున్నాడు.

''ఓ అదా! అది హిందీలో తప్పానులే. అయినా తెలుగూ, హిందీ, సోషలూ యివన్నీ ఆడపిల్లల సబ్జక్టులు. మా మగవాళ్ళకి అందులో మార్కులు సరిగ్గా రావు'' అన్నాడు బడాయిగా.

''మరి మీ మగవాళ్ళకి మార్కులు ఎందులో సరిగ్గా వస్తాయి?'' అనడిగింది మీ మగవాళ్ళ దగ్గర ఒత్తి పలుకుతూ.

''ఇంగ్లీషూ, సైన్సూ, లెక్కలూ...''

''అట్లా అయితే నేను కూడా మగవాణ్ణే అన్నమాట. ఎందుకంటే ఆ మూడు సబ్జెక్టుల్లోనూ మా క్లాసులో ఎప్పుడూ నాకే మొదటి మార్కు వస్తూ ఉంటుంది. మరి నీకు లెక్కలు, సైన్సు బాగా వస్తే మామయ్య బియ్యేస్సీలో నీకు సీటు రాలేదు, అందుకని బియ్యేలో చేర్పామని చెప్పాడే'' ముఖమయితే సీరియస్‌గా పెట్టి అందిగానీ ఆమె కళ్ళు నవ్వటం కన్పిస్తూనే ఉంది. రవి చటుక్కున లేచి బిరాబిరా వెళ్ళిపోయాడు. శ్యామల వెనుక నుండి, ''బావా! బావా'' అని కేక వేస్తూనే వుంది. అతను విన్పించుకోనట్టే వెళ్ళిపోయాడు.

★ ★ ★

ఒంటరిగా తిరిగి వచ్చిన శ్యామలను చూసి తల్లి, ''అదేమే? ఒక్కదానివే వచ్చావు? బావ ఏడీ?'' అనడిగింది. తను బావను ఏడ్పించిన సంగతి, అతను అలిగి వెళ్ళిపోయిన సంగతి చెప్పటానికి శ్యామల భయపడింది. అందువల్ల ''బజారులో తిరిగి వస్తానని వెళ్ళాడమ్మా?'' అని చెప్పి తప్పించుకుంది. తర్వాత శ్యామల ఆ విషయమే మరిచిపోయింది. పిల్లలు భోజనాలు చేసే సమయానికి కూడా రవి రాలేదు.

''పిల్లవాడు ఏమయ్యాడు?'' అని ఆడపడుచు కంగారుపడుతోంటే శ్యామల తల్లి,

''ఊరుకోవమ్మా వదినా? నీ కొడుకు చిన్న పిల్లవాడూ కాదు. ఆడపిల్లా కాదు. ఏ సినిమాకో వెళ్ళి వుంటాడు. వస్తాడ్లే'' అని మేళమాడింది.

భోజనాలు చేసి శ్యామలా, లలితా, పద్మినీ వెనుకగదిలో చాపలు వేసుకుని పడుకున్నారు. అందరికీ మంచాలు చాలవుమరి. పగలంతా ఆటలు ఆడి వున్నారేమో పెద్దవాళ్ళు భోజనం చేస్తోండగానే వీళ్ళు నిద్రపోయారు. వాళ్ళ భోజనం పూర్తి అవుతుండగా రవి యింటికి రావటం శ్యామల ఎరుగదు.

''ఎక్కడికి వెళ్ళావురా?'' అని తల్లి అడిగింది. శ్యామల తమ తగాదా యింట్లో చెప్పలేదని అతనికి అర్థం అయింది. వయసులో ఆ పిల్లకంటె పెద్దవాడవటంవల్ల కొంచెం తెలివితేటలు ప్రదర్శించి, ''శ్యామల చెప్పలేదూ?'' అని ఎదురు ప్రశ్నించాడు.

''చెప్పిందిలే. బజారులో తిరిగొస్తానన్నావుట. యింత రాత్రిదాకానా పెత్తనాలు?''

''సినిమాకు వెళ్ళాను''

''అనుకున్నాలే. ఆ సినిమాల పిచ్చితోనే ఒక్కో క్లాసు రెండుసార్లు చదువుతున్నావు. కాళ్ళు కడుక్కురా. మా భోజనాలు అయ్యాయి. నీకు కూడా వడ్డించేస్తుంది అత్తయ్య''

రవి భోజనం చేసి కళ్ళతోనే శ్యామలకోసం వెతుక్కున్నాడు. పెద్దవాళ్ళందరూ వరండాలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. శ్యామల తల్లి అతను మంచంకోసం వెతుక్కుంటున్నాడనుకుని, ''వెనుక వసారాలో వుంది. అక్కడ పడుకోవయ్యా'' అంది. అతను అటు వెళ్ళాడు.

★ ★ ★

శరీరంమీద బరువుగా వుంటే శ్యామలకు మెలకువ వచ్చింది. గదిలో చీకటిగా వుంది. తన పక్కన యిందాక లలిత పడుకున్నది. యిప్పుడు తన శరీరంమీద వున్న కాలూ, చెయ్యీ లలితవి కావటానికి వీలులేదు. చెయ్యి చాచి బెడ్‌లైటు వేసింది. తామిద్దరికీ

మధ్యలో ఎప్పుడు వచ్చాడో, ఎలా వచ్చాడో రవి పడుకుని వున్నాడు. కళ్ళు మూసుకుని వున్నాడు. అతను నిద్ర నటిస్తున్నాడో, నిజంగా నిద్రపోతున్నాడో శ్యామలకు తెలియలేదు. లేచి ముందుగదిలో తల్లి పడుకున్న మంచంవద్దకు వచ్చి నిలబడింది. ఒక్కక్షణం సందేహించి తల్లిపక్కన చోటుచేసుకుని పడుకుంది. కూతురి స్పర్శకు తల్లికి మెలకువ వచ్చింది.

"ఏమ్మా! శ్యామూ?" అనడిగింది.

శ్యామల మాట్లాడలేదు. శ్యామలకి నిద్రలో ఎవరి స్పర్శా యిష్టంవుండదు. ఎంతమంది చుట్టాలు వచ్చినా నేలమీదయినా పడుకుంటుందిగానీ ఎవరిదగ్గరా పడుకోదు. తల్లి ఆశ్చర్యపోయింది. కానీ, పక్కకు ఒత్తిగిల్లి కూతురికి చోటిచ్చింది.

ఉదయం చెల్లెళ్ళమధ్య పడుకొని వున్న రవిని చూసి రాత్రి కూతురు తనవద్దకు ఎందుకు వచ్చిందో గ్రహించుకుంది. ఆడపిల్ల తల్లి కావటాన చివరకు భర్తతోనూ, ఆడపడుచుతోనూ కూడా ఏమీ అనలేదు. ఇన్‌స్టింక్ట్ ప్రకృతి ఆడపిల్లలకు యిచ్చిన వరం! ప్రమాదమని తెలియకపోయినా తమని తాము రక్షించుకోవటం తెలుసు. ఆమె కూతురిని తలుచుకుని కించిత్ గర్వపడింది.

★ ★ ★

సంధ్య వచ్చి, "శ్యామూ! లక్ష్మి వచ్చిందే. చూసి వద్దాంరా..." అని పిలిచింది. మధ్యాహ్నం భోజనాలు పూర్తయి, అందరూ విశ్రాంతి తీసుకుంటున్నారు.

"అబ్బ! బద్ధకంగా ఉంది. నేను రాలేనే" అంది శ్యామల.

"లేదులే! ఓపిక చేసుకుని రా. మళ్ళీ రేపో, ఎల్లుండో వెళ్ళిపోతుంది"

శ్యామల విసుక్కుంటూనే లేచి వెళ్ళింది. ముఖం కడుక్కుని, బట్టలు మార్చుకుని, దొడ్లోకి వెళ్ళి కాసిని కనకాంబరాలు, ముళ్ళగోరింట పూలు కోసింది. లక్ష్మికి పూలంటే విపరీతమయిన పిచ్చి!

"అమ్మా! లక్ష్మిదగ్గరకు వెళ్ళివస్తాము నేనూ, సంధ్యా!" అని తల్లికి చెప్పి బయలుదేరింది.

లక్ష్మి పదవతరగతివరకు వాళ్ళతో కలిసి చదువుకుంది. ఆ అమ్మాయి అక్క పెళ్ళిలో పెళ్ళికొడుకు తరపువాళ్ళు ఎవరో చూసి, 'పిల్ల బాగుంది. పనిమంతురాలు' అని మెచ్చుకుని కోరి మరీ చేసుకున్నారు. లక్ష్మి చదువులో పెద్ద తెలివిగలది కాదు. ఆ అమ్మాయికి పెళ్ళి అవగానే చదువు ఆగిపోతుందని శ్యామలా, సంధ్యా చాలా విచారించారు. కానీ, ఆ అమ్మాయేమీ విచారించలేదు. కొత్త బట్టలూ, నగలూ చూసుకుని చాలా మురిసిపోయింది. పెళ్ళయిన వెంటనే భర్తతో వెళ్ళిపోయిన పిల్ల యిదుగో మళ్ళీ యిప్పుడే పండుగకు వచ్చింది.

స్నేహితురాళ్ళిద్దరినీ చూసి లక్ష్మి చాలా సంతోషించింది. కాఫీ, ఫలహారాలు తెచ్చి యిచ్చింది. కానీ, ఆ అమ్మాయి ఎంతసేపు మాట్లాడినా, 'మా ఆయన యిలా... మా ఆయన అలాగ...' అంటూ ఆయన స్తోత్రంతో వీళ్ళిద్దరికీ పిచ్చెక్కించింది. పుట్టింట్లో అందరినీ ఏదోవంకన విమర్శించింది. విసుక్కుంది. మెట్టింట్లో అందరూ మానవరూపంలో వున్న దేవతలే పొమ్మంది. లక్ష్మి వ్యవహారం స్నేహితురాళ్ళిద్దరికీ చాలా అసహనం కలిగించింది. కానీ సంధ్యమాత్రం ఆ పిల్లను ఏడ్పించటానికి, "పెళ్ళి చేసుకుంటే బావుంటుందేమే లక్ష్మీ?" అనడిగింది.

"ఓఁ! చాలా బావుంటుంది. మా ఆయనకి నేనంటే ప్రాణం. మీ పెళ్ళిళ్ళెప్పుడే?"

"నేనసలు పెళ్ళే చేసుకోను" అంది శ్యామల రూడ్‌గా. ఇంతలో లక్ష్మి భర్త బయటి నుండి వచ్చాడు.

"ఆయనొచ్చారు... యిప్పుడే వస్తాను" అంటూ లక్ష్మి పడుతూ లేస్తూ లోపలకు వెళ్ళింది. పది నిమిషాలు గడిచినా బయటకు రాలేదు.

"ఛీ! మానర్‌లెస్ బ్రూట్! నేను పోతున్నా" అంటూ శ్యామల లేచి చరచరా బయటకు వచ్చేసింది.

"ఆగవే! నేనూ వస్తున్నా..." అంటూ సంధ్య




శ్యామలను అనుసరించింది.

★ ★ ★

''రవికి సంబంధాలొస్తున్నాయి'' అంది శ్యామల మేనత్త.

మధ్యాహ్నం భోజనం పిండివంటలతో కొంచెం మోతాదు మించి తిన్నందువల్ల, మెలకువ వచ్చినా లేవకుండా శ్యామల మంచంమీదనే అటూ యిటూ దొర్లుతోంది. వంటింట్లో తల్లీ, అత్తా మాట్లాడుకుంటోన్న మాటలు సన్న సన్నగా వినిపిస్తున్నాయి.

''నేనే మేనకోడలు ఉండగా బయటి సంబంధం ఏమిటీ? అంటున్నాను'' అంది తిరిగి మేనత్తే.

దానికి తల్లి ఏమి సమాధానం చెప్పిందో శ్యామలకు వినపడలేదు. అసలు సమాధానం చెప్పనేలేదేమో!

''నువ్వు తెలివిగలదానివి. ఏదీ మాట్లాడవు. అంతా నాతోనే వాగిస్తున్నావు''

''అయ్యో! అదేంకాదు వదినా! మీ అన్నయ్య యిష్టం. దాని యిష్టం. మధ్యలో నేనెవరినీ?''

ఇప్పటికి శ్యామలకు వాళ్ళు మాట్లాడేది తన గురించే అని అర్థం అయింది. చటుక్కున లేచి మంచంమీద కూర్చుంది. తనకు రవి బావ అవుతాడనీ, తమిద్దరికీ పెళ్ళి మాటలు జరగొచ్చనీ, అదీ యింత త్వరలో జరగొచ్చనీ శ్యామల వూహించలేదు. వాళ్ళింట్లో ఆవిధమయిన చర్చ ఎప్పుడూ జరగలేదు. తల్లిదండ్రులిద్దరూ ఆమెనింకా చిన్నపిల్లగానే భావిస్తూ వున్నారు. బావపేరు, పెళ్ళిపేరు చెప్పి చెకబారు హాస్యాలు చేసినవాళ్ళుగానీ, మేళమాడిన వాళ్ళుగానీ లేరు. ఆమె కూడా ఎప్పుడూ ఈవిధమయిన ఆలోచనలు చెయ్యలేదు. శ్యామలకు అకస్మాత్తుగా చాలా ఉడుకుమోత్తనం కలిగింది.

వంటింట్లోకి వెళ్ళి తల్లికీ, మేనత్తకూ మధ్య నిలబడి 'నేనసలు పెళ్ళే చేసుకోను' అని గట్టిగా అరవాలన్పించింది. మళ్ళీ భయంవేసి అటుతిరిగి పడుకుంది.

'నేనీమధ్య అసలు బాగా చదవటంలేదు. అందుకనే పెళ్ళి చేయాలనుకుంటున్నారేమో!' అనుకుంది గిల్టీగా.

కాసేపటికి బయటినుండి తండ్రి వచ్చినట్టున్నాడు. మేనత్త తల్లిని వేసిన ప్రశ్నే ఆయన్నీ అడిగింది. శ్యామల కళ్ళు విప్పార్చుకుని ఒళ్ళంతా చెవులు చేసుకుని తండ్రి ఏమి సమాధానం యిస్తాడా? అని ఎదురుచూసింది.

''ఛ! నోరుముయ్యి. పట్టుమని పదిహేనేళ్ళు లేవు దానికి. యిప్పుడు పెళ్ళేమిటి?'' అన్నాడాయన.

''పోనీ వచ్చే సంవత్సరం చేస్తావా?'' అంది మేనత్త కొంచెం కాళ్ళబేరానికి దిగుతూ.

''చెయ్యను. యింకో నాలుగయిదు సంవత్సరాల వరకు దాని పెళ్ళి వూసెత్తను. అది చదువుల సరస్వతి. బాగా చదువుకుంటుంది'' అన్నాడు తండ్రి ఖరాఖండిగా.

''అన్నాళ్ళు నా కొడుకు దీనికోసం ఆగడు'' అంది మేనత్త బెదిరింపు ధోరణిలో.

''వద్దు... అక్కర్లేదు. ఆగినా వాడికే నేను నా కూతురిని యిస్తానని హామీ యివ్వలేను. అప్పటికి దాని యిష్టం. నా యిష్టం ఎలా గుంటాయో!''

''అయితే మేము రేపు వూరు వెళ్ళిపోతాం!''

''అది నీయిష్టం. నన్ను బెదిరిస్తున్నానని మాత్రం అనుకోకు. నిన్ను సంతోషపెట్టడంకోసం ఫస్టు మార్కులతో పాసయ్యే నా కూతురిని చదువు మాన్పించి, ప్రతి క్లాసూ రెండేళ్ళు చదివే రవికిచ్చి పెళ్ళి చెయ్యను'' అన్నాడాయన చివరిగా.

తండ్రికి తన చదువుమీదగల నమ్మకానికి శ్యామలకు గర్వమూ, సంతోషమూ కలిగాయి. కానీ, ఈమధ్య తాను చదవటంలేదని తోచి కొంచెం తప్పుచేసిన భావన కలిగింది. 'ఇవాల్టి నుండి బాగా చదువుతాను' అని తనలో తాను శపథం చేసుకుంది.

★ ★ ★

బెదిరించిందేగానీ, శ్యామల మేనత్త వూరు వెళ్ళనేలేదు. తండ్రి పండుగకు యింటిల్లపాదికీ బట్టలు కొన్నాడు. మేనత్తకూ, ఆమె పిల్లలకూ కూడా. అందరూ తలంటుకుని, కొత్త

బట్టలు వేసుకుంటే శ్యామల,

''అమ్మో! మాసిపోతాయి. నేను వేసుకోను'' అంది. చిలకాకుపచ్చలంగా, జాకెట్టు, తెల్ల జార్జెట్ ఓణీ చూడగానే ఆమె స్కూలు తెరిచిన రోజు వాటిని వేసికెళ్ళాలని నిర్ణయించుకుంది.

''నీ మొహం! మాసిపోతే ఉతుక్కోవచ్చులే. పండుగరోజు కూడా పాతబట్టలు వేసుకుని తిరుగుతావా?'' అని తల్లి కోప్పడింది.

''రేపు బడి తెరుస్తారమ్మా. బడికి వేసుకుని వెళతాను''

''ఏడిచావు పిచ్చికుంకా! రేపు కాకపోతే ఎల్లుండి వేసుకెళ్ళొచ్చు బడికి. వెళ్ళు. వెళ్ళి బట్టలు మార్చుకుని కొత్తబట్టలు వేసుకో' అంది తల్లి.

శ్యామల వెనుకగదిలో బట్టలు మార్చు కుంటోంటే ఎవరో తలుపు తట్టారు.

''వస్తున్నా... వస్తున్నా''

గబగబా ఓణీ దోపుకుని తలుపు తీసింది. ఎదురుగా రవి నిలబడి వున్నాడు.

''నా పెట్టెలో బెల్టుంది. తీసుకుంటాను'' అన్నాడతను సంజాయిషీగా. అతని ఒంటి మీద కొత్తబట్టలున్నాయి. పాంటు కొంచెం జారుతున్నట్టుంది. ఎడమచేతితో పట్టుకుని ఉన్నాడు. అతను లోపలకు వెళ్ళే ప్రయత్నం ఏమీ చెయ్యకుండా అలాగే నిలబడి శ్యామలను నఖశిఖ పర్యంతమూ తినేసేలా చూస్తున్నాడు.

''అడ్డులే. నేను బయటకు వెళ్ళాలి'' అంది శ్యామల. అతను హఠాత్తుగా శ్యామలను పట్టుకుని గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు. శ్యామల విదిలించుకుని, ఊచిపెట్టి చెంప పగలకొట్టి చరచరా బయటకు వచ్చేసింది.

శ్యామల బయటకయితే వచ్చిందిగానీ, శరీరమంతా సన్నగా కంపించటం మొదలయింది. 'బావ వెళ్ళి అమ్మావాళ్ళతో చెప్తాడేమో! పెద్దవాళ్ళు తనని కోప్పడతారేమో అని వణికిపోయింది. అకస్మాత్తుగా ఆమెకు దుఃఖం కూడా కలిగింది. పెరట్లోకి వెళ్ళి భోజనాల సమయంవరకూ ఏడుస్తూ కూర్చుంది. అప్పుడు కూడా తల్లి,

''శ్యామల ఏదీ! ఉదయంనుండీ కనపడలేదు'' అని వెతుక్కుంటూంటే బలవంతంగా దుఃఖం ఆపుకుని ముఖం కడుక్కుని లోపలకు వచ్చింది. ఆ క్షణంనుండి మరురోజు అత్తయ్యా వాళ్ళు వూరు వెళ్ళేవరకూ శ్యామల తల్లిని వదలలేదు. వదిలితే రవి మళ్ళీ ముద్దు పెట్టుకుంటాడనే భయం కొంతా, తను తల్లివద్ద లేని సమయంలో తాను అతన్ని కొట్టిన విషయం చెప్పేస్తాడేమో అని ఆదుర్దాకొంత! ఈ ఆదుర్దాలో ఆమె రేపే బడి తెరుస్తారని, వాసు మాస్టారు వస్తారని కూడా తాత్కాలికంగా మరిచిపోయింది.

తల్లి కూడా ఎందుకో కూతురు రవిని తప్పించుకుని తిరుగుతోందని గ్రహించి పిల్లలను కాపాడుకునే కోడిలా కూతురిని వెంట వెంట త్రిప్పుకుంది.

ఆ సాయంత్రం అందరూ గుడికి వెళ్ళాలనుకున్నారు. అందరూ తయారయినాక చూస్తే శ్యామల యింకా నీళ్ళగదిలోనే వుంది స్నానంచేస్తూ.

''మీరు వెళ్ళండి అత్తయ్యా! శ్యామల స్నానం అయ్యాక నేనూ, తనూ వస్తాంలెండి'' అన్నాడు రవి చాలా ఉదారంగా.

రవి మాటలు స్నానం చేస్తున్న శ్యామలకు లీలగా విప్పించాయి.

''అమ్మా! అమ్మా! నేను వచ్చేస్తున్నా. నువ్వెళ్ళొద్దు. నా స్నానం అయిపోయింది'' అంటూ కంగారు కంగారుగా అరిచింది.

తల్లి ఏదో అర్థం చేసుకున్నదానిలా నీళ్ళ గది గుమ్మంవద్దకు వెళ్ళి,

''కంగారు లేదమ్మా శ్యామూ! స్నానంచేసి నెమ్మదిగా రా. మనిద్దరం కలిసే వెళ్దాం. సరేనా?' అంది.

''వదినా! నువ్వూ పిల్లలూ వెళ్తూ ఉండండి. కావాలంటే మన రవి మీతో వస్తాడు. నేనూ, శ్యామలా వెనక వస్తాం'' అని ఆడపడుచుతో చెప్పింది.

★ ★ ★

వాసుకు శలవులు విన్సెంట్‌తో బాగానే గడిచాయి. అతను డిగ్రీలో వాసుకు సహాధ్యాయి.




ద్వితీయశ్రేణిలో పాసయిన విన్సెంట్‌కి పెద్ద కోరికలేమీ లేవు. అతను అప్లై చేస్తే వాసుతోపాటు అతనికి కూడా యమ్మేలో సీటు వచ్చి వుండేది.

''లేదు వాసూ! ఎంత చదివినా, ఉద్యోగం తప్పనిసరి. అదయినా పెద్ద చదువులు చదివితే దొరుకుతుందని గ్యారంటీ ఏమీలేదు. నాకు కాబోయే మామగారు బ్యాంకులో క్లర్కుగా వేయిస్తానన్నారు. నేను ఒప్పుకున్నాను'' అన్నాడు.

''ఒకళ్ళు వేయించిన ఉద్యోగం చేస్తావా విన్సెంట్? అదీ క్లర్కుగా?'' అని ఆశ్చర్యపోయాడు వాసు.

''నువ్వు చాలా పిచ్చివాడివి బ్రదర్! నీకింకా లోకంపోకడ పూర్తిగా తెలియలేదు. ఎవరూ వేయించకుండా ఎవరికయినా ఉద్యోగాలు వచ్చినట్టు విన్నావా ఈమధ్యకాలంలో. నేనింకా మంచివాడిని. ఉద్యోగం యిప్పించినవాడికి జెల్ల కొట్టకుండా, వాడి కూతురిని పెళ్ళి చేసుకోవటానికి ఒప్పుకున్నాను. యిక నీ రెండవ పాయింటు క్లర్కుగానా! అని ఆశ్చర్యపోయావు. నేను చదివిన డిగ్రీ చదువుకు అంతకంటె పెద్ద ఉద్యోగాలు వస్తాయా? చూస్తూఉండు వాసూ! భవిష్యత్తులో యమ్మేలూ, పి.హెచ్.డీలూ కూడా ఉద్యోగాలు లేకుండా అల్లాడే రోజొస్తుంది''

''విన్సెంట్! విన్సెంట్! అంత నెగిటివ్‌గా మాట్లాడొద్దు. ప్లీజ్... నువ్వేనా యిలా మాట్లాడేది? ఉద్యోగం యిప్పిస్తున్నాని కృతజ్ఞతతో అతని కూతురిని పెళ్ళిచేసుకుంటావా? ప్రేమించి తప్ప పెళ్ళి చేసుకోనని శపథం చేశావు. కట్నం తీసుకోనని ప్రతిజ్ఞ చేశావు''

''అయ్యో! వెర్రి వాసూ! ఉద్యోగమే నా కట్నం. కృతజ్ఞతతో పెళ్ళేంటిరా? అది పెళ్ళికి నేను విధించిన షరతు. ఉద్యోగానికి అతను విధించిన షరతు పెళ్ళి. నువ్వు సై అంటే నీకు వుద్యోగం వేయిస్తాడు. మరో ఎక్స్ సై అంటే వాడికి పిల్లనిచ్చి ఉద్యోగం వేయిస్తాడు. యిక ప్రేమ అంటావా? ఉద్యోగం లేని మగవాడిని ఏ ఆడదిరా ప్రేమిస్తుంది? అందుకని, జీవితంలో నేనిలా రాజీ పడదలుచుకున్నా. బియ్యేస్సీ మాథ్స్ చదివినవాడికి బ్యాంకు గుమస్తా ఉద్యోగమా అని ఆశ్చర్యపోకు. అగ్రికల్చరల్ బియ్యేస్సీ చదివినవాడింకోడున్నాడు నా వెనుక క్యూలో. నేను వద్దంటే వాడు కొట్టేస్తాడీ ఛాన్సు!''

విన్సెంట్ పెళ్ళికి వాసు వెళ్ళనేలేదు. తర్వాత ఆరు నెలలకు విన్సెంట్ వుత్తరం రాశాడు. ''నా పెళ్ళాం చిన్నపిల్ల. దానికి ఐస్ క్రీం తినటం కూడా నేనే నేర్పాల్సి వచ్చేట్టుంది'' అని. దాని భావం వాసుకి తెలియలేదు. ఆ తర్వాత యిద్దరి జీవితాలు చాలా బిజీ అయిపోయాయి.



విన్సెంట్ వాసుని చాలా సంతోషంగా రిసీవు చేసుకున్నాడు. భార్యను పిలిచి పరిచయం చేశాడు. ఆ అమ్మాయిని చూస్తే తన స్కూలు ఫైనల్ విద్యార్థినులు గుర్తుకు వచ్చారు వాసుకి. బట్టలు కూడా చీరె కాకుండా లంగా, ఓణీ వేసుకుంది. వాసుకి నమస్కారం చేసి లోపలకి వెళ్ళిపోయింది.

''విశేషాలు చెప్పు విన్సెంట్! జీవితం ఎలా వుంది?''

''విన్సెంట్ సమాధానం చెప్పలేదు. వాసు రెట్టించాడు.

''బానేవుంది వాసూ! నీ సంగతి చెప్పు. నీకెలా వుంది?''

''నాకు బాగులేదనుకుంటాను ఫ్రెండ్! నిన్ను డిగ్రీతో చదువు ఆపవద్దని చెప్పి యమ్మే చదివి నేను బావుకున్నదేమీ లేదు. యమ్మేలో థర్డ్‌క్లాసు మాత్రమే వచ్చింది. బియ్యీడీ చేశాను. పెళ్ళి... ఉద్యోగం... అంతా రొటీన్. హైస్కూల్లో లెక్కల పంతుల్ని''

విన్సెంట్ యింకేమీ మాట్లాడలేదు. అతని సాంసారిక జీవితాన్ని ఏవిధంగా అంచనా వెయ్యాలో వాసుకి తెలియలేదు. అతని భార్య... అతని భార్యలా లేదు. చిన్న చెల్లెల్లా వుంది. అతను భార్యపట్ల అనాదరణీయంగా లేడు. కానీ ప్రత్యేకించి ఆదరణీయంగానూ లేడు. ఆమెను ద్వేషిస్తున్నట్టు లేదు. కానీ ప్రేమిస్తున్నట్టూ తోచలేదు. మొత్తంమీద విన్సెంట్ జీవితం చాలా యాంత్రికంగా తోచింది వాసుకి.

ఇదంతా ఒక ఎత్తయితే వాసుని ఆశ్చర్యపరిచిన విషయం మరొకటుంది. సాయంత్రం వాసు లేచే సమయానికి విన్సెంట్ మాయమవుతూ వుండేవాడు. మొదటిరోజు పనివాడిచ్చిన టీ తాగి వాసు రోడ్లు సర్వేచేయటం మొదలుపెట్టాడు. ఏడుగంటలవరకూ తిరిగి యిల్లుచేరితే విన్సెంట్ యింకా రాలేదన్నారు. కొన్నిరోజులు బ్యాంకులో పనికాబోలు. అందువల్ల ఆలస్యమవుతోంది అనుకున్నాడు వాసు. అతను వున్న వారంరోజుల్లో మూడురోజులు బ్యాంకుకు శలవు. ఆరోజుల్లో కూడా విన్సెంట్ జాడలేదు.

''ఎక్కడకు వెళ్ళావు విన్సెంట్?'' అని ప్రశ్నిస్తే అతను నవ్వి వూరుకున్నాడు.

★ ★ ★

వాసు రేపు తిరిగి వచ్చేస్తాడనగా విన్సెంట్ రహస్యం బయటపడింది. ఆరోజు బ్యాంకుకు శలవు. స్నేహితులిద్దరూ భోజనాలు చేసి పడుకున్నారు. వాసుకు మధ్యాహ్నం మూడుగంటలకు మెలకువ వచ్చింది. కానీ, పక్కమీద నుండి లేవకుండా కళ్ళు మూసుకుని పడుకున్నాడు. నాలుగు గంటలకు విన్సెంట్ లేచి, బట్టలు వేసుకుని, టీ తాగి బయటకు వెళ్ళటానికి చెప్పులు వేసుకుంటోంటే వాసు చటుక్కున లేచి,

''ఆగు విన్సెంట్. నేనూ వస్తాను'' అన్నాడు.

విన్సెంట్ ఒక్కక్షణం గాభరాపడిన మాట వాస్తవమే. కానీ, వెంటనే సర్దుకున్నాడు.

''సరే! వెళ్ళి ముఖం కడుక్కునిరా. టీ తాగుదువుగానీ. తర్వాత వెళ్దాం''

వాసు బాత్‌రూంలోకి వెళ్తూ, ''పారిపోవుగా'' అన్నాడు సందేహిస్తూ.

''ఊహూఁ పోను''

వాసు ముఖం కడుక్కుని వచ్చాడు. టీ తాగాడు. ఇద్దరూ బయటకు వెళ్ళోంటే పనికుర్రవాడు ఆశ్చర్యపోయి చూశాడు. విన్సెంట్ భార్య వచ్చి రాత్రికి ఏం కూరలు చేయాలో అడిగి వెళ్ళింది.

ఇద్దరూ బజారులోకి వచ్చాక విన్సెంట్, ''వాసూ! నాతో వస్తున్నావు. నేను అభ్యంతరం పెట్టలేదు. తర్వాత నాకు నీతికథలు చెప్తేమాత్రం వూరుకోను'' అని హెచ్చరించాడు.

ఇద్దరూ ఒక యింటికి వెళ్ళారు.

''నాకు హితుడు, సన్నిహితుడు, స్నేహితుడు... పేరు వాసు. జిల్లాపరిషత్ స్కూల్లో లెక్కల మాస్టారుగా పనిచేస్తున్నాడు. శలవుల్లో నన్ను చూడటానికి వచ్చాడు'' అని ఆ యింటిలో ఎదురయిన యువతికి పరిచయం చేశాడు.

''వాసూ! ఈమె కూడా అంతే. సన్నిహితురాలు, స్నేహితురాలు'' అని కన్నుగీటి ''పేరు శోభ. బ్యాంకులో నా కొలీగ్'' అంటూ పరిచయం పూర్తిచేశాడు.

ఆమెకు దాదాపు తమ వయసే వుంటుంది. లోపలికి వెళ్ళి కాఫీ, ఫలహారాలు తెచ్చింది. కాసేపు వీళ్ళతోపాటు కూర్చుంది. వాసుకు అమితంగా ఆశ్చర్యం కలిగించిన విషయం ఏమిటంటే విన్సెంట్ ఈ యింటిలో కూడా తన స్వంత యింటిలోలాగానే ప్రవర్తించాడు. ఫాంటు, షర్టు విప్పేసి లోపలగదిలోకి వెళ్ళి లుంగీ కట్టుకుని వచ్చాడు. కులాసాగా వాలుకుర్చీలో వాలి, మోడామీద కాళ్ళు ఎత్తిపెట్టుకున్నాడు.

''చెస్ ఆడదామా?'' అనడిగాడు.

మిత్రులిద్దరూ చాలాసేపు చదరంగం ఆడారు. అయినప్పటికీ వాతావరణం కృత్రిమంగానూ, వూపిరి సలపనట్టుగానూ తోచింది వాసుకి.

''ఇక చాలు విన్సెంట్! నేను యింటికి వెళతాను. రేపు ప్రయాణం కూడాను. సామాను సర్దుకుంటాను'' అని లేచి నిలబడ్డాడు.

''పద... నేనూ వస్తాను'' అన్నాడు విన్సెంట్.

లోపలకు వెళ్ళి అయిదు నిమిషాలలో




బయటకు వచ్చాడు. "శోభా! మేము వెళ్తున్నాం. తలుపులు వేసుకో" అని చెప్పి స్నేహితుడితో కలిసి బయటకు వచ్చాడు.

★ ★ ★

వాసూ, విన్సెంట్ శోభ యిల్లు దాటి బయటకు వచ్చారుగానీ విన్సెంట్ యింటికి వెళ్ళలేదు. ఒకరితో ఒకరు మాట్లాడుకోకుండా చాలా సేపు మౌనంగా రోడ్లన్నీ తిరిగారు. చివరకు విన్సెంటే ఒక కల్వర్టుమీద చతికిలబడి, "కాసేపు కూర్చో వాసూ! మళ్ళీ రేపు వెళ్ళిపోతావు" అన్నాడు.

"ఏం మాట్లాడటంలేదే?" అని ఆరా అడిగాడు.

"నువ్వేకదా మాట్లాడవద్దన్నావు"

"ఓహో! బావుందే. నేను మాట్లాడవద్దన్నానా? నీతిబోధలు చెయ్యొద్దన్నాను"

"నేను నీకు నీతి చెప్పేటంత పెద్దవాడినీ, గొప్పవాడినీ కాదు విన్సెంట్. అయినా, నాకేమయినా అర్థం అయితేనేకదా ఏదయినా చెప్పటానికి?"

"నిజం చెప్పు వాసూ? నీకేమీ అర్థంకాలేదా?"

"నాకు అర్థమయినదానికీ, నా స్నేహితుడు విన్సెంట్ భావాలకీ పొంతన కుదరటంలేదు. నా స్నేహితుడు నిజాయితీపరుడు. నిర్భయుడు. తాను నమ్మినదాన్ని దేన్నయినా బాహాటంగా చెయ్యగల ధీశాలి. ఈ విన్సెంట్ గొప్ప హిపోక్రట్‌గా తోస్తున్నాడు నాకు"

"నేనిప్పటికీ నేను విశ్వసించిన దారినే నడుస్తున్నాను వాసూ!"

"ఒకరిని వివాహమాడి మరొకరితో జీవితం గడపటమేనా?"

"అవును వాసూ! నేనేం చెయ్యను? నువ్వు చెప్పు. నా భార్య మీద నాకు అసహ్యంలేదు. ద్వేషం లేదు. ప్రేమ కూడా వుంది. కానీ చూశావుగా, ఎంత చిన్నపిల్లో! పెళ్లికి ముందు తెలియదా! అనొద్దు. అప్పుడు నాకు ఉద్యోగం చాలా అవసరం. పిల్ల ఫొటో చూశాను. పెద్దదిగానే తోచింది, పెళ్ళాడాను. తనకి సెక్స్ అంటే అసహ్యం, చీదర. నేనంటే భయం, ఎలర్జీ. నన్ను చూస్తే భయంతో బిగుసుకు పోతుంది. ఆకలిలా, దాహంలా ఇది ఒక శారీరక అవసరం వాసూ! ఈ అవసరం నాకూ, శోభకూ ఒకరివల్ల ఒకరికి తీరుతుంది. అసహ్యించుకోకు, మై ఫ్రెండ్! నా భార్యను వదిలిపెట్టేటంత కాఠిన్యం నాలో లేదు. ఆమె ఏ తప్పూ చెయ్యలేదు. తప్పేదయినా ఉంటే, అంత పసిపిల్లకి ఇంత వయసు తారతమ్యంలో పెళ్లి చేసిన మా మామది, ఉద్యోగం కక్కుర్తితో మనస్సు లేకుండా మనువాడిన నాది. అందుకే నేను ఆ అమ్మాయి మనసు నొప్పించను. ఒకటే షి విల్ బికమ్ ఏ వుమన్. అపుడు ఆమె ఏ నిర్ణయం తీసుకున్నా నాకిష్టమే. శోభ బాల్య వితంతువు. ఆమెకు నా సాంగత్యం కావాలి. కానీ నన్ను పెళ్లాడే ధైర్యం లేదు. అఫ్‌కోర్స్! నేనూ నా భార్యను వదలి ఆమెను పెళ్లి చేసుకోవటానికి సిద్ధంగా లేననుకో. మా ఇద్దరిదీ మ్యూచువల్ అండర్ స్టాండింగ్, పరస్పరావగాహన. శోభతో నాది జీవితాంతమూ నిలిచే బాంధవ్యం కాదు.

"ఛ!" అన్నాడు వాసు అప్రయత్నంగానే.

"అవును వాసూ! 'ఛ'నే. ఇది నేను కోరుకున్న జీవితం కాదు. నాకు లభించిన జీవితం మాత్రం ఇదే. దీనిలోనే నేను వీలయినంత సుఖాన్నీ, శాంతినీ వెతుక్కోవాలి. నువ్వేమనుకుంటున్నావ్ వాసూ! వివాహేతర సంబంధాలు ఏ పురుషుడికయినా, స్త్రీకయినా అభిలషణీయం, ఆనందాన్ని ఇస్తాయనుకుంటున్నావా? నీ స్నేహితురాలే, నీ ప్రియురాలు, నీ ప్రియురాలే నీ భార్యా కావాలంటే ఆ అదృష్టానికి పెట్టిపుట్టాలి బ్రదర్! అటువంటి భార్యను పొందిన మగవాడు ధన్యుడు. స్నేహమూ, ప్రేమా, దాంపత్యం మూడూ ఒక చోట ముడిపడిన పెళ్లే నిజమయిన పెళ్లి. తతిమావన్నీ ట్రాష్. ఉత్త నాటకం. నేను పెళ్లాడిన వ్యక్తితో నాకు ఇప్పటిలో నూరు శాతం శృంగారం లభించదు. నేను శృంగారం నెరుపుతున్న వ్యక్తిని ఏనాటికీ పెళ్లాడలేను. ఇది నేను నా ఉద్యోగానికి చెల్లించిన మూల్యం"

తర్వాత స్నేహితులిద్దరూ ఏమీ మాట్లాడుకోలేదు. మరురోజు బస్సు కదిలేటప్పుడు మాత్రం వాసు స్నేహితుడిని కౌగలించుకుని,

''రాత్రంతా నీ మాటలే నెమరు వేసుకున్నా ను విన్సెంట్. నీ బాధ నాకు అర్థం అయింది. నీ మీద నాకు కోపంగానీ, అసహ్యంగానీలేవు. స్టిల్ ఐ లైక్ యూ విన్సెంట్. ఉత్తరాలు రాస్తూండు'' అని శలవు పుచ్చుకున్నాడు.

విన్సెంట్ జీవితంలో నాకేదో సందేశం వున్న ట్టేవుంది అనుకున్నాడు వాసు.

★ ★ ★

''అత్తయ్యా వాళ్లు మధ్యాహ్నం బండికి వెళ్తున్నారు. ఈ పూటకు బడి మానెయ్యరా దుటే శ్యామూ'' అంది తల్లి.

''అమ్మో! బడి మానెయ్యటమే... వీల్లేదు... నేను వెళ్లి తీరాల్సిందే'' పుస్తకాలు సర్దు కుంటూంటే శ్యామలకు మళ్లీ అనుమానం కలిగింది. తాను బడికి వెళ్లాక బావ తను చెంప దెబ్బకొట్టిన సంగతి చెపుతాడేమో! ఈ పూటకి బడి మానేస్తేనే మంచిదేమో! కానీ మనసు ఆగనంటోంది. ద్వైదీభావంతోనే స్నానం చేసి బట్టలు మార్చుకుంది. పనిమని షికి నిన్న వేసుకున్న కొత్త బట్టలు ఇచ్చి,

''ఇవాళ తప్పకుండా ఇవి ఉతికి మడతపె ట్టి ఉంచు. రేపు బడికి వెళ్లటానికి బట్టలు లేవు'' అని చెప్పింది.

''మీది మరీ చోద్యమండీ! బడికి వెళ్ళటాని కి ఇంక బట్టలే లేవా మీకు?'' అని పని మనిషి ఆశ్చర్యపోయింది. స్నానం చేసి, మొదటిసా రిగా బడికి వెళ్తున్న దానిలా పుస్తకాలన్నీ పదేపదే సర్దుకుంది. లెఖ్ఖల నోట్సు తిరగేసి, అన్ని లెఖ్ఖలు క్రమంలో చేసి వున్నాయో, లేదో సరి చూసుకుంది. బట్టల పెట్టె ముందు నిలబడి, అరగంట ఆలోచించి బట్టలు ఎన్నిక చేసుకుంది. దొడ్లోకి వెళ్లి పూలు తెచ్చుకుని,

''అమ్మా! మాలకట్టి ఇవ్వు. తల్లో పెట్టు కుంటాను'' అని తల్లి ముందు పోసింది.

''అత్తయ్యావాళ్లు వూరు వెళ్తున్నారు కదూ శ్యామూ! వంట తెమలదమ్మా! ఇవాల్టికి పూలు వద్దులే'' అంటే తల్లిమీద అలిగి మూతి ముడుచుకుంది.

మేనత్త బుజ్జగించి, మాలకట్టి తలలోపె ట్టింది. ఇంతలో సంధ్య, ''శ్యామూ! వస్తు న్నావా?'' అని బయటినుండి అరిస్తే టిఫిన్ బాక్సు తీసుకోకుండానే,

''అమ్మా! నేను వెళ్లొస్తాను'' అంటూ స్నే హితురాలిని అనుసరించింది. స్కూలు దగ్గర వుతోంటే హృదయం ఎన్నడూ లేనంతగా స్పందించింది. సంధ్య మాట్లాడే మాటలేవీ విన్పించటం మానేశాయి. అరిచేతుల్లో చెమట లు పడుతున్నాయి. ట్రాన్స్‌లో వున్న దానిలా స్కూలు చేరింది శ్యామల. ఆవరణలో అడుగు పెడుతూనే స్టాఫ్ రూంవైపు దృష్టి సారించింది. అప్పుడే అసెంబ్లీకి గంట కొట్టారు. స్టాఫ్ రూంలోనుండి టీచర్లు ఒకరొకరు ప్రార్థన జరిగే స్థలానికి వస్తున్నారు. ఆఖరుగా వాసు మెట్లు దిగాడు. బ్రౌన్ కలర్ ఫాంటులో, క్రీమ్ కలర్ షర్ట్ టక్ చేసుకుని వున్నాడు. ఒక చెయ్యి ఫాంటు జేబులో పెట్టుకొని డ్రాయింగ్ మాస్టా రితో ఏదో మాట్లాడుతూ వస్తున్నాడు. శ్యామల, సంధ్యలను చూసి పలకరింపుగా చిన్న చిరున వ్వు నవ్వాడు. శ్యామల కళ్లు అతని కళ్లతో కలిశాయి. తడబడి తలదించుకుంది. శ్యా మలా, వాసుల మధ్య మళ్లీ దాగుడు మూతలు ప్రారంభం అయ్యాయి.

★ ★ ★

చటుక్కున మెలుకువ వచ్చింది రాజ్యలక్ష్మి కి. తల తిప్పి టేబిల్‌మీద వున్న గడియారాన్ని చూసింది. ఒంటిగంటా నలభై నిమిషాల యింది. 'అబ్బ! తెల్లవారటానికి యింకా అయి దు గంటల వ్యవధి వుంది' అనుకుంది విసు గ్గా.

ఒంటరితనమూ, నైరాశ్యమూ రాజ్యలక్ష్మికి అలవాటే. ఆమె జీవితంలో సంతోషంగా గడి పిన రోజులు చాలా తక్కువ. మిగిలిన జీవిత మంతా ప్రయత్నమూ, పోరాటమూ, దుఃఖం, బాధ, నైరాశ్యం, వియోగం ఇవే. ప్రతి జీవితం ఒక పుస్తకమై, అందులో వంద పేజీలుంటే తొంభై తొమ్మిది పేజీలు భగవంతుడు రాస్తాడు. ఒక్క పేజీ నువ్వు రాసుకోవచ్చు అంటుంది ఖురాన్ కాబోలు. కానీ రాజ్యలక్ష్మి జీవిత గ్రంథంలో అన్ని పేజీలూ విధే రాసింది. ఆమె రాయాలని ప్రయత్నించిన రాతలు పిచ్చి గీతలుగానే మిగిలిపోయాయి. అక్షరరూపం




దిద్దుకోలేదు. ఆమె జీవితానికి రాజ్యలక్ష్మి కర్త కాదు. సాక్షి మాత్రమే.

"నేను ఒంటరిని. ఇంత పెద్ద ప్రపంచంలో నాకు ఎవరూ లేరు' అని రాజ్యలక్ష్మి అంటే వినటానికి విచిత్రంగా వుంటుంది. కానీ, అది నిజం. రాజ్యలక్ష్మికి ఎవరూ లేరు- బంధువులు గానీ, స్నేహితులుగానీ. బంధువుల్ని ఆమె వదిలేసింది. స్నేహితులను ఏర్పరుచుకో వటం ఆమెకు చేతకాలేదు.

ఊహ తెల్సిన నాటినుండీ ఈ క్షణం వరకు 'ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్'తో బ్రతికింది. ఎవ రినీ, ఎన్నడూ తన జీవితంలోకి కానీ, మనసులో నికి కానీ తొంగి చూడనివ్వలేదు. ఆమె గుండె ల్లో ఎంత దుఃఖంవుందో, మనసులో ఎంత బాధ సుళ్ళుతిరుగుతోందో తెలిసిన వ్యక్తి ఆమె ఒక్కతే.

రాజ్యలక్ష్మిని ఎన్నడూ బాధించనివి ఆమె భౌతికావసరాలు. పుట్టినది మొదలు యిప్పటి వరకు ఆమె తిండికీ, గుడ్డకూఏనాడూ వెతుక్కో లేదు. కష్టపడలేదు. కానీ, మానసికంగా ఆమె సుఖపడిన లేదా సంతోషపడిన క్షణాలు బహు కొంచెం.

ఇప్పుడు యాభై సంవత్సరాలు నిండిన తర్వాత 'ఎక్కడుంది లోపం? ఎందుకు నా జీవితం యిలా అయింది? ప్రతి స్త్రీకి అనాయా సంగా లభించే సౌభాగ్యం సంతానం నాకెందు కని లభించలేదు? అని రాజ్యలక్ష్మి తనను తాను ప్రశ్నించుకోదలచలేదు. లోపం ఎక్క డుందో ఆమెకు స్పష్టంగా తెలుసు.

స్త్రీ శరీరాన్ని పురుషుడు తన ఆనందంకోసం వెలకు కొనుక్కోవటం నాగరిక సమాజానికి ఎప్పుడు ఎలా అలవాటయిందో, అది సంస్కృతిలో విడదీయరాని భాగం ఎలా అయిందో, దీనికి మూల కారణమేమిటో, ఈ దోపిడీ ఎన్ని వందల సంవత్సరాలుగా సాగు తోందో, యింకా ఎన్నాళ్ళు సాగనున్నదో, దీనికి పరిష్కారం ఏమిటో సెకండరీ గ్రేడు సైన్సు టీచర్ రాజ్యలక్ష్మికి తెలీదు. ఈ ప్రశ్నలు సామా జిక శాస్త్రవేత్తల పరిధిలోనివి. స్త్రీ శారీరక బలహీ నత, వెర్రితలలు వేసే పురుషుడి కామవాంఛ, స్వార్థమూ, శారీరక బలమూ వెరసి పితృస్వా మ్య సమాజజాడ్యంగా వ్యభిచారిణుల సృష్టి జరిగింది. అని చెపితే ఆమె అవును కాబోలు అనుకుంటుంది. బ్రాహ్మణులు పౌరోహిత్యం చేసుకుని, క్షత్రియులు రాజ్యాలేలి, వర్తకు లు వ్యాపారం చేసుకుని, శూద్రులు రకరకాల చేతి వృత్తులలోనూ జీవనసాగించారు. వీళ్ళ ందరూ కలిసి ఒక జాతిని కళావంతులుగా ముద్రించి తమ శారీరక అవసరాలకు అందు బాటులో వుంచుకున్నారు. మీకు వివాహం చేసుకునే హక్కు లేదన్నారు. మీరు సమాజపు ఉమ్మడి ఆస్తి అన్నారు.

రాజ్యలక్ష్మి తన ప్రమేయం ఏమీ లేకుండానే అటువంటి కులంలో ఆడ పిల్లగా పుట్టింది. ఎవరూ తాము అగ్రకులంలో పుట్టి నందుకు ప్రత్యేకం గర్వించరు. నిమ్నజాతిలో పుట్టినందుకు ప్రత్యేకంగా విచారించరు. ఆ నిజాన్ని అన్ని జీవితసత్యాలతోపాటే స్వీకరిస్తా రు. పెద్దయిన కొద్దీ, సమాజం తమపట్ల చూసే ఆదరాన్నిబట్టి లేక అనాదరాన్ని బట్టి పొంగిపో తూనో క్రుంగిపోతూనో వుంటారు. కానీ, రాజ్యల క్ష్మి మాత్రం సమాజం ప్రసక్తి రాకముందే తాను యిటువంటి కులంలో పుట్టినందుకు బాధపడింది. ఆ పంకంలోనుండి బయటపడా లని పోరాడింది. ఆ పోరాటమే ఆమె జీవితం.

ఈ రాత్రి ఎంతకీ రాజ్యలక్ష్మికి నిద్రపట్ట కుండా వుంది. 'నేను నిరాసక్తంగా నిస్తేజంగా బ్రతుకుతున్నాను, ఇలాగే బతకాలనుకుంటు న్నాను. నాకు ఆత్మహత్య చేసుకునే వుద్దేశ్యం లేదు. ఇన్నాళ్ళూ నిర్లిప్తంగా బతికిన నాకు యిప్పుడీ ఆరాటం ఎందుకు? అని ఆమె తనను తాను ప్రశ్నించుకుంది. ఈ ప్రశ్నకు కూడా ఆమెకు సమాధానం స్పష్టంగానే తెలు సు. 'నాకు సానుభూతి కావాలి. నా బాధను పంచుకోవాలనుకుంటున్నాను. అందుకే నాకు ఆరాటం. ఈ అశాంతి' అని తనకు తానే సమాధానం చెప్పుకుంది. కొద్దిక్షణాల తర్వాత లేచి, పెద్దలైటు వేసుకుని రాతబల్లముందు కూర్చుంది.

★ ★ ★

మొదటిసారి అర్ధరాత్రి మెలకువ వచ్చినపు డు స్వరాజ్యానికి అయిదు సంవత్సరాలు. తల్లి పక్కలో లేదు. చిన్నపిల్ల కాబట్టి సహజంగానే



భయం అన్పించింది. దిగులుగా, భీతితో పెద్దగా ఏడ్చింది. ఆ పసిదాని ఏడుపుకు పక్కగదిలోని పకపకలు ఒకక్షణం ఆగాయి. ఆశగా తల్లికోసం ఎదురుచూసిన ఆ పిల్లకు మళ్ళీ పకపకలు మొదలవటంతో తల్లి రాదని అర్ధమయింది. ఈసారి గొంతు పెంచి మరీ ఏడ్చింది. గది తలుపులు ధడాలున తెరుచుకున్నాయి. విరబోసుకున్న జుత్తుతో, చెదరిన బొట్టుతో తల్లి భద్రకాళిలా గుమ్మంలోకి వచ్చి నిలబడింది. ఆమె ఒంటిమీద చీరె లేదు. స్వరాజ్యం తల్లినెప్పుడూ యింత భయంకర రూపంలో చూడలేదు. గుమ్మంలో నిలబడింది తల్లో, లేక తల్లి తాలూకు దయ్యమో దానికి ఒక క్షణం అర్థంకాలేదు. అయినా ఒంటరితనం, చీకటి భయపెట్టడంతో,

''అమ్మా! అమ్మా!'' అంటూ చేతులు చాపింది నిస్సహాయంగా. ఈ ఆక్రోశం తల్లికి చాలా కోపం తెప్పించింది. గదిలోనుండి మగ గొంతు వినుక్కుంటున్నది. ఆమె గబగబ రెండంగల్లో కూతురిని సమీపించి పిర్రలు వాచేలా బాదింది. స్వరాజ్యం కిక్కురుమనకుండా పడుకుంది. చీకటి భయం పోలేదు. కానీ తల్లి దెబ్బల భయం చీకటి భయాన్ని జయించింది. చెవులు పక్క గదిలోని మాటలనూ, నవ్వులనూ వింటూనే వున్నాయి. కళ్ళు యింటి పైకప్పును చూస్తూనే వున్నాయి. స్వరాజ్యానికి మళ్ళీ ఏడ్చే ధైర్యం లేకపోయింది. ఆ పసి హృదయం ఆ క్షణాన ఏం ఆలోచిస్తోందో ఏ రచయిత వూహకీ, ఏ మానసిక శాస్త్రవేత్త పరిశోధనకీ అందని విషయం.

అది మొదలు స్వరాజ్యానికి ప్రతి అర్ధరాత్రీ మెలకువ వచ్చేది. ఒక్కసారి భయంచేతనూ, దిగులుతోనూ నిశ్శబ్దంగా ఏడ్చేది. పైకి వినిపిస్తే తల్లి వచ్చి తంతుందని భయం. ఒక్కసారి ఏడుపు మరిచిపోయిన దానిలా చూస్తూ పడుకునేది.

ప్రతి వ్యక్తీ జీవితంలో శృంగారం గురించి యౌవనానికి కొంత ముందుగానో లేక తర్వాత కొంత కాలానికో తెలుసుకుంటాడు. అది ప్రకృతి సహజం. కానీ, బాల్యంలోనే శారీరక వాంఛ గురించి తెలియడం చాలా దురదృష్టకరం, జుగుప్సాకరమూ కూడా!

ఏడెనిమిది సంవత్సరాలు వచ్చేటప్పటికి స్వరాజ్యానికి సెక్స్ 'సదృశ్యంగా' అర్థమయిపోయింది. సమాజం అప్పుడున్న పరిస్థితిలో, ఆ కులంలో పుట్టిన స్వరాజ్యానికి, ఆ వాతావరణంలోనే పెరుగుతూండగా శృంగారం అర్థంకావటంలో ఆశ్చర్యం ఏమీ లేదు. భీభత్సరస పూరితమయిన ఈ పైశాచిక శృంగారం స్వరాజ్యాన్ని పిచ్చిదాన్ని చేసి వదలాల్సిందే.

కానీ, అలా జరగలేదు.

బడిలో స్వరాజ్యం నలుగురయిదుగురు హరిజన పిల్లల్తో కలిసి ఆఖరు బెంచీలో కూర్చునేది. వాళ్ళు కూడా తరచూ తక్కువచేసి మాట్లాడేవాళ్ళు. కొందరు ఉపాధ్యాయులు తెలిసి కూడా 'నువ్వు రత్నం కూతురివి కాదూ!' అని పలకరించే వాళ్లు. యింకొందరు ప్రబుద్ధులు దగ్గరకు పిలిచి తమ యింటికి ఎవరెవరు వస్తుంటారో అడిగి తెలుసుకునే వాళ్లు. క్లాసులో ఒకళ్లిద్దరు తప్ప మిగిలిన పిల్లలు తనను ఎడంగా వుంచేవాళ్లు. అయినప్పటికీ, స్వరాజ్యానికి బడి బాగా నచ్చింది. ఈ వాతావరణంలో గొను ఎత్తి తనని పరిహసించే వాళ్ళు. బూతులు మాట్లాడేవాళ్ళూ, రక్తం కారేలా తన పాలబుగ్గలను గిల్లేవాళ్ళూ దానికి కన్పించలేదు. బూతులు కాక తెలుగును మరోకలా మాట్లాడొచ్చని దానికి బడికి వచ్చాకనే తెల్సింది. తమ వాడలో అందరూ పగలు నిద్రపోతుంటారు. దానికి ఆ వాతావరణం అసహజంగానూ, అసహ్యంగానూ, వుండేది. స్కూలు పగలంతా చైతన్యంతో కళకళలాడుతుంటుంది. అందరూ చురుగ్గా వుంటారు. కొందరు చదువుకుంటూ వుంటారు. కొందరు ఆడుకుంటూ వుంటారు. ఈ బడీ, ఈ ఆటస్థలం, పాఠాలు స్వరాజ్యాన్ని చాలా ఆకర్షించాయి. అది బడివంక పెట్టుకుని ఉదయం తొమ్మిదిగంటలకే యిల్లు వదిలేది. సాయంత్రం ఆరుగంటలకుచాలా దిగులుగా బందిఖానాకు వెళ్ళే ఖైదీలా కాళ్ళీడ్చుకుంటూ యింటికి వెళ్ళేది.

చదువు చాలా సమస్యలకు పరిష్కారమని కొందరు భావిస్తూ వుంటారు. చదివితే తమ కష్టాలన్నీ గట్టెక్కుతాయని ఆశిస్తారు. స్వరాజ్యం కూడా ఆ విధంగానే భావించింది. నిరు




ద్యోగ సమస్య యిప్పుడున్నంత తీవ్రంగా అప్పుడు లేదు. ముఖ్యంగా చదువుకున్న ఆడపిల్లలు చాలా అరుదుగా వుండేవారు. వాళ్ళను యితరులు కొంత తేలిక భావంతోనూ, గౌరవంతోనూ కూడా చూసేవారు. చదువుకోవాలేగానీ ఉద్యోగం పెద్ద సమస్యకాదు. ఆ కారణంగా స్వరాజ్యం తన సర్వశక్తులూ చదువుపట్లనే కేంద్రీకరించింది.

నాయుడుగారు ఆ ఊరికి పెద్ద. ఆయనకు పెద్దపెద్ద మీసాలుండేవి. ఆ కారణం చేత అందరూ ఆయన్ని మీసాలనాయుడుగారు అనేవాళ్ళు. ఆయన కొడుకు సౌమిత్రి, కూతురు లీల కూడా స్వరాజ్యం క్లాసులో చదువుతుండేవారు. లీల స్వరాజ్యం ఈడుదేగానీ సౌమిత్రి వీళ్ళిద్దరికంటే నాలుగయిదు సంవత్సరాలు పెద్దవాడు. చదువులో అంత చురుకయినవాడుకాదు. ఒక్కొక్కక్లాసు రెండు మూడేళ్ళు చదివి చివరకు చెల్లెలి క్లాసుకి వచ్చాడు. లీలమాత్రం స్వరాజ్యంపట్ల చాలా ఆదరంగా వుండేది. ఆ కారణంగా యితర విద్యార్థులకు స్వరాజ్యాన్ని హేళనచేసే అవకాశం తగ్గిపోయింది. మీసాల నాయుడుగారి అమ్మాయి తలుచుకుంటే ఒక్కొక్కళ్ళ వీపులు పగిలిపోతాయని తెలుసు. సౌమిత్రి కూడా స్వరాజ్యాన్ని బాగానే పలకరించేవాడు. స్కూల్లో స్వరాజ్యానికి ఎవరయినా స్నేహితులున్నారా? అంటే వీళ్ళిద్దరే.

★ ★ ★

ఆ రోజుల్లో, ఆ పల్లెటూరిలో, ఆ కులంలో పుట్టడంవల్ల స్వరాజ్యం ఎన్నో అవమానాలకు గురైంది. పసితనంలో లభించవలసిన ఆదరణ, వాత్సల్యమూ ఆమెకు గగనకుసుమాలే అయినాయి. స్వరాజ్యం బాల్యం ఒక చేదు అనుభవం. అందులో తీపి జ్ఞాపకాలు ఏమీ లేవు. అది మరిచిపోదగినదేకానీ, మధురస్మృతి కాదు.

కానీ, స్వరాజ్యం భవిష్యత్తుమీద పెద్ద ఆశ పెట్టుకుంది. తనకి పెళ్ళి అవుతుందని ఆమె కలలో కూడా తలచలేదు. ఒకే మగవాడి నీడన బతుకును వెళ్ళమార్చాలని కూడా ఆశించలేదు. తను బాగా చదువుకోవాలని మాత్రం కోరుకుంది. చదువుకుంటే ఏ చిన్న వుద్యోగమో వస్తుంది. ఆ ఉద్యోగపు ఆసరాతో శరీరాన్ని అమ్ముకోకుండా బతకొచ్చు. బలవంతపు శృంగారాన్ని అనుభవించనక్కర్లేదు. తను మనసా, వాచా అభిమానించనిదే ఏ మగవాడికీ శరీరాన్ని అప్పగించవలసిన అవసరంలేదు. అమ్మలా ఈ చీకటిలో, జుగుప్సలో తాను బ్రతకగూడదు' అని కోరుకుంది స్వరాజ్యం.

స్వరాజ్యం తల్లి రత్నానికి మాత్రం కూతురంటే చాలా కోపంగా వుండేది. తనకు వయసయిపోతున్నది. ఆడపిల్ల పుట్టిందని సంతోషంగా వుండేదిన్నాళ్ళు. యిప్పుడీ ఆడది చదువని ఎగబడతావుంది. ఇక ముందు ఇల్లెట్టాగ డుస్తుంది? దీనికి ఎప్పటికి బుద్ధి వస్తుంది? దీనికి ఒక ఆటా రాదు. పాటా రాదు. నేర్చుకునే వుద్దేశమూ లేదు, అని విసుక్కునేది.

★ ★ ★

''పదమూడేళ్ళు వెళ్తున్నాయి. జడేసుకోవటం మాత్రం రాదు. తగుదునమ్మా! అంటూ బడికి మాత్రం తయారు''

రత్నం కూతురిని తిడుతూ, అడపాదడపా మొట్టికాయలు వేస్తూ జడ వేస్తోంది. స్వరాజ్యానికి తల్లి అసహనం, అనాదరణ అలవాటే. వాటిని ఆ అమ్మాయి ఖాతరు చెయ్యటం ఏనాడో మానేసింది. తన ఆలోచనల్లో తాను మునిగి తేలుతూ కూర్చుంది తల్లిముందు.

'రేపు సైన్సు మాస్టారు పరీక్ష పెడతానన్నారు. బాగా చదవాలి. తనకి మొదటిమార్కు రావాలి. తొమ్మిదో క్లాసు అయిపోయాక తాను పదిలోకి వెళ్తుంది'

తల్లి ఒక అరుపు అరిచి జుట్టు పట్టుకు గుంజింది.

స్వరాజ్యం చప్పున స్పృహలోకి వచ్చి,

''ఏమిటమ్మా!'' అంది విసుగ్గా.

''పరికిణీమీద ఈ మచ్చలేవిటే?''

స్వరాజ్యం తెల్లమొహం వేసింది. తనకిమాత్రం ఏం తెలుసు? తల్లి ముఖంలోకి అయోమయంగా చూసింది. రత్నం నోటిని ఈ చెవి నుండి ఆ చెవి వరకూ సాగదీస్తూ నిశ్శబ్దంగా నవ్వింది. ఆ నవ్వులోని వెకిలితనం అర్థమై స్వరాజ్యం గుండెల్లో అణుబాంబులు పే

లాయి.



మేనమామ తాటాకులు తెచ్చాడు. చుట్టుపక్కల ఆడవాళ్ళందరూ తరలి వచ్చారు. స్వరాజ్యాన్ని చూస్తూ వెకిలిహాస్యం మొదలుపెట్టారు. దొడ్లో నువ్వులు దంచుతున్నారు. తల్లి తనేదో ఘనకార్యం సాధించిన దానిలా గర్వంగా నిలబడి వుంది. స్వరాజ్యం యీ తతంగాన్నంతా నిర్లిప్తంగా, నిరాసక్తంగా, నిస్సహాయంగా చూస్తూ నిలబడింది. చాలా సేపటికి ధైర్యంతెచ్చుకుని.

"అమ్మా! ఇవన్నీ చేయొద్దే!" అంది వినీవినపడని స్వరాన చాలా అమాయకంగా.

తల్లి నిర్ఘాంతపోయింది.

అన్నదేగానీ స్వరాజ్యానికి తెలీకపోలేదు-ప్రతి ఆడపిల్లా ఈ ఇబ్బందికరమయిన పరిస్థితిని ఎదుర్కొనే తీరాలని. దీనికి కులంపట్టింపేమీ లేదు. కానీ తమ కులంలో దీనిని ప్రత్యేకంగా చాటింపు వేస్తారు వ్యాపార దృక్పథంతో. ఇతర వర్ణాలవారు సంబరంగా జరుపుకుంటారు.

"మరి బేరాలెట్టా వస్తాయే పిల్లా" అంది రత్నం అక్కకూతురు స్వరాజ్యాన్ని విచిత్రంగా చూస్తూ బుగ్గలు నొక్కుకుని. ఆ అమ్మాయికి చాలా బాధ కలిగింది. ఎప్పుడూ ఎవరికీ ఎదురు సమాధానాలు చెప్పగల తెలివీ, ధైర్యమూ ఆ అమ్మాయికి లేవు.

మేనమామ... ఆ పిల్లకంటే ఇరవై సంవత్సరాలు పెద్దవాడు... నిన్నామొన్నటివరకు భుజాలమీద ఎత్తుకు మోసినవాడు. కొత్త తాటాకులు గదిలో పరుస్తూ మేనకోడల్ని చూసి కన్నుమలిపాడు.

ఆ సంఘటన స్వరాజ్యాన్ని చాలా గాయపరచింది. అది తల్చుకుని, ఆ అమ్మాయి మిగిలిన పదమూడు రోజులూ ఏడుస్తూనే వుంది.



పదమూడు రోజులూ దుర్భరంగా, భీతావహంగా గడిచాయి. స్వరాజ్యం శారీరకంగా, మానసికంగా నీరసించిపోయింది. గ్రామఫోను లు వచ్చిన కొత్త. రత్నం కూతురు ముందు సాగించబోయే వ్యాపారాన్ని దృష్టిలో పెట్టుకుని ఖర్చుకు వెరవకుండా ఒక గ్రామ్‌ఫోను అద్దెకు తెప్పించింది. కులపువాళ్ళ డాన్సులూ, పాటలూ మామూలే. పెద్ద ఎత్తున భోజనాలుపెట్టించింది.స్వరాజ్యానికి పెద్ద జరీ చీరె కట్టారు. తల క్రుంగి పోయేటంత బరువుతో వాలుజడ వేశారు. ఊళ్ళో పెద్దలు... మగవాళ్లంతా వచ్చి వీలయినంత వెకిలిగా, అసహ్యంగా మాట్లాడి స్వరాజ్యం బుగ్గలు పిండి, పిసికీ డబ్బులు చేతపెట్టారు. రత్నం ఇనుమడించిన ఉత్సాహంతో పెద్దలందరినీ పలకరించింది. వాళ్ళ దయ వుండాలన్నది. తమని వాళ్ళు మరచిపోరాదన్నది. 'నువ్వు మరవమన్నా మరవలేంలేవే' అని వాళ్ళంతా రత్నానికి హామీ యిచ్చారు. ఫొటోగ్రాఫు తీయిస్తావేంటే? అని మేనమామ ఉత్సాహపడ్డాడు కానీ ఎందుకో ఆ ప్రయత్నం కలిసి రాలేదు.

స్వరాజ్యానికి నగలన్నా జరీ చీరెలన్నా అసహ్యం కల్గింది. 'ఛీ! ఛీ యివన్నీ మగవాళ్ళను ఆకర్షించేవాళ్ళకి. నాకు వీటి అవసరం లేదు' అనుకుంది.



ఊరు ఊరంతా ఈవార్త తెలిసిపోయాక బడికి వెళ్ళటమంటే సిగ్గనిపించింది స్వరాజ్యానికి. కానీ చదువును వదిలిందా, తనకు మోక్షం లేదు. ఈ బురదలోనే వుండిపోతుంది తాను. ఈ ఊబిలోనుండి తనను రక్షించగల చేయూత చదువుమాత్రమే అని స్వరాజ్యం నమ్మింది.

పుస్తకాలు పట్టుకుని బడికి బయలుదేరుతోంటే రత్నం గుడ్లు ఉరిమి చూసింది.

"ఎక్కడికే బయలుదేరావు. చదివింది చాలు. పుస్తకాలు అక్కడ పడేసి లోపలికి తగలబడు" అంది.

"నేను చదువుకుంటాను" అంది స్వరాజ్యం దీనంగా.

"నీకీ చదువుపిచ్చి ఎక్కడ పట్టిందే తల్లీ. పెద్ద దానివయ్యావు. ఒక ఆటరాదు. పాటరాదు. ఎట్టా బ్రతుకుదామనుకుంటున్నావూ?" అని రత్నం విచారం వెలిబుచ్చింది.

రత్నం ప్రశ్నకి స్వరాజ్యం సమాధానం చెప్ప





లేదు.

''నేను చదువుకుంటాను'' అంది మళ్లీ. ఆ అమ్మాయి ఈ మాత్రం మొండితనం ప్రదర్శించటం ఇదే మొదటిసారి.

''నీకు మాటల్తో చెబితే అర్థంకావట్లేదు. ఉండు నీపని చెబుతాను'' అంటూ తమ్ముణ్ణి కేకవేసి పిలిచింది.

రాజయ్య మనిషి సన్నగానే వుంటాడుగానీ ఉక్కుకడ్డీలాంటి శరీరం. స్వరాజ్యం జబ్బ పట్టుకుని లోపలకు తోస్తే పట్టుకున్నచోట నెప్పి అరగంటయినా తగ్గింది కాదు. తలుపులు బయట గెడేస్తూ,

''డబ్బు లెఖ్ఖ పెట్టుకోవటానికి చదివిన చదువు చాల్లే'' అని వెళ్లిపోయాడు.

''రెండురోజులు తిండిపెట్టకే, తిక్కకుదురుతుంది'' అని ఆమెకు సలహా ఇచ్చాడు.

తల్లి జాలికొద్దీ బోజనం పెట్టినా స్వరాజ్యం ముట్టుకోలేదు.

''నాకొద్దు... నేను చదువుకుంటాను'' అంది.

రెండురోజులయినా స్వరాజ్యం నోటివెంట ఆమాట తప్ప మరేదీ రాలేదు. తల్లి కన్నకడుపు తీపికొద్దీ దగ్గర కూర్చుని బతిమాలుకుంది. నచ్చచెప్పింది. ఎన్ని చెప్పినా స్వరాజ్యానిదొకటేమాట.

''నేను చదువుకుంటాను''

మేనమామకు సహనం నశించి గొడ్డును బాదినట్టు బాదాడు.

తల్లి అడ్డువెళ్లి ఆపింది.

అన్ని తన్నులూ తిని స్వరాజ్యం, ''నేను బడికి వెళ్తానమ్మా! చదువుకుంటాను'' అంది ఏడుస్తూనే. ఎటువంటిదయినాకానీ రత్నం కూడా స్త్రీయే. అందునా తల్లి. కూతురి క్షోభ చూడలేకపోయింది.

''పోనీలేరా! రాజయ్యా! పిల్ల చిన్నది. బలహీనంగా కూడా వుంది. ఇంకో రెండేళ్లు చదువుకోనీలే. ఏడుస్తావుంది'' అని తమ్ముడికే నచ్చచెప్పుకుంది.

తల్లి మాటలతో స్వరాజ్యానికి ఇంకో కొత్త సత్యం తెలిసింది. బలహీనంగా వుంటే తనను రొంపిలోకి దింపకుండా వదిలేస్తారు అని. మునుపు నగలు పెట్టుకోకూడదని నిర్ణయించుకున్న స్వరాజ్యం ఇప్పుడు వీలయినంతకాలం బలహీనంగా వుండటానికి నిర్ణయించుకుంది. తొలి ప్రయత్నంగా మాంసాహారం మానేసింది. ''ఏ పంతులుగారయినా వుంచుకుంటానన్నాడేమే దీన్ని? చదువుకుంటానంటది, మాంసం తిననంటది'' అని ఆశ్చర్యపోయాడు మేనమామ.

★ ★ ★

స్వరాజ్యం అందగత్తె కాదు. దానికితోడు బలహీనంగా వుంటుందేమో ఆకర్షణీయంగా కూడా వుండదు. స్వరాజ్యానికే పెళ్లిచేయాల్సి వస్తే ఆమె అందచందాలు చూసి ఏ మొగవాడూ ముందుకిరాడు. కానీ, అందుబాటులో వుంటే కులంలో పుట్టినందువల్లనూ కన్నెరికం చేయటమనేది హోదాకు సంబంధించిన విషయం కావటంవల్లనూ ఊరిలో పెద్ద మనుషులనబడినవారంతా స్వరాజ్యం కోసం ప్రయత్నించటం మొదలుపెట్టారు. ఇవన్నీ స్వరాజ్యానికి తెలుస్తూనేవున్నా తెలియనట్టు నటిస్తూ చదువులో నిమగ్నమవ్వాలని ఎంతగానో ప్రయత్నించేది. తల్లికోసం వచ్చేపోయే నరసులు, వాళ్ళు తనని చూసే చూపులు, చేసే అసహ్యకరమయిన వ్యాఖ్యలు, మధ్య మధ్యలో మేనమామ బోధలు స్వరాజ్యం మనసును ఎంతగానో కలవరపరిచేవి. మనసు పాడు చేసుకుని బాధ అనుభవిస్తూ కూర్చోవడానిక్కూడా పెట్టిపుట్టాలి. మనసు బాగోలేదని చదువు మానేసి కూర్చుంటే 'చదువుకోమ్మా' అని ఎవరూ బతిమాలరు. అందుకని, తనంతుతానే సముదాయించుకుని, మనసు చిక్కబట్టుకుని పుస్తకాలు తెరిచేది. పిచ్చి పిచ్చి ఆలోచనలతో పరుగులు పెట్టే మనసును కట్టేసి, ముంచుకొస్తున్న నిద్రను నెట్టేసి చదువులో నిమగ్నమయ్యేది.

నిద్రపోయేముందు జాగ్రత్తగా గదితలుపులు బిగించుకుని పడుకునేది. ఏ చిన్న శబ్దమయినా ఉలికిపడి లేచికూర్చునేది. బిగుతుగా జడ, మోచేతులు దిగిన జాకెట్టు, పొడవు పమిట, అలంకారాలు లేని స్వరాజ్యం రూపు రత్నానికి చాలా అసహనం, కోపం కలిగించేవి. తల్లి పూలు పెట్టుకోమన్నా గొలుసు వేసుకోమ

న్నా బెదురుగా అనుమానంగా చూసేది స్వరాజ్యం.



ఈ బాలారిష్టాలన్నిటినీ దాటుకుని స్వరాజ్యం స్కూలు ఫైనల్‌కు చేరుకుంది. ఇప్పుడే ఆమె తన భవిష్యత్తును నిర్ణయించేసుకుంది. అర్భనాకారపు శరీరమే కానీ అమోఘమయిన బుర్ర ఆ అమ్మాయిది. ఎంతో చదవాలని, ఏదో సాధించాలనీ వుంది. కానీ స్వరాజ్యం ఊహా జీవి కాదు. ఆమె కాళ్ళెప్పుడూ నేలమీదనే వుండేవి. అందుకే బియ్యేలు, యమ్మేలు చదవాలని ఆశించలేదు. అంతకాలం తల్లిమీద ఆధారపడి తన శీలాన్ని రక్షించుకోగలననే నమ్మకం స్వరాజ్యానికి లేదు. అందుకే సెకండరీ గ్రేడు టీచర్‌గా ట్రైనింగ్ అవ్వాలని నిర్ణయించుకుంది. దానికైతే ఒక సంవత్సరం కష్టపడితే చాలు. తర్వాత తన కాళ్ళమీద తాను నిలబడగలదు. నిర్ణయం మంచిదే తీసుకున్నది కానీ, దానిని అమలుపరచటం దాదాపు అసాధ్యం అని తెలియని అమాయకురాలు కాదు స్వరాజ్యం.

ముందు తల్లిని ఒప్పించాలి. తర్వాత మేనమామను ఒప్పించాలి. ఇవి రెండూ జరిగేపనులు కావు. స్వతంత్రించి వెళితే ఒకర్తే పట్నంలో నెట్టుకురాగలదా? అసలు స్కూలు ఫీజుకూ, పుస్తకాలకూ డబ్బు ఎక్కడినుంచి వస్తుంది? ఎలా? తన సమస్య పరిష్కారం అయ్యేమార్గం ఏది? సమస్యలతో ఉక్కిరి బిక్కిరవుతూనే స్వరాజ్యం స్కూలు ఫైనలు పాసయింది.

★ ★ ★

లీలను పుట్టిన దగ్గర్నుండీ మేనమామకు ఇవ్వాలనే అనుకుంటూ వచ్చారు. ఆ అమ్మాయి పల్లెటూరి స్కూల్‌లో వుండగానే అతను పైచదువుకని ఇంగ్లాండు వెళ్ళాడు. అప్పట్లో ధనిక కుటుంబాలలో అది సర్వసాధారణం. వెళ్ళి ఏ సీమ దొరసానిని తీసుకువస్తాడో అని భయపడి పెద్దవాళ్లు స్టీమరు ఎక్కకముందే అతనితో లీలకు తాళి కట్టించేశారు. అక్కడి వాతావరణం, నాగరికతా ఒంటబట్టించుకుని అతను లీలను కాలేజీలో చేర్పించమని రాశాడు. మీసాలనాయుడు ఊరికి పెద్దగానీ అల్లుడిముందు పిల్లే. అతని మాటను కాదనే ధైర్యంలేక ఆయన కూతుర్నీ కూతురితోపాటే కొడుకునీ పట్నంలో వుంచి చదివించటానికి నిర్ణయించుకున్నాడు. బంధువుల మునలమ్మని వంటకు ఏర్పాటు చేశారు. పట్నంలో ఇల్లు కూడా తీసుకున్నారు.

పరీక్ష ఫలితాలు తెలిశాక లీల గుడిదగ్గర కన్పించింది స్వరాజ్యానికి.

''స్వరాజ్యం! మామయ్య నన్ను కాలేజీలో చేర్పించమని వుత్తరం రాశాడే!'' అని చెప్పింది.

''నువ్వు చేరవూ?'' అని కూడా ఆమె అడిగింది.

స్వరాజ్యం నిట్టూర్చి, ''కాలేజీలో చేరాలని కాదుకానీ లీలా! టీచర్ ట్రైనింగ్‌లో చేరాలని వుంది. మా అమ్మా, మామయ్య ఒప్పుకోరు'' అంది. ఎంత అణుచుకున్నా దుఃఖం ఆగింది కాదు. లీల స్నేహితురాలికి తాను చేయగల సహాయం ఏమయినా వుందా? అని ఆలోచించింది.

''స్వరాజ్యం! అన్నయ్యనూ, నన్నూ పట్నంలో కాలేజీలో చేర్పాలనుకుంటున్నారు. మా చుట్టాల ముసలమ్మని వంటకు పెట్టుకుని, మేం ఇల్లు తీసుకుని వుంటాం. నువ్వు కూడా మాతో వుండొచ్చు. స్కాలర్‌షిప్పు దొరుకుతుందేమో ప్రయత్నిద్దాం''

లీల పసితనపు అమాయకత్వంలోనూ, స్నేహితురాలిపట్ల జాలితోనూ ఈ ఏర్పాటును సూచించింది.

కానీ, ఇది జరిగే వ్యవహారం కాదని స్వరాజ్యానికి తెలుసును. ఏడాదిగా లీల తండ్రి

మీసాలనాయుడుగారే తల్లికి తన గురించి కబురు పంపుతూనే వున్నాడు. ఆయన మనసు నొవ్వకుండా సమాధానం పంపటానికి తల్లి కిందా మీదా అవుతున్నది. అటువంటాయన ఎదిగిన కొడుకు, కూతురు, బోగంవాళ్ల పిల్లతో కలిసి ఒక ఇంట్లో వుండి చదువుకుంటానంటే ఒప్పుకుంటాడూ?. సంప్రదాయమైన కుటుంబంలో పుట్టి, కట్టుబాట్ల మధ్య పెరిగిన వారికి ఇవన్నీ ఎట్లా అర్థమవుతాయి. చెప్పగల సాహసం తనలో లేదు.

స్వరాజ్యం ఆశ చంపుకోనూ లేకుండా వుంది. కోరిక తీరే మార్గమూ కన్పించటంలేదు.

"మీ ఇంట్లో ఒప్పుకోరులే లీలా" అని తేల్చేసింది.

★ ★ ★

లీల స్వరాజ్యం సమస్యను చాలా అమాయకంగా సౌమిత్రితో చెప్పింది.

"పాపం! ఇవాళ గుడి దగ్గర కనపడి స్వరాజ్యం ఏడ్చిందిరా అన్నాయ్! నేను మనతోపాటు పట్నం రమ్మన్నాను. మీ ఇంట్లో ఒప్పుకోరులే" అంది.

చెల్లెలి మాటలతో సౌమిత్రి తలలో రకరకాల ఆలోచనలు కదిలాయి. అతను ఈ ఇద్దరి ఆడపిల్లలకంటే వయసులో పెద్దవాడు. లోకం పోకడ బాగా అర్థంచేసుకున్నవాడు. వయసులో తండ్రికంటే చిన్నవాడు కానీ బుద్ధిలో ఏమాత్రమూ ఆయనకి తక్కువయినవాడు కాదు. స్వరాజ్యం పట్నంలో తమతో వుంటుందంటే అతనికి పులకింత వంటిది కలిగింది. ఈ అమ్మాయిని పట్నం వచ్చేట్టు చేయగలిగినా, నా వంట పండినట్టే అనుకున్నాడతను. తండ్రి స్వరాజ్యంకోసం కబుర్లు పంపుతున్నాడని అతనికి తెలుసు. తల్లి బలహీనత కూడా అతనికి తెలుసు. మగపిల్లవాడని విపరీతమయిన గారాబం ఆవిడకు. వాడు మగవాడుగా పుట్టినందువల్ల తనకంటే వాడికి విషయపరిజ్ఞానం కూడా ఎక్కువని ఆవిడ దృఢవిశ్వాసం. తల్లి బలహీనతలను ఆధారంగా చేసుకుని సౌమిత్రి పావుల్ని జాగ్రత్తగా కదిపాడు.

కొడుకు, రత్తమ్మ కూతురు తమతోపాటు వుండి పట్నంలో చదువుతుందని అనగానే ఆవిడ తాచుపాము మీదపడ్డట్టు బెంబేలెత్తిపోయింది.

"నీకు మతిగానీ పోయిందేవిట్రా! ఆ పిల్లతో కలిసి ఒక ఇంట్లో వుంటే చెల్లాయిని మామయ్య కాపురానికి తీసుకెడతాడూ?" అని సందేహం వెలిబుచ్చింది చూడబోతే ఆవిడ అభ్యంతరం అంతా అందువల్లనే అయినట్టు.

ఆ పిల్లతో కలిసివుంటే సౌమిత్రికి పెళ్లి కాకపోవచ్చని దిగులుపడలేదావిడ. మగపిల్లవాడికి- వాడెంత జులాయి వెధవ అయినా పెళ్ళవుతుందని ఆవిడకు తెలుసు.

"మామయ్యా సీమకెళ్లినవాడు. తెల్లదొరలకి ఇట్టాంటి పట్టింపులుండవే అమ్మా! ఆ ముసలమ్మ ఒక్కత్తే మాకు వండివార్చలేదు. స్వరాజ్యం చేతికింద మనిషిగా అక్కరకు వస్తుంది" అన్నాడేగానీ తల్లి ఇంకా అసంతృప్తిగానే వున్నట్టు తోచి ఆఖరున ఓ బ్రహ్మాస్త్రం సంధించి వదిలాడు.

"నాన్న ఆ పిల్లకోసం రత్తమ్మ ఇంటికి ఒకటే కబుర్లు చేస్తావున్నాడంట"

నాయుడి భార్య స్వరాజ్యాన్ని ఎప్పుడూ చూళ్లేదు. చూస్తే సౌమిత్రి బెదిరింపుకి లొంగేది కాదు. పెద్దాపురం మాణిక్యం, కాంచనమాలను తలదన్నేలా వుండేది. మొగుడు దాన్నే ఏడాదికిమించి వుంచుకోలేదు. ఈ ఒంటి ఊపిరిపిల్ల తన సంసారానికి ఏ విధమయిన ముప్పూ తేలేదని గ్రహించివుండేది. స్వరాజ్యం అదృష్టమో, దురదృష్టమో నాయుడి భార్య సౌమిత్రి మాటలతో భయపడింది. అయిష్టంగానే కానీ తన అంగీకారం తెలిపింది. చాలామంది మగవాళ్ళలాగానే నాయుడికి భార్య మాటను కాదనే ఓపికా, తీరికా లేవు.

ఆవిధంగా స్వరాజ్యం ఇంటినుండి తల్లికి తెలీకుండా పారిపోయి, టీచరు ట్రైనింగులో చేరింది. ఇది ఆమె జీవితంలో చెప్పుకోదగిన మలుపు. ఆమె జీవితగమనాన్నే మార్చివేసిన సంఘటన. తల్లికీ, మేనమామకూ ఈ వార్త అశనిపాతమే అయింది.

★ ★ ★

ఎప్పుడూ చదువుతుండే రాజ్యలక్ష్మి ఈమ





ధ్య రాస్తూవుండటం గమనించాడు వాసు. ఒక లావుపాటి ఎర్ర బౌండు పుస్తకంలో తలవంచుకుని రాస్తూవుంటుంది. క్లాసుకు వెళ్లవలసి వచ్చినప్పుడు మాత్రం దానిని టేబిల్ సొరుగులో భద్రంగా దాచి తాళం వేసుకువెళుతుంది. అంటే అది టీచింగు నోట్సు మాత్రం కాదు.

బెల్ మోగగానే, పుస్తకాన్ని టేబుల్ సొరుగులోకి తోసి తాళం వేసుకుని లేచి నిలబడింది. బల్ల దగ్గర ఆగి చేతిలోకి చాక్‌పీసులు తీసుకుంటోంటే,

''ఏమిటండీ అంత జాగ్రత్తగా దాచుకుని వెళుతున్నారు?'' అనడిగాడు వాసు. ఆమె ఒక్కక్షణం తటపటాయించింది. తలతిప్పి స్టాఫ్‌రూమంతా కలయజూసింది. ఎవరూ లేరు. చివరకు ఏదో నిశ్చయించుకున్నదానిలా స్పష్టంగా, నెమ్మదిగా అంది.

''స్వీయ చరిత్ర!''

వాసు ఆమె హాస్యమాడుతున్నదనుకున్నాడు. అందుకని నవ్వేశాడు. ఆవిడ మాత్రం నవ్వలేదు. నెమ్మదిగా బయటకు వెళ్లిపోయింది. 'చాలా విచిత్రమయిన వ్యక్తి' అనుకున్నాడతను.

ఇంతలో శ్యామల వచ్చింది.

''మాస్టారూ! ఈ లెక్క తెలియటంలేదు''

గులాబీరంగు పావడా, అదేరంగు జాకెట్టు, నల్లవోణీ వేసుకుంది. తలంటు పోసుకుందేమో, వెంట్రుకలు అల్లరల్లరిగా ముఖంమీద పడుతున్నాయి. గోరింటాకుతో ఎర్రనైన పొడవాటి చేతివేళ్ళతో వెనక్కి సర్దుకుంది. చేతికున్న ఎర్ర పట్టుగాజులు గలగలమని శబ్దం చేశాయి. అతను ఆమెనే పరీక్షగా చూస్తున్నాడు. ఎప్పుడు ఈ అమ్మాయిని చూసినా అతనికి శశిరేఖ గుర్తుకు వస్తుంది. ఆమె శరీరంలోనుండి బాల్యం పూర్తిగా తప్పుకోలేదు.

అందువల్ల ముద్దుగా వుంటుంది. యౌవనం తన ముద్రను వేయటం మొదలుపెట్టింది. అందువల్ల, అందంగానూ వుంటుంది. 'నేను శ్యామలకంటే చాలా పెద్దవాడిని. బాధ్యత తెలిసిన వాడిని. ఆ పిల్లకు గురుస్థానంలో వున్నాను. అలాగే ప్రవర్తించాలి. అని తననుతాను హెచ్చరించుకున్నాడు వాసు. యవ్వనం తను చేసే అల్లరి చేస్తూనే వుంది, మన్మథ బాణం సాయంతో.

''ఖాళీగానే వున్నారా మాస్టారూ! చెప్తారా లెఖ్ఖ?'' అని రెట్టించి అడిగింది శ్యామల.

''నువ్వేమిటి ఖాళీగా తిరుగుతున్నావు? మీకు క్లాసులేదా?''

''క్రాఫ్టు క్లాసు. మాస్టారి పర్మిషన్ తీసుకుని వచ్చాను''

'ఉహుం! ఇప్పుడు కాదు. నేను ఖాళీగా లేను' అందామనుకున్నాడు. మనసు బుద్ధిగా నోరు నొక్కేసింది. వాసు అప్రయత్నంగా తల వూపేశాడు. శ్యామల వచ్చి అతని ఎదురుగా బల్లమీద కూర్చుని నోట్సు తెరిచింది. ఆమె శరీరం మీదినుండి వీస్తోన్న సువాసన అతన్ని ఉన్మత్తుణ్ణి చేస్తోంది. శ్యామల పసిహృదయానికి అతని అవస్థను గమనించగల చాతుర్యం లేదు. 'మాస్టారిని చూడాలి, ఆయన సమక్షంలో గడపాలి' అనే తాపత్రయం తప్ప అతని కోరిక తాలూకు సెగలు ఆమెను స్పృశించనేలేదు. అతను విమూఢుడై అటూ ఇటూ చూస్తోంటే...

''పెన్ను కావాలా మాస్టారూ!'' అంటూ క్యాప్ తీసి పెన్ను చేతిలో పెట్టింది. అలా పెట్టడంలో ఆమె చేయి అతని చేతికి తగిలింది. అతని చెవులూ, చెక్కిళ్ళూ మంకెన పువ్వుల్లా ఎర్రబడ్డాయి. మనిషి సన్నగా కంపిస్తున్నాడు. శ్యామల ఇంకా అమాయకంగా,

''ఈ లెక్క మాస్టారూ!'' అని వంగి చూడబోయింది. ఆమె ముఖం అతని ముఖానికి చేరువలోకి వచ్చేసింది. రెండు అరచేతుల్లోనూ ఆ ముఖాన్ని అలాగే పట్టుకుని ముద్దు పెట్టుకుందామా? అనే కోరికను అతను ఎలా నిగ్రహించుకున్నాడో తెలీదు. ఒక్కసారిగా స్పృహ తెచ్చుకుని ''విల్‌యూ ప్లీజ్ గెటవుట్ ఫ్రం హియర్!'' అని బలహీనంగా అరిచాడు. ముందు శ్యామలకు అతనన్నదేమిటో అర్థంకాలేదు. అర్థమైనాక తెల్లబోయి అతని ముఖంలోకి చూసింది. ఎర్రబడిన అతని కళ్ళూ, జ్వరం వచ్చినట్టున్న అతని వాలకమూ ఆమెను అక్కడినుండి వీలయినంత త్వరగా వెళ్లమని హెచ్చరించాయి. అతనిముందు పెట్టిన నోట్సు

తీసుకోవటం కూడా మరిచిపోయి బయటకు పరుగెత్తింది.

వాసు నిస్త్రాణగా రాతబల్లమీద తల వాల్చు కున్నాడు. ఆమె తాలూకు సుగంధం ఇంకా అతన్ని చుట్టుముట్టి వున్నట్టే వుంది. బలీయ మయిన కాంక్ష అతని నరనరాల్లోనూ పారింది 'నేను విచక్షణ కోల్పోకూడదు. నాకు నిగ్రహం చాలా అవసరం. చాలా అవసరం' అని పదేప దే వాసు తననుతాను హెచ్చరించుకున్నాడు.

★ ★ ★

స్వరాజ్యం టీచర్ ట్రైనింగ్‌లో చేరింది. లీలా, సామిత్రి కాలేజీలో పి.యు.సి.లోచేరారు తాను చదువుకుంటోన్నంతమాత్రాన లీలా వాళ్ళతో సమానమయిపోయానని స్వరాజ్యం అనుకోలేదు. అందువల్లనే ముసలమ్మకి ఇంటి పనుల్లో, వంటపనిలో సహాయం చేసేది. 'వీళ్లు నాకు భోజనం పెడుతున్నారు. తృణమో, పణమో ధనసహాయం చేస్తున్నారు. ఈ వి ధంగానయినా కొంత రుణం తీర్చుకుంటాను' అనుకునేది.

క్లాసులో స్వరాజ్యంకాక క్రిస్టియనుపిల్ల మేరీ ఒకతి వుండేది. వీళ్ళిద్దరే ఆడపిల్లలు. మిగిలి నవాళ్లందరూ మగపిల్లలే. స్వరాజ్యం మేరీతోనే సరిగ్గా మాట్లాడేది కాదు. పుట్టుపూర్వోత్తరాలు అడుగుతుందని భయం. ఇక మగపిల్లలతో ఏం మాట్లాడుతుంది? టీచర్లు, మగపిల్లలు స్వరాజ్యాన్ని, ఆమె అవతారాన్ని చూసి మరీ పాత రాతియుగం నాటిమనిషి అనుకునేవారు.

ప్రతిరోజూ పడుకునే ముందు స్వరాజ్యం 'అమ్మయ్యా! యివాళ ప్రశాంతంగా గడిచింది' అనుకునేది. అలా తొమ్మిది రాత్రుళ్ళు అనుకు న్నాక పదోరోజు వుదయమే మేనమామ వూరు నుండి దిగాడు. ఆ సమయానికి స్వరాజ్యం క్లాసులో వుంది. అతను సరాసరి క్లాసు రూముకే వచ్చాడు. అక్కడ, అంతమంది మధ్యలో తనకు జగబోయే అవమానాన్ని తలుచుకుని స్వరాజ్యం గువ్వపిట్టలా వణికిపోయింది. వెంటనే టీచరు దగ్గరకు వెళ్ళి అనుమతి తీసుకుని మామయ్యా దగ్గరకు వచ్చింది.

''పదపద ఇంటికెళ్ళి మాట్లాడుకుందాం'' అని ఎట్లాగో యింటికి లాక్కొచ్చింది. ముసల మ్మకి పట్నంలో వంట చెయ్యటం తప్ప మరే మీ పనిలేదు. అది కూడా స్వరాజ్యం పుణ్యమా అని సగంపైగా ఆపిల్లే చేసి పెడుతుంది. పల్లెటూరిలోలా 'ఊసుపోక కబుర్లు' లేక విసుగె త్తి పోయివుంది. రాజయ్యరాకతో తోలుబొమ్మ ళాట చూట్టానికి సరదాపడే చిన్నపిల్లలా సంబ రపడసాగింది.

రాజయ్య కొంచెం స్థిమితపడ్డాక స్వరాజ్యం ''నేనిక్కడున్నానని ఎట్లా తెలిసింది?'' అన డిగింది. అది చాలా అర్థంలేని ప్రశ్న. అది తెలుసుకోవటం పెద్ద కష్టమయిన విషయమే మీకాదు. పల్లెటూరిలో ఏ విషయమూ ఎవరి నోళ్ళల్లోనూ దాగదు. అందువల్ల, ఆ ప్రశ్నకు సమాధానం యివ్వవలసిన అవసరం రాజ య్యకు కన్పించలేదు.

''అంజనమేసి చూసొచ్చాగా'' అని హేళన చేశాడు.

ఇంక స్వరాజ్యం మాట్లాడలేదు.

''నేను వూళ్ళోలేనే. లేకపోతే నువ్వెక్కడు న్నావో తెల్సుకోటానికి పదిరోజు లెందుకే?''

స్వరాజ్యం ఎలాగో గొంతు పెగుల్చుకుని పాతపాటే పాడింది.

''నేను చదువుకుంటాను''

''ఏడ్చావులే... మీ అమ్మ బెంగపెట్టుకుంది నీకోసం. సామానదీ సర్దుకుని బయల్దేరు''

''నేను రాను'' అంది స్వరాజ్యం. నెమ్మది గానే అంది కానీ దృఢంగా వుంది స్వరం.

అతను హఠాత్తుగా లేచివచ్చి ఈడ్చిపెట్టి చెంపమీద కొట్టాడు. అసలే రివటలా ఉండే స్వరాజ్యం దభాలున క్రిందపడింది. ఏడ్వటా నికి నామోషీ అన్పించి, దుఃఖాన్ని అణచు కుంది కానీ కంటివెంట నీళ్ళు జలజలా రాలాయి. అతను మళ్ళీ జుట్టుపట్టుకు పైకి లాగి, యింకో రెండు పిడిగుద్దులు గుద్ది,

''దొంగ లం...! తొక్కి నారదీస్తాను. ఏ మను కున్నావే. లే. లేచి బట్టలు సర్దుకుని బయల్దే రు. అమ్మా! బాబూ! అని బతిమాలుతుంటే ఒకటే నీలుగుతున్నావు'' అంటూ బయటకు వెళ్ళి నిలబడ్డాడు. ఇంత గొడవ జరిగి, తన్ను లు తిన్నాక స్వరాజ్యం యింకా రానంటుందని అతను అనుకోలేదు. అందుకని రోడ్డుమీద




నిలబడి సామాను తీసికెళ్ళటానికి బండి ఏమైనా దొరుకుతుందేమో అని చూడసాగాడు. అయితే స్వరాజ్యం గబుక్కున లోపలిగదిలోకి వెళ్ళి తలుపేసేసుకుంది. ఇది చూసేటప్పటికి రాజయ్య పూనకం వచ్చిన వాడిలాగ అయిపోయాడు. గభాలున లోపలకి వచ్చి తలుపుల్ని ఫెడేల్మని తన్నాడు.

ఇప్పటివరకు తోలుబొమ్మలాటలా ఇదంతా చూస్తున్న ముసలమ్మ ఇక వూరుకోలేదు. 'వీడెవడో మోటు మనిషి లాగున్నాడు. తలుపుల్నీ తననీ కూడా తన్నేలా వున్నాడు. వీణ్ణి వెళ్ళగొట్టాలి. స్వరాజ్యం వెళ్ళిపోతే తనకి చాలా కష్టం. ఒక్కతినేవని చేసుకోలేను'

"ఏయ్! ఏంటి నీ ఆగడం? ఆడవాళ్లం యిద్దరమే వున్నాం కదా అని యాగీ చేస్తున్నావా ఏంటి? సౌమిత్రినిరానీ వాళ్ళ నాయనకు కబురు చేస్తా. నీ సంగతి ఏంటో వాళ్ళే తేల్చుకుంటారు'' అని బెదిరించింది.

గుడ్డివాడి చేతిరాయి కూడా తగుల్తుందని ముసలమ్మ వూహించలేదు, గానీ అది తగిలింది.

నాయుడు, ఆయన కొడుకు సౌమిత్రి పేర్లు వినగానే కొంచెం జంకాడు స్వరాజ్యం మేనమామ. ఈ పిల్ల ఇక్కడవుండి ఇంత ధైర్యంగా చదవడం వెనక తప్పక నాయుడి ప్రోత్సాహం కూడా వుండే వుంటుందనుకున్నాడు. అందుకే ఈ విషయాన్ని గొడవల్తో కాక సామరస్యంగా పరిష్కరించాలనుకున్నాడు. ఊరికెళ్ళి విషయాలన్నీ అక్కతో చర్చించి, తగిన నిర్ణయం తీసుకోవచ్చని అప్పటికి కొంత ఆవేశాన్ని అణచుకొన్నాడు. అయినా పైకిమాత్రం బింకంగా

"నువ్వు చదువుకుని ఎట్టా వుద్యోగం చేస్తావో, కులవృత్తి ఎట్టా చెయ్యవో నేను చూస్తాగా'' అని బెదిరించి మరీ వెళ్ళాడు.

మేనమామ నిష్క్రమణతో అప్పటికి తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది స్వరాజ్యం. ముసలమ్మ చేసిన సహాయానికి ఆమెపట్ల కృతజ్ఞతాభావం నిండింది స్వరాజ్యంలో.

★ ★ ★

స్కూలుకి వెళుతోందిగానీ స్వరాజ్యానికి భయంగానే వుంది ఏమూలనుండి మేనమామ వూడిపడి వూరుకి లాక్కుపోతాడో అని. తనకు వీలున్నపుడల్లా సౌమిత్రి స్కూలువరకూ తోడుగా వచ్చేవాడు. స్వరాజ్యం మనసు కృతజ్ఞతతో తడిసి చీకిపోయేది. కానీ ఆ అమ్మాయికిమాటల్లో తన కృతజ్ఞత వెల్లడించటంరాదు. 'మొద్దు... కదలదు... కరగదు' అనుకునే వాడు సౌమిత్రి విసుగ్గా. చూస్తూ వుండగానే మూడు నెలలు గడిచిపోయాయి. లీలకు, సౌమిత్రికీ దసరా శలవులిచ్చేశారు.

"మీకు దసరా సెలవులేవా?'' అని యిద్దరూ స్వరాజ్యాన్ని అడిగారు.

"మాకు ఎల్లుండినుంచీ'' అంది స్వరాజ్యం.

"సరే... అప్పుడే అందరం కలిసి వెళ్దాం అంది'' లీల.

ముసలమ్మ అప్పటికే సామానులన్నీ సర్ది వుంచింది. ఈ మూడు నెలలుగా ఆవిడ కడుపు ఉబ్బిపోయివుంది. ఎప్పుడెప్పుడు ఊరు వెళ్ళి యిక్కడి సంగతులన్నీ చెపుదామా అని తపించిపోతూ వున్నదావిడ. ముఖ్యంగా రాజయ్య స్వరాజ్యాన్ని తన్నటం చూసిన ఏకైక సాక్షి తను ఒక్కతే. దాన్ని చిలవలు పలవలుగా . అల్లి చాటింపు వేసేవరకు ఆవిడ ప్రాణం కుదుట పడేట్టులేదు. లీల యింకా రెండు రోజులు వుందామంటే- అదీ స్వరాజ్యం కోసం ముసలమ్మకి చిర్రెత్తుకొచ్చింది. కానీ, స్వరాజ్యం రెండు రోజులతర్వాత కూడా ఊరికి రాననేసింది. "మీరు పోయిరండి లీలా! నాకు రికార్డులు రాసుకోవలసిన పని చాలా వుంది నేను రాలేను'' అంది.

ఎంత అసహ్యంగా ప్రవర్తించినా జన్మనిచ్చినందుకు కాబోలు స్వరాజ్యానికి తల్లిని చూడాలనే వుంది. కానీ, ఎలాగో ఆమె ఆ కోరికను నిగ్రహించుకుంది. ఇంటికి వెళ్తే యిక తాను తిరిగి రాలేనని ఆమె మనసు పదేపదే హెచ్చరించింది. కారణం ఏదయితేనేం? ఇక్కడ పుణ్యాత్మురాలు ముసలమ్మ అడ్డుపడి తనను రక్షించింది. అక్కడ తల్లికూడా మేనమామకే వత్తాసు పలుకుతుంది. ఇక్కడ కొద్దో గొప్పో తనకు స్థానబలిమి వుంది. అక్కడ లేదు. ఇంకెంత? మూడు నెలలు గడిచిపోయాయి. ఇంకొక్క ఆరునెలలు ఓపిక పడితే తన ట్రైనింగు పూర్తవుతుంది. ఎక్కడో అక్కడ

వుద్యోగంలో చేరాకనే తను తల్లిని చూడటానికి వెళ్ళాలి. ఇక అమ్మను కూడా అక్కడ వుంచకూడదు. తనతో వచ్చెయ్యమని అడగాలి. వస్తుందా సరేసరి. లేదూ? తనిక ఆ వూరు వెళ్ళదు.

ఇవన్నీ ఆలోచించుకుని స్వరాజ్యం పైకిమాత్రం రికార్డుల పని ఉంది, రాలేనని చెప్పి వాళ్ళను పంపించేసింది. "ఒక్కదానివే ఉంటున్నావు స్వరాజ్యం జాగ్రత్త మళ్ళీ మీ మామయ్య వస్తాడేమో తలుపులు అవి జాగ్రత్తగా వేసుకుని పడుకో" అంటూ సౌమిత్రి, లీలా పదిసార్లు జాగ్రత్త చెప్పి వెళ్ళారు.

ఒక్కసారిగా స్వరాజ్యాన్ని ఒంటరితనం చుట్టుముట్టేసింది. కొంచెం భయం, చాలా దిగులూ కలిగాయి. "నేను ఈ ఒంటరితనాన్ని అలవాటుచేసుకోవాలి. నాకు ఎవరూ లేరు. జీవితమంతా నేను ఒంటరిగానే గడపవలసి వుంది' అని తనకు తాను ధైర్యం చెప్పుకుంది స్వరాజ్యం.

★ ★ ★

సౌమిత్రీ వాళ్ళు వెళ్ళేక రెండు రోజులు స్వరాజ్యానికి స్కూలు జరిగింది. పగలంతా స్కూల్లో ఎలాగోలా గడిచిపోయేది. రాత్రి అవుతుంటే స్వరాజ్యానికి భయం వేసేది. తాళం వేసిన తలుపుల్నే మళ్ళీ మళ్ళీ తడిమిచూసుకునేది. తర్వాత వాళ్ళ స్కూలుకు కూడా దసరా శలవులిచ్చేశారు.

నిజంగానే రికార్డుల పని కొంత వుంది. మూడురోజుల్లో ఆ పని కాస్తా పూర్తయిపోయింది. జీవితంలో తోచకపోవటమంటే ఏమిటో మొదటిసారి అనుభవానికి వచ్చింది స్వరాజ్యానికి. బట్టలన్నీ వుతుక్కుంది. చిరుగులు కుట్టి సరిచేసుకుంది. పుస్తకాలన్నింటికీ అట్టలు మార్చి వేసుకుంది. సర్దిన యింటినే తిరిగి తిరిగి సర్దింది. అయినా కాలం కడుపు నిండిన కొండచిలువలాగ కదలటం మానేసింది. ఎక్కడకు వెళ్ళటానికీ స్వరాజ్యానికి స్నేహితులు లేరు. యింకా వారంరోజులు పోతేగానీ వీళ్ళు రారు. అమ్మయ్యో! యింత విసుగ్గా వుందేమిటి? అని విస్తుపోయింది.

రాత్రి మంచి నిద్రలో వుండగా తలుపులు దబదబమంటోంటే మెలకువ వచ్చింది స్వరాజ్యానికి. గుండె దడదడలాడింది. లేచి మంచ మీదే బాసింపీట వేసుకుని కూర్చుంది. భయంతో ఒళ్ళంతా చెమటలు పడుతున్నాయి.

"స్వరాజ్యం! స్వరాజ్యం!" అంటూ ఎవరో పేరు పెట్టిపిలుస్తున్నారు. కొంపదీసి మామయ్య కానీ రాలేదు కదా! అనుకుంది. ఆ ఊహకే వణికిపోయింది. మళ్ళీ తలుపులమీద చప్పుడు. మామయ్య గొంతులా లేదు.. వణుకుతూనే కిటికీ తలుపులు తీసి,

"ఎవరూ?" అని అరిచింది మేకపోతు గాంభీర్యంతో. తలుపు తడుతూన్న మనిషి తట్టడం ఆపి కిటికీ దగ్గరకువచ్చి-

"స్వరాజ్యం! నేను. తలుపు తెరు" అన్నాడు, అతను సౌమిత్రి.

స్వరాజ్యం గుండె కుదుట పడింది. తలుపు తీసి, "ఏమిటి సౌమిత్రీ! యింత అర్ధరాత్రి వచ్చావు? అయినా అప్పుడే వచ్చేశావేం? యింకా వారం రోజులు మీకు శలవులున్నాయిగా" అంది.

"మా సైన్సు లెక్చరర్‌కి శలవుల్లో ప్రయివేటు క్లాసులు పెట్టాలని కోరిక పుట్టుకొచ్చిందట. మా క్లాసుమేటు కబురు చేశాడు. అందుకని వచ్చేశాను" అని సమాధానం యిచ్చాడు.

అతను ఇంట్లో వాళ్ళకి మేనమామగారి వూరు వెళ్తున్నానని చెప్పి వచ్చాడు. స్వరాజ్యం అతని మాటలు నమ్మింది. ఎవరో అన్నట్టు నమ్మకపోతే నమ్మకంద్రోహం చేయటం ఎలా?

స్వరాజ్యానికి వూహ తెలిసిన నాటినుండీ తన శీలాన్ని అపహరించటానికి ఏ దుర్మార్గుడో, దుష్టుడో ఎక్కడినుండో వస్తాడని భయపడుతుండేది. వాడు ఏ విధంగా తనను లోబరుచుకోవచ్చో, తాను వాడి బారినుండి ఎలా తప్పించుకోవాలో చాలా రకాలుగా ఆలోచించి పెట్టుకున్నది. ఆడ పిల్లల శీల భంగంచేసే వాళ్ళందరూ మీసాల నాయుళ్ళు, బొ్ర చౌదరులు అని స్వరాజ్యం వుద్దేశ్యం. వాళ్ళంతా ఎర్రటి కళ్ళతో, బాన పొట్టలతో, నలభై దాటిన వయసులో వుంటారని కూడా స్వరాజ్యం అనుకుంటూ వచ్చింది. ఈ భ్రమలకు పునాది




ఏమిటో ఆమెకే స్పష్టంగా తెలియదు. కానీ రమారమి తన వయసులో వున్న కుర్రవాళ్ళు కూడా మగవాళ్ళేనని, వాళ్ళు అనుసరించే విధానాలనుండి తప్పించుకోవలసి వుంటుందని స్వరాజ్యానికి ఎప్పుడూ తట్టలేదు. అందుకే తన మంచం పక్కనే మడత మంచం వాల్చుకున్న సౌమిత్రిని స్వరాజ్యం సందేహించలేదు. తనకు యింకొక మనిషి తోడు వున్నాడనే భావన ఆమెలో నిశ్చింతను కలగచేసింది. ధైర్యంగా గుండె మీద చేయివేసుకుని నిద్రపోయింది. 'అమ్మయ్య! ఇక భయం లేదు' అనుకుంది చాలా అమాయకంగా.

సౌమిత్రి సాధారణమయిన మగవాడు. పల్లెటూరిలో పుట్టి పెరిగిన వాడు. పట్నం పోకడలు బాగా వంటపట్టించుకున్నవాడు. లీల కంటే, స్వరాజ్యం కంటే వయసులో పెద్దవాడు. స్వరాజ్యం పుట్టుక, ఆశయం, బలహీనత, తనకున్న అవకాశాలు అన్నీ తెలిసిన వాడు. పావులను జాగ్రత్తగా కదపటానికి నిర్ణయించుకున్నాడు.

ఏడాదిక్రితం తండ్రి తూరుపువైపు పొలంనుండి ధాన్యం తోలుకురమ్మని పంపితే, పొరుగూరి పంకజానికి కన్నెరికం చేసి ఆ ధాన్యం దానింట్లో దింపినందుకుగాను, తండ్రితో చావ చితక్కొట్టించుకున్నాడని, ఆ విషయం వూరు వూరంతా చెప్పుకున్నారని,. ఎప్పుడూ తన ప్రపంచంలో తాను బతికే స్వరాజ్యానికి తెలియదు.

ఆమాటకొస్తే తల్లికోసం తమింటికొచ్చే మగవాళ్ళు మాత్రమే చెడ్డవాళ్ళనీ, మిగిలినవారంతా సహృదయులేననీ నమ్మే అమాయకత్వం అణువణువునా నిండివుంది స్వరాజ్యంలో.

ఆ రాత్రి సౌమిత్రి వయసుకు మించిన నిగ్రహంతో ప్రవర్తించాడు. నిద్రలో కదిలే ఆమె అందాలను ఆస్వాదిస్తూ, నిట్టూర్పులతో ఆ రాత్రి గడిపేశాడు.

ఉదయం కాఫీ చేసి స్వరాజ్యం అతన్ని లేపింది. తన పథకంలో మొదటి మెట్టుగా అంటీ ముట్టనట్టు ఆమె వేళ్ళను తాకాడు. స్వరాజ్యం అతని ఈ చర్యను గమనించను కూడా లేదు. తమ యిద్దరికీ కొంచెం అన్నం, కూర వండి పుస్తకాలు ముందేసుకుని కూర్చుంది. కల్పించుకుని మాట్లాడే చాతుర్యం స్వరాజ్యానికి ఎప్పుడూ లేదు. సౌమిత్రికి ఏం చెయ్యాలో తోచలేదు. ఈ పుస్తకాల పురుగుని దారికి తెచ్చుకోవటం ఎలా అనే ఆలోచన సౌమిత్రితో పంచభక్ష్య పరమాన్నాలు ముందు వుండీ తినలేని రోగిలా అసహనంగా అటూ యిటూ తిరిగాడు.

స్వరాజ్యం "క్లాసు ఎన్నింటికి సౌమిత్రీ!" అనడిగింది రెండుసార్లు. భోజనం చేసి వెళతాడేమో. వడ్డించాలని ఆమె తాపత్రయం.

"ఇదుగో వెళ్తున్నా!" అంటూ అతను యిల్లు వదిలి రోడ్డుమీద పడ్డాడు.

★ ★ ★

స్వరాజ్యానికి ఆకలివేసింది కానీ, సౌమిత్రి వూళ్ళో వున్నాడు. బాగుండదని తినకుండా ఎదురు చూస్తూ కూర్చుంది. సౌమిత్రి హెూటల్లో టిఫిను తిని, రోడ్లన్నీ బలాదూరు తిరిగి రెండు గంటలకు ఇల్లు చేరాడు. వచ్చేటప్పుడు ఏదో పుస్తకం కొనుక్కుని వచ్చాడు. స్వరాజ్యం 'ఏం పుస్తకం సౌమిత్రీ!' అనడుగుతుంది. రొమాంటిక్‌గా సమాధానం ఎలా చెప్పాలి? అని ఆలోచించుకుంటూ వచ్చిన సౌమిత్రికి ఆశాభంగమే కలిగింది. స్వరాజ్యం పుస్తకం చూసిందో, లేదో తెలియదుగానీ ఏమీ ప్రశ్నించలేదు.

"సౌమిత్రీ! అన్నం వడ్డించాను. రా. భోంచేద్దాం" అని పిలిచింది.

"ఇంకా నువ్వు భోంచెయ్యలేదా స్వరాజ్యం? ఎందుకు నాకోసం ఎదురుచూస్తూ కూర్చున్నావు? చేసెయ్యలేకపోయావా?" అన్నాడు స్వరాజ్యం దీనికి ఏ సమాధానం యిచ్చినా ప్రణయపూరితంగా సంభాషణను మార్చెయ్యాలని నిశ్చయించుకుని.

స్వరాజ్యానికి మాట్లాడటమేకాదు. మాటల్ని కొనసాగించటం కూడా రాదు. ఆమె అతనికి ఏ సమాధానమూ యివ్వలేదు. భోజనాల దగ్గర అతను నవ్విస్తూ ఏదేదో మాట్లాడాడు. స్వరాజ్యం మంచి శ్రోత. చిరునవ్వుతో ఓపికగా విన్నది. ఎలాగో భోజనాల తతంగం ముగి



సింది. రాత్రంతా నిద్రలేనందువల్ల అతనికి నిద్రముంచుకువస్తోంది. చెయ్యి కడుక్కుని, చాలా మామూలుగా, రోజూ జరిగే దినచర్యలా అతను స్వరాజ్యం పమిట చెంగు అందుకుని చెయ్యి తుడుచుకున్నాడు. అలా తుడుచుకోవటంలో ఆమె పైట జారింది. ఆమె గబుక్కున సరిచేసుకునేటంతలో అతని చూపు ఆమె శరీరాన్ని చేధించి శోధించింది. అతను ఏమీ జరగనట్టు ముందు గదిలోకి వెళ్ళిపోయాడు.

స్వరాజ్యం గుండె ఝల్లుమంది. ఆమెకు తమింట్లో చూసిన పశువాంఛలు తెలుసు కానీ సున్నితమయిన శృంగారం తెలియదు. ఇలా వుండవచ్చుననే వూహ కూడా ఆమెకు ఎప్పుడూ కలగలేదు. మగవాళ్ళంతా స్త్రీల శరీరాలను కొనుక్కుంటారని, డబ్బిచ్చినందుకు ప్రతిఫలంగా వీలయినంత ఎక్కువ ఉపయోగించుకుంటారనీ తెలుసు. ఆడవాళ్ళు జీవనం కోసం డబ్బుకు అమ్ముడుపోతారని తెలుసు. కానీ శృంగారమనేది ఒక చూపులో, ఒక సున్నితమయిన స్పర్శలో వుండవచ్చుననీ, స్త్రీ కూడా దానికి స్పందించవచ్చునని ఈ క్షణానే ఆమెకు తెలిసింది. ఒక కోరిక గుండెల్లో పుట్టి శరీరమంతా పాకి ఒళ్ళంతా పులకరించింది.

వంటిల్లు సర్దుతున్నా అంట్లు తోముతున్నా సౌమిత్రి చూపు ఆమెను వెన్నాడుతూనే వుంది. తలచుకునీ, తలుచుకునీ ఆమె పులకరిస్తూనే వుంది. ఆమె వంటింట్లో పని పూర్తిచేసుకుని ముందు గదిలోకి వచ్చేసరికి రాత్రంతా నిద్ర లేని కారణంగా సౌమిత్రి గాఢంగా నిద్రపోతు న్నాడు. అతను తెచ్చిన పుస్తకం సగానికి మడిచి మంచంకింద పడివుంది. ఇందాకటి చూపుతో సౌమిత్రి ఆమె మనసుకు ఎంతో దగ్గరవాడైనట్టు తోచింది. మంచంవద్దకు వెళ్ళి నిద్రపోతున్న అతనిని మొదటిసారి పరీక్షగా చూసింది. వెనక్కు తిరిగి వచ్చేస్తూ పుస్తకాన్ని తిరగేసి సరిగ్గా పెట్టబోయింది. అది క్లాసు పుస్తకం కాదు. ప్రేమ పూతవేసిన ఒక శృంగార నవల.

లీలా మాత్రంగా దానిలో కథ కూడా వుంది. ఒక ధనవంతుడు కులీనుడు అయిన యువ కుడు సమాజాన్ని, తలిదండ్రుల్ని ఎదిరించి ఒక బీద యువతిని, కులహీనురాలిని పెళ్ళా డతాడు. ఆ వయసుకుండే చాపల్యం కొద్దీ స్వరాజ్యం యువతీ యువకులస్థానాల్లో తామి ద్దరినీ వూహించుకుని మురిసిపోయింది.

తాను చూసిన శృంగారంలో జీవితంపట్ల జుగుప్సను పెంచుకున్న స్వరాజ్యం ఈ నవ లలో వర్ణించిన సున్నితమయిన శృంగార వర్ణ నలు మైమరచి చదివింది, వివశురాలయిపో యింది. కొన్ని భాగాలు తిరిగితిరిగి చదివింది.

తర్వాత ఏమీ ఎరగనిదానిలా ఆ నవలను సౌమిత్రి పక్కన వుంచుతూంటే, అతను హఠా త్తుగా ఆమె చేతిని పట్టుకున్నాడు.

''బావుందా?'' అనడిగాడు చెవి దగ్గర గుస గుసగా.

తన బుగ్గల్లోకి ఎగసిన రక్తపు పొంగువేడి స్వరాజ్యానికి తెలుస్తూనే వుంది. పెదవులు సన్నగా వణికాయి. నెమ్మదిగా, బిడియపడు తూనే తన చేతిని వెనక్కు లాక్కోబోయింది. అతను తనపట్టుని మరింత బిగించి.

''సమాధానం చెప్పు'' అన్నాడు తన గడ్డంతో ఆమె బుగ్గను తాకీ తాకనట్టు తాకి, స్వరాజ్యానికి ఈ అనుభవం కొత్త. శరీరం మైమరచిపోతున్నది.

సౌమిత్రి అనుభవం చెబుతోంది- ఆమె దారిలోకి వస్తోందని.

అతను హఠాత్తుగా, బలంగా ఆమెను ముందుకు గుంజాడు. స్వరాజ్యం వెళ్ళి అతని గుండెలమీద పడింది. అతను ఆమె పెదవు ల్ని గాఢంగా చుంబించి వదిలేశాడు. తన నెవరో నిప్పుల సెగలోకి తోసినట్లు తోచింది స్వరాజ్యానికి. శరీరంలోని శక్తి అంతా హరించు కుపోయినట్టుగా వుంది. ప్రాణం లేనిదానిలా, తూలుతూ తన గదిలోకి వచ్చేసింది.

సౌమిత్రి పుస్తకాలు ముందు వేసుకుకూర్చు న్నాడు. ఇవాళ తను ప్రయోగించిన ఫార్ములా పురుష స్పర్శ ఎరుగని ఆడపిల్లలమీద బాగా పనిచేస్తుందని అతనికి తెలుసు. లోగడ తన మరదలిమీద ప్రయోగించి చూస్తే ఆ అమ్మాయి వెంటనే ఏదో పనివున్నట్టు తన గదిలోకి వచ్చి, తన చుట్టూ తిరిగి, కోరి మరీ ఒళ్ళో వాలింది.

'నా తప్పేమీ లేదు' అని చేతులు దులిపే సుకోవటానిక్కూడా యిది వుపయోగపడు తుంది. 'స్వరాజ్యం నుండి కూడా అతను ఆ విధమయిన ప్రవర్తననే ఆశించాడు. అందు కని, ఎదురు చూస్తూ కూర్చున్నాడు. ఆ అమ్మాయి వచ్చినా బింకం ప్రదర్శించదలుచు కున్నాడు.

స్వరాజ్యానికి అతని తలలో సుడులు తిరు గుతున్న యీ ఆలోచనలేవీ తెలియవు. పుస్తకా లు ముందున్నాయికాబట్టి చదువుకుంటున్నా డనే అనుకుంది. ఈ చెత్త ఆలోచనలన్నీ నాకే. సౌమిత్రి బుద్ధిగా చదువుకుంటున్నాడు అను కుంది.

కానీ, ఆ రాత్రి అతని కంటే ముందు భోజనం చేసి, తలుపులు లోపలినుండి జాగ్ర త్తగా గడియపెట్టుకుని పడుకుంది. అతను ''భోజనం పెట్టు స్వరాజ్యం!'' అంటే నిద్రపో తున్న దానిలా మూలిగింది తప్ప లేచి వచ్చి అన్నం పెట్టలేదు.

'ఇది జడపదార్థంరా బాబూ! దీన్ని ప్రేమతో కొట్టుకురావాలి తప్ప కోరికకు లొంగే ఘటంకా దు'' అనుకున్నాడతను.




మరురోజు క్లాసు వంకతో బయటకు వచ్చాడేకానీ సౌమిత్రి మనసంతా స్వరాజ్యం చుట్టూనే తిరుగుతోంది. ఎలా? ఎలా? అని మధన పడుతూనే వున్నాడు. మధ్యాహ్నం ఒంటిగంట వరకు రోడ్లు పట్టుకుని తిరిగిన సౌమిత్రి భోజనానికి యింటికి వెళ్ళలేదు. హొటల్లో భోజనం ముగించుకుని, స్నేహితుడి గదికి వెళ్ళిపోయాడు.

సౌమిత్రి మనసులోని ఆలోచనలు ఏమీ తెలియని స్వరాజ్యం అతను భోజనానికి వస్తాడని ఎదురుచూస్తూ కూర్చుంది. ఇదివరలో అయితే బహుశా ప్రయివేటు క్లాసులు అయిపోయాయేమో, వూరికి వెళ్ళిపోయాడేమో అనుకునేది. కానీ, ఇప్పుడలా అనుకోవటానికి స్వరాజ్యానికి మనస్కరించలేదు. మొన్నటి అతని చొరవ, ఆమెను అలా అలోచించనివ్వలేదు. అతను వూరు వెళ్ళలేదని, తప్పక వస్తాడని ఆమెకు అంతరాంతరాల్లో తెలుస్తోంది. రావాలని కూడా ఆమె మనసు కోరుకుంటోంది. వస్తే భోజనం పెడతాను లేకుంటే లేదు అనుకోవాలని చూసింది. నిరాసక్తంగా వుండటానికి ప్రయత్నించింది. ఏమీ జరగనట్టు భోంచేయాలని చూసింది. ఇందులో ఏ ఒక్కటీ జరగలేదు. స్వరాజ్యానికి భోజనం సహించలేదు. కంచంముందు కూర్చుని లేచిపోయింది. చదువుకోవాలని పుస్తకం తెరిచిందికానీ, ప్రతి చిన్న అలికిడికీ వీధిలోకి పరుగెత్తి చూడటం మొదలుపెట్టింది. చివరకు సౌమిత్రి రానేలేదు.

సౌమిత్రి స్నేహితులతో పేకాడి, వాళ్ళతోపాటు మహోజ్వల సాంఘిక నాటకం ఒకటి చూసి రాత్రి వాళ్ళతోపాటే వాళ్ళ గదిలో నిద్రపోయాడు. స్వరాజ్యం కోడినిద్రపోతూ, అతను రావాలని ఎదురుచూస్తూ, వస్తాడని ఆశిస్తూ ఆ రాత్రి గడిపేసింది. సౌమిత్రికి కావలసింది కూడా అదే. అందుకనే రెండవరోజు కూడా యింటికి వెళ్ళాలనే కోరికను సౌమిత్రి నిగ్రహించుకున్నాడు. స్వరాజ్యం వంటకూడా చెయ్యకుండా, వీధి వరండాలో కూర్చుని అతని కోసం ఎదురుచూసింది. తనవల్ల ఏదో తప్పు జరిగిందనీ, అందువల్లనే సౌమిత్రి యింటికి రావటంలేదనీ ఆమె భావించుకుంది. ఆమె నిశితంగా నా తప్పు ఏమిటి అని తనను తాను శోధించుకున్నట్టయితే ఏమీలేదు అని ఆమెకు అర్థమయివుండేది. పరిణతి చెందని ఆమె మనసు, యవ్వన సహజమయిన ఉద్వేగమూ ఆమెను ఆవిధంగా ఆలోచించనివ్వలేదు. అతనికి నామీద కోపం వచ్చింది. అందుకే రాలేదు అని పదేపదే తనను తాను నిందించుకుంది.

మూడవరోజు ఉదయం సౌమిత్రి నిద్రలేచి అద్దంలో తనను తాను చూసుకున్నాడు. రెండు రోజులు నిద్రలేకుండా పేకాట ఆడటంవల్లనూ, నాటకాలు చూడటంవల్లనూ కళ్ళు ఎర్రగా, అలసటగా వున్నాయి. అతను తల కూడా దువ్వుకోకుండా నలిగిన బట్టలతో ఉన్న పళంగా బయలుదేరి యింటికి వచ్చాడు.

ఆ సమయానికి స్వరాజ్యం లోపలిగదిలో వుంది. ఆమె అతని రాకను గమనించలేదు. అతను పెద్ద శబ్దాలతో బల్లమీద పుస్తకాలు సర్దటం మొదలుపెట్టాడు. స్వరాజ్యం దడదడా కొట్టుకునే గుండెలతో పరుగుపరుగున ముందుగదిలోకి వచ్చి చూసింది. సౌమిత్రిని చూడగానే ఆమె గుండెల్లో ఒక ఆనందతరంగం ఉవ్వెత్తున ఎగసింది. స్త్రీ శరీరానికీ, మనసుకూ చాలా దగ్గర సంబంధం వుంది. మగవాడు ఏ ఒక్కదాన్ని తన అధీనంలోనికి తెచ్చుకోగలిగినా రెంటినీ జయించవచ్చు.

సౌమిత్రి వాలకం చూసి స్వరాజ్యం కలవరపడింది. అలిసిపోయిన మొహం, నలిగిన బట్టలు, ఎర్రబడ్డ కళ్ళూ, నేనే కారణం అని ఆమె వెంటనే తప్పును తనమీద వేసేసుకుంది. మాటల చాతుర్యం చేతకాదేమో, మౌనంగా లోపలకి వెళ్ళి వేడి కాఫీ తెచ్చి యిచ్చింది.

''అక్కడ పెట్టు'' అన్నాడు సౌమిత్రి ముభావం నటిస్తూ.

''అలా వున్నావేం సౌమిత్రీ!''

''నేనెలా వుంటే నీకెందుకు?'' అన్నాడు గొంతులో అలక, కోపం, బాధ సమపాళ్ళలో మిళాయించి.

స్వరాజ్యం బెంబేలు పడిపోయింది. అతని

కి చాలా కోపం వచ్చినట్టుమాత్రం గ్రహించింది. ఏంచేస్తే అతనికి కోపం తగ్గుతుందో తెలీదు.

గొంతు పెగుల్చుకుని, ''సారీ! నన్ను క్షమించు...'' అంది. ఆ క్షణంలో తాను క్షమించరాని నేరం ఏమీ చెయ్యలేదని ఆ అమ్మాయికి తట్టలేదు. ఆ సంగతి సామిత్రికి బాగానే తెలుసు. కానీ ప్రస్తుతం ఆమె అలా అనుకుంటేనే అతనికి లాభం.

''సారీలు, క్షమాపణలూ ఎందుకులే స్వరాజ్యం. చిన్నప్పటినుండీ కలిసి ఒక బళ్ళో చదువుకున్నాం. నన్ను బాగా అర్థంచేసుకున్నావులే... సంతోషం'' అన్నాడు దెప్పిపొడుస్తూ.

తను అతన్ని తప్పించుకుని తిరగటం, పక్కగదిలో తలుపులు బిగించుకుని పడుకోవటం అతన్ని అవమానించటమేనని స్వరాజ్యం చాలా నిజాయితీగా నమ్మింది. అది తన తప్పు కూడా అనుకుంది. దానికి అతనికి కోపం రావటం సహజమే అని భావించింది. కానీ, జరిగిపోయిన తప్పుని ఎలా సరిదిద్దటం. అతని అలకను తీర్చే గురుతరమయిన బాధ్యత తన భుజస్కంధాలమీద వుందనుకుందామె. అతన్ని శాంతింపచేయటానికి ఆమెదగ్గర మాటల్లేవు. అంత వాక్చాతుర్యమూ లేదు. ఇటువంటి క్లిష్ట పరిస్థితుల్లోనుండి బయటపడే మార్గం వయసే నేర్పుతుంది. దగ్గరగా వెళ్ళి అతని చేతిని పట్టుకుంది.

ఈ అవకాశం పోతే మళ్ళీ రాదని సామిత్రి అంతరాత్మ హెచ్చరించింది. అతను ఆమెను తీగలా అల్లుకుపోయి ఒళ్ళంతా ముద్దులతో ముంచెత్తాడు.

అతనినుండి విడివడాలని తెలుసు స్వరాజ్యానికి. కానీ, అతనికి మళ్ళీ కోపం వస్తుందేమో? అని భయపడింది మొదట. ఆ తర్వాత ఏమి అనటానికి, చేయటానికి ఆమెలో శక్తి లేకపోయింది.

★ ★ ★

ఆవిధంగా ఎంతమందినో దూరాన్నుంచి వూరించిన స్వరాజ్యం, పొలం, నగలూ, నాణ్యాలతో ఆమెకు కన్నెరికం చేయటానికి సిద్ధపడ్డ వూరి పెద్దలందరినీ మొండితనంతో, కేవలం మొండితనంతో తప్పించుకున్న స్వరాజ్యం... కాసిని ప్రేమమాటలతో ఖర్చేమీ లేకుండా సామిత్రి వశమయింది.

పురుషుడు స్త్రీ మనసు గెలుచుకున్నాడా, ఆమె ప్రపంచాన్ని కూడా ఖాతరు చెయ్యదు. ఎంతో ప్రాణప్రదంగా కాపాడుకుంటున్న శీలాన్ని అర్పించటానికి కూడా వెనుదీయదు. శరీరాన్ని గెలుచుకున్నాడా... మానసికంగా అతనికి బానిస అవుతుంది. అతను విదిల్చికొట్టినా అతన్ని ప్రేమిస్తూనే వుంటుంది. సామిత్రి స్వరాజ్యం శరీరాన్ని స్పందింపచేయటంద్వారానే ఆమె మనసులోకి ప్రవేశించగలిగాడు. ఆమె మనసులోకి ఒకసారి ప్రవేశించాక శరీరంమీద అధికారం సంపాదించటం పెద్ద కష్టంకాలేదతనికి. స్వరాజ్యం అందమయిందికాదుగానీ ఆ వయసుకు సహజమయిన ఆకర్షణకుమాత్రం లోటులేదు. పెద్ద శరీర సౌష్టవం గల స్త్రీ కాదు. అగ్రకులంలో పుట్టి, పెళ్ళిచూపుల్లో ఆమె ఎదురైతే ఎందరు యువకులు ఆమెను వివాహమాడటానికి సిద్ధపడేవారో అనుమానాస్పదమే. కానీ, అందుబాటులో వుండేకులంలో పుట్టి, అందకుండా ఆమె పురుషజాతిని ఆడించింది. అందులో ఆమె ప్రమేయం ఏమీ లేకపోయినప్పటికీ, అనాయాసంగా చేజిక్కక పోవటమే స్వరాజ్యంలోని ఆకర్షణ.

ఎప్పుడయితే స్వరాజ్యం తన వశమయిందో ఆ తర్వాత సామిత్రికి ఆమెపట్ల ఆసక్తి నశించాల్సిందే. పురుషుణ్ణి జీవితాంతమూ ఆకర్షించగల శరీరమూ, చాతుర్యమూ ఆమెకు లేవు. కానీ, సామిత్రి ఆ వూరి పెద్దలలాగ రక్తం చల్లబడిన యువకుడు కాదు. అందువల్ల, ఆమెతో ఈ అనుభవాన్ని అతని మనసు పదేపదే కోరుకుంది. ఏం జరిగిందో స్వరాజ్యానికి అర్థమయింది. ఏడ్చి రాగాలు పెట్టలేదామె. నన్ను పెళ్ళిచేసుకో అని అడగలేదు. మౌనంగా వుండిపోయింది.

ఆ తర్వాత సామిత్రి తనను దగ్గరకు తీసుకోబోయినప్పుడుమాత్రం దృఢమయిన కంఠంతో ''వద్దు... సామిత్రీ'' అంది.

ఒక్క కలయికలో పురుషుడు స్త్రీమీద అధికారం సంపాదించుకుంటాడు. స్త్రీ ఆ అధికారానికి లోబడుతుంది. స్వరాజ్యం యిందుకు




విరుద్ధంగా ప్రవర్తించింది. అతను మొండిగా దగ్గరకు లాక్కుంటే ఆమె అతన్ని అంతకంటె మొండిగా దూరం నెట్టేసింది. ఇప్పుడుమా త్రం సౌమిత్రికి కోపంరాదా! స్వరాజ్యం ఈసారి అతని కోపానికి భయపడదలుచుకోలేదు. ఈ దృఢచిత్తం ఆమెకు ముందువుంటే బావుండేది. ఒక చేదు అనుభవం తర్వాతగానీ ఆమె పాఠం నేర్చుకోలేదు.

ఇప్పుడు సౌమిత్రి పని పరమాన్నం ఒక చెంచా తిన్నాక గిన్నె పడదేసుకున్న పసివాడి చందాన అయింది. ఈ అనుభవంకోసం అత ను తాను పట్నంలో అడుగుపెట్టినదాదిగా ఎదురుచూశాడు. అనుభవమయితే అందుబా టులోకి వచ్చిందిగానీ యింకా మనసు తీరనేలే దు. అందీ అందకుండానే ఆ మాధుర్యం దూరమౌతూవుంటే అతను సహించలేకుండా వున్నాడు. ముసలమ్మా, లీలా అయిదారు రోజు ల్లో వచ్చేస్తారు. ఇప్పుడీ అవకాశాన్ని తను చేజార్చుకుంటే మరిక అవకాశమే లేదు.

రెండుమూడు నిద్రలేని రాత్రులు గడిపాక, చాలా తర్జనభర్జనల అనంతరం అతనొక నిర్ణ యానికి వచ్చాడు.



''స్వరాజ్యం... పెళ్ళి చేసుకుందామా?''

అతనికి కాఫీ అందిస్తోన్న స్వరాజ్యం ఉలి క్కిపడింది. కాఫీ కప్పు తొణికి అతనిమీద రెండు చుక్కలు పలికాయి కూడా. అంతలోకే మళ్ళీ సర్దుకుని, మౌనంగా వంటగదిలోకి వెళ్ళి పోయింది. కొంతసేపటికి తను కూడా గ్లాసులో కాఫీ తెచ్చుకుని తాగుతూ కూర్చుంది.

''స్వరాజ్యం! ఏంచేస్తే నీకు నామీద, నా ప్రేమమీద నమ్మకం కలుగుతుంది?''

ఆమె మాట్లాడలేదు.

''నన్ను క్షమించు స్వరాజ్యం. నేను తొందర పడినమాటా, తప్పు జరిగిన మాటా వాస్తవమే. ఆ తప్పుని సరిదిద్దుకునే అవకాశం నాకివ్వు. మనం పెళ్ళిచేసుకుందాం''

''అదంతా జరిగేపని కాదు సౌమిత్రీ! మీ యింట్లో ఒప్పుకోరు. మా అమ్మ కూడా యాగీ చేస్తుంది. అదంతా మర్చిపో. జాగ్రత్తగా చదు వుకుందాం'' అంది స్వరాజ్యం.

ఇంతకంటె ఆమె తనతో పోట్లాడితేనూ, వాదిస్తేనూ నచ్చచెప్పటం సులువయ్యేది సౌమిత్రికి. చదువుకుంటోన్న, అతి జాగ్రత్తగా ఆచి తూచి అడుగువేస్తోన్న స్వరాజ్యానికి నచ్చ చెప్పటం, నమ్మించటం అంత సులువయిన పని కాదని సౌమిత్రికి అర్థమయింది.

''పోనీ! రిజిష్టరు ఆఫీసులో పెళ్ళి చేసు కుందామని నేనంటే నన్ను నమ్ముతావా స్వరా జ్యం?''

ఈ ప్రత్యేక వివాహాల చట్టం గురించి స్వరాజ్యం వినివున్నది. రిజిష్టర్ మ్యారేజీని సంతకాల పెళ్ళి, అదీ ఒక పెళ్ళేనా? అని ఎంత చులకనగా మాట్లాడినా దీనిలో వున్న భద్రత సంఘం ఆమోదించిన పెళ్ళిలో లేదని స్వరాజ్యం ఎరుగును. కానీ, సంఘం ఆమోద ముద్ర వేసిన సంప్రదాయ వివాహానికి పెద్దల మద్దతు వుంటుంది. సంతకాల పెళ్ళికి చట్టం కల్పించే రక్షణ వుంటుంది. తమ పెళ్ళికి ఎవరూ అంగీకరించరు. అది జరిగే వ్యవ హారం కాదు. తాము ఎవరికీ తెలియకుండా ఏ గుడిలోనయినా దండలు మార్చుకుని వివాహం అయిందనిపించుకోవచ్చు. అది తన ఆత్మతృప్తికేకానీ, ఎవరూ తనకు మద్దతురారు. తనని సమర్థించరు. జరగని విషయాలకై యింత ఆలోచన దేనికి?

''ఏమిటి? ఆలోచిస్తున్నావు స్వరాజ్యం! సంతకాల పెళ్ళికి ఒప్పుకో. ఈ పెళ్ళి నీకు నామీద అన్ని అధికారాలు లభింపచేస్తుంది. నేను మళ్ళీ పెళ్ళి చేసుకున్నా, నువ్వు నన్ను

ముక్కుకు తాడుకట్టి లాక్కొచ్చుకోవచ్చు''

సాంప్రదాయ హిందూ వివాహంలో లేని ప్రత్యేక వివాహాల చట్టంలోని అదనపు ఆకర్షణ యిది. స్వరాజ్యం సర్వసంగ పరిత్యాగిని కాదు. వయసులో వున్న స్త్రీ. యిన్నాళ్ళ సంగతి ఏమోకానీ, యిప్పుడు ఒకసారి శృంగారాన్ని చవిచూసింది. ఆవిధంగా తన మనసులో సౌమిత్రికి ఒక స్థానాన్ని కల్పించింది కూడాను. జరిగింది తప్పనే ఆమె కూడా నమ్ముతూ వుంది. తప్పును పునరావృత్తం చేయకూడదనే ఆమె నిగ్రహాన్ని పాటిస్తున్నదికానీ సౌమిత్రిపట్ల ప్రేమ లేకకాదు. కోరికలు లేక అసలేకాదు. పెళ్ళి అనేది తమ కులంలో పుట్టిన ఆడపిల్లలకు అందరాని పండు అని ఆశించడానికి వెరుస్తున్నదికానీ వివాహంపట్ల విముఖత లేదు.

సౌమిత్రి పలువిధాల నచ్చచెప్పినమీదట స్వరాజ్యం వివాహానికి అంగీకరించింది. అతను అంతులేని తమకంతో ఆమెను కౌగలించుకున్నాడు.

★ ★ ★

మరురోజే సౌమిత్రి యిద్దరు స్నేహితులను వెంటతీసుకువచ్చాడు. వాళ్ళను బయట కూర్చోపెట్టి లోపలకు వచ్చాడు.

''వీళ్ళెవరు సౌమిత్రీ, కాఫీ చేసి యివ్వనా...?'' అనడిగింది స్వరాజ్యం అమాయకంగా.

దానికి సమాధానంగా అతను ఆమెను గాఢంగా కౌగలించుకుని ముద్దుపెట్టుకున్నాడు.

''పిచ్చి స్వరాజ్యం... యివాళ మనపెళ్ళి. వీళ్ళిద్దరూ సాక్షి సంతకాలు చేయటానికి వచ్చారు''

''ఇప్పుడా పెళ్ళి? యివాళ? మంచిరోజా... అదీ...''

''నీ ముఖం! ముహూర్తాలు అదీ అంతా ట్రాష్. నాకు నమ్మకం లేదు వాటిల్లో. అవన్నీ నిజమే అయితే యింతమంది చిన్నపిల్లలు యిలా విధవలుగా మిగిలిపోతారంటావా? మంచి ఆలోచన వచ్చిన క్షణమే మంచి ముహూర్తం. ఏమంటావ్?'' స్వరాజ్యం సందిగ్ధంగానే తల ఊపింది.

''పెళ్ళి యింట్లో చేసుకుందామా? ఆఫీసులోనా?''

''అదేమిటీ మళ్ళీ?''

''అదంతే... మనమంతా రిజిస్ట్రారాఫీసుకి వెళ్ళి సంతకాలు చెయ్యటం ఒక పద్ధతి. కొంత డబ్బు అదనంగా యిస్తే ఆఫీసరుగారే యింటికి వస్తారు. మనం సంతకాలు పెడతాం. యిది రెండవ పద్ధతి''

స్వరాజ్యం న్యాయశాస్త్రం చదువుకోలేదు. ఈ పద్ధతులన్నీ తెలియవు. సాక్షులు సంతకాలు పెడతారని, వధూవరులిద్దరూ మేజర్లు అయి వుండాలనీ మాత్రం విన్నది.

''నాకు రెండవపద్ధతే యిష్టం. ఆఫీసులో అయితే మరీ అఫీషియల్‌గా అనిపిస్తుంది. యింట్లో ఒక దేవుడు పటం పెట్టుకోవచ్చు. భగవంతుడి ఎదురుగా దండలు మార్చుకోవచ్చు... ఏమంటావ్?''

స్వరాజ్యం మాట్లాడకపోవటం చూసి అతను జేబులోనుండి ఒక పొట్లం తీశాడు.

''ఇదుగో... మంగళసూత్రం... ఇది కూడా కడతారు. ఆఫీసులో యివన్నీ సిల్లీగా అన్పిస్తాయి. నాకు యిబ్బందిగా వుంటుంది. చీరె కూడా తెచ్చాను కట్టుకో. ఏదయినా కొంచెం తీపి తయారుచెయ్యి. నేను బయట గదిలో కూర్చుంటాను. ఆఫీసరుగారికి కబురు చేస్తున్నాను... సరేనా?''

వచ్చిన ఇద్దరిలో ఒక స్నేహితుడు బయటకు వెళ్ళాడు. పదకొండు గంటలకు ఆఫీసరుగారిని వెంట తెచ్చాడు. వస్తూవస్తూ రెండు పెద్దపెద్ద పూలదండలు, స్వీట్లు కూడా తెచ్చాడు.

స్వరాజ్యం సౌమిత్రి తెచ్చిన కొత్తచీరె కట్టుకున్నది. ఆఫీసరుగారు యిద్దరితోనూ ప్రమాణాలు చేయించాడు. ఒక పొడుగాటి పుస్తకం ఒకటి వీళ్ళ ముందుకు తోశాడు. స్వరాజ్యం, సౌమిత్రి అందులో సంతకాలు చేశారు. సాక్షులిద్దరూ కూడా సంతకాలు చేశారు. దండలు మార్చుకున్నారు.

''సార్! నేను మంగళసూత్రం కూడా కడతా




ను'' అన్నాడు సౌమిత్రి.

''మనం ఎంత అభివృద్ధి చెందినా మనకీ మంగళసూత్రం సెంటిమెంటు వదలదోయ్'' అన్నాడు ఆఫీసరు.

మంగళసూత్రధారణ జరిగాక, సౌమిత్రి అతనికి ఫీజు యిచ్చాడు. అది అందుకుని అతను వెళ్ళబోతోంటే ''సార్! చిన్న పార్టీ'' అని అతన్ని ఆపి స్వరాజ్యం చేసిన పాయసం, స్నేహితుడు తెచ్చిన స్వీట్లు పెట్టారు. అతను నూతన వధూవరులిద్దరినీ యింకొకసారి అభినందించి వెళ్ళిపోయాడు.

స్నేహితులిద్దరూ లేచి, ''యిక మేమూ వెళ్తాం'' అని శలవు తీసుకున్నారు. ఆఫీసరు గారిని తీసుకొచ్చిన రెండవ స్నేహితుడు సౌమిత్రిని చూసి కొంటెగా కన్నుకొట్టాడు. అది స్వరాజ్యం గమనించింది. దానికి పెద్ద ప్రాధాన్యత యివ్వలేదు. 'వీడెవడో పోకిరీలాగున్నాడు' అనుకుంది.

★ ★ ★

స్వరాజ్యం గుండెలమీద మంగళసూత్రాలు చక్కలిగింతలు పెడుతున్నాయి. ఊహ తెలిసిన నాటినుండి తమవారి ఎవరి మెడలోనూ చూడని ఆభరణం. రాళ్ళనగలూ, బంగారపు చంద్రహారాలు చూసిందికానీ పచ్చని నూలుతాడుకి కట్టిన రెండు మంగళసూత్రాలు చూడలేదు తాను. యిదేదో పెద్దకులపువాళ్ళ ప్రత్యేక నగ. దీనిని ఆశించడం తమవంటివారికి తగదు అనుకుంది. దీనిని తనకు ప్రసాదించాడు సౌమిత్రి. ఆమె మనసు అతనిపట్ల కృతజ్ఞతతో నిండిపోయింది. ఈ ప్రపంచంలో అతనికంటె ప్రాణప్రదమయినవాడు ఆ క్షణాన ఆమెకు మరి ఒకడు లేడు. అతనికోసం శరీరాన్ని, మనసునూ, జీవితాన్ని తృణప్రాయంగా అర్పించగలదామె!

జ్ఞానం తెలిసిన నాటినుండీ చదువూ, చదువూ అని పలవరించింది. చదువే తన జీవిత ధ్యేయం అనుకుంది. పెళ్ళి గురించి ఏనాడూ ఆలోచించలేదు. అది తనకు అందని పండు అనుకుంది. జీవితం హఠాత్తుగా యింత అందమయిన మలుపు తిరిగి స్వరాజ్యాన్ని వివశురాలిని చేసింది. పదేపదే మంగళసూత్రాల్ని తడుముకుని ఉప్పొంగిపోయింది. ఇక తాను ట్రైనింగు కొనసాగించాల్సిన అవసరం తోచలేదామెకు.

''ఇపుడు మనం వూరు వెళ్దామా సౌమిత్రీ, అనడిగింది అమాయకంగా.

మీసాల నాయుడి ఊహ ఆమెను భయపెట్టడంలేదు. తన మగడు, మగవాడు సౌమిత్రి చూసుకుంటాడు ఆ విషయాలన్నీ. తాను అతన్ని అనుసరించి వెళ్ళడమే. తల్లి ఆశ గుర్తుకు వచ్చింది. సన్నగా నవ్వుకుంది. మీసాల నాయుడు కూతురిని వుంచుకుంటాడని నంబరపడిన తల్లి, కూతురు ఆ యింటి కోడల య్యిందంటే ఎంత సంబరపడుతుందోకదా అనుకుంది. ఆ ఇరుకు సందుల్లో మురికి గొందుల్లో వేశ్యావృత్తే పరమావధిగా బతుకుతున్న అమ్మ నన్నూ, నా జీవితాన్నీ చూసి తనను తానే అసహ్యించుకోవాలి. తమకులంలో పుట్టినవాళ్ళకు శరీరాన్ని అమ్ముకోవటం మినహా గత్యంతరం లేదని భావించిన తల్లి యిక తన సిద్ధాంతాన్ని మార్చుకోక తప్పదు.

''భోగం ముండవి. నిన్ను పెళ్ళిచేసుకునే మగాడెవడే? నా మాట విను. కులవృత్తిని నమ్ముకో'' అని హితబోధ చేసిన మేనమామ స్థిరపడిన తన జీవితాన్ని చూసి అతని దుర్మార్గపుటాలోచనకు పశ్చాత్తాపపడాలి.

ఎప్పుడెప్పుడు తన పెళ్ళిని వూరంతటికీ తెలియచేద్దామా అని స్వరాజ్యం ఆరాటపడింది. స్త్రీకి ప్రేమ రహస్యం. పెళ్ళి పబ్లిసిటీ. చాలా గర్వించదగిన విషయం. పురుషుడు దీనికి పూర్తిగా వ్యతిరేకం. అతను ప్రేమను గర్వంగా చాటుకుంటాడు. అది అతని పురుషత్వానికి పబ్లిసిటీ. పెళ్లిలో తాను బంధించబడినట్లు భావిస్తాడు. స్వాతంత్ర్యం పోయిందని గగ్గోలు పెడతాడు. అందునా ఇటువంటి పెళ్లి! దీనిని వెల్లడించాడా అతను సమాజానికి ఎదురొడ్డి నిలబడాలి. దానితో పోరాడాలి. ముఖ్యంగా తన కుటుంబసభ్యులకు కూడా అంగీకారం కాని ఈ పెళ్లిని వెల్లడించి పోరాడటానికి చాలా ధైర్యం కావాలి. అది సౌమిత్రికి లేదు. అతనికి అంగీకారమూ కాదు.

అందువల్ల, అతను వూరు వెళ్దామని ఉత్సాహపడిన స్వరాజ్యంవైపు వెర్రిదాన్ని చూసినట్టు





చూశాడు.

"మనం పెళ్లి చేసుకున్నామంటే మా ఇంట్లో పూరుకుంటారనుకుంటున్నావా స్వరాజ్యం?" అని సూటిగా అడిగాడు.

స్వరాజ్యానికి మంగళసూత్రం కట్టాక, అతనికి ఆమె ఏమనుకుంటుందో అనే బిడియం పోయింది. ఆమెను తాను పొందలేక పోవచ్చుననే భయంపోయింది. పోట్లగిత్తకు ముక్కుతాడు వేశాక దానితో ఎలా అయినా ప్రవర్తించవచ్చు. అది ఎదురు తిరగదు. తప్పించుకువెళ్లనూ లేదు. స్వరాజ్యానికి మునుపు వున్న తెగింపూ, ధైర్యం పోయాయి. ఆమె మానసికంగా సౌమిత్రికి అధీనమయిపోయింది.

"మరెలా సౌమిత్రీ? ఇప్పుడేం చేద్దాం...?" అంది నిస్సహాయంగా. సౌమిత్రి స్వరాజ్యాన్ని తన కౌగిట్లోకి తీసుకున్నాడు.

"ఎందుకు స్వరాజ్యం అంత భయపడతావు? మనిద్దరం చదువుకుంటున్నాం. ఉద్యోగాలు సంపాదించుకుని మన కాళ్ళమీద మనం నిలబడదాం. అంతవరకూ ఈ పెళ్లిని గురించి ఎవరికీ తెలియనివ్వద్దు. చివరకు లీలకి కూడా"

'ఇలా తెలియనివ్వకూడని 'పెళ్లి'ని ఎందుకు చేసుకున్నాం? పెళ్లి చేసుకునేందుకు కూడా ఉద్యోగాలు వచ్చేవరకు ఎందుకు ఆగలేకపోయాం?' అని తర్కించే తెలివీ, ధైర్యమూ రెండూ స్వరాజ్యానికి లేకపోయాయి. ఆమె అసంతృప్తిగానే అతని ఆజ్ఞలాంటి సూచనను అంగీకరించింది.

ఆ రాత్రి సౌమిత్రి చాలా సంవత్సరాలుగా కాపురం చేస్తున్న భర్తలాగా, మామూలుగా స్వరాజ్యం పక్కనచేరి లైటార్పేశాడు. ఇతను చట్టపరంగా, సాంప్రదాయబద్ధంగా తన భర్త. ఏవిధంగా ఇతన్ని తాను దూరంగా వుంచగలదు! స్వరాజ్యానికి ఎక్కడో ఏదో వెలితి తెలుస్తూనే వుంది. అదేమిటో ఇదమిద్ధంగా తెలియటంలేదు. ఆమె ద్వైదీభావంతోనే అతనికి వశురాలయింది.

అవిధంగా మొదలయిన వాళ్ళ దాంపత్యం ముసలమ్మా, లీలా వూరినుండి తిరిగి వచ్చేవరకు నిరాటంకంగా సాగింది. స్వరాజ్యం జీవితంలో ఎప్పుడయినా సంపూర్ణంగా సంతోషంగా వుందీ అంటే ఆ పదిరోజులే. సౌమిత్రీ, ఆమే తప్ప ఎవరూలేని ఆ ఇంటికి ఆమె రాణి. సౌమిత్రి డబ్బు బాగా ఖర్చుపెట్టేవాడు. స్వరాజ్యం పుస్తకాలు పక్కన పడేసి పక్కా గృహిణిలాగా, సరుకులు తెప్పించుకుంటూ, ఇల్లు సర్దుకుంటూ, వంటచేస్తూ, బట్టలు ఉతుకుతూ తన భార్య హోదాని ఆనందంగా అనుభవించింది. ముసలమ్మా, లీలా వస్తారంటే ఆమె ఆనందానికి ఆనకట్ట వేసినట్టయింది.

★ ★ ★

ఆ రాత్రి స్వరాజ్యం తన కౌగిలిలో పరవశించివుండగా సౌమిత్రి చటుక్కున ఆమె మెళ్ళో మంగళసూత్రాలు తీసేశాడు.

స్వర్గంలోనుండి భూమిమీదకు తోసినట్టు తోచింది స్వరాజ్యానికి.

''ఇదేమిటి సౌమిత్రీ!'' అంది బలహీనంగా.

''నువ్వు వీటిని మెడలో వేసుకుతిరిగితే ముసలమ్మకూ, లీలకూ అనుమానం రాదా స్వరాజ్యం?''

స్వరాజ్యం ఒకక్షణం మౌనం వహించింది. వెంటనే తేరుకుని ''సూత్రాలు ఎవరికీ కనపడకుండా నేను జాగ్రత్తపడతాను సౌమిత్రీ. వాటిని ఇలా ఇవ్వు. నాకేమిటో చాలా తప్పుగా తోస్తుంది'' అంది.

''నేను నీ భర్తని స్వరాజ్యం. మంగళసూత్రాలు నీ మెడలో వున్నా లేకపోయినా నామాట మీద నమ్మకం లేదా నీకు? పోనీ, నమ్మకం లేకపోయినా మన పెళ్లి చట్టరీత్యా జరిగింది. ఆ చట్టప్రకారం సంతకాలకీ, సాక్షులకే కానీ సూత్రానికి విలువలేదు. మనం చదువుకున్న వాళ్ళం స్వరాజ్యం. మనకీ అర్థంలేని ఛాదస్తాలు వద్దు. దీన్ని వేసుకుని తిరిగి మనకు సమస్యలను సృష్టించకు... ప్లీజ్''

పెళ్లిరోజు ఆఫీసరుగారు కూడా దీన్ని ఛాదస్తమనే అన్నారు. అయినప్పటికీ ఇతను తాళికట్టాడు. మళ్ళీ ఈ రోజు తానే దీన్ని ఛాదస్తమని తన మెడలోనుండి తీసివేస్తున్నాడు. స్వరాజ్యం మౌనం వహించింది.

''నామాట విను స్వరాజ్యం. ఇంకొక ఆరునెలలు. నీ ట్రైనింగు పూర్తయి, నీకు ఉద్యోగం దొరికితే మనం ఆ వూరు వెళ్లిపోదాం. అప్పుడు మనకు ఏ సమస్యలూ వుండవు. ఇప్పుడు చదువులు ఆగిపోతే ఇద్దరమూ ఎందుకూ పనికిరాకుండా పోతాం. ప్లీజ్... వినవూ?''

స్వరాజ్యం అసంతృప్తిగానే తలవూపింది. సౌమిత్రి మంగళసూత్రాలు జేబులో వేసుకుని నిట్టూర్చాడు.

లీల స్నేహితురాలిలోని మార్పుని పసికట్టలేకపోయింది. అన్నగారిని ఇక్కడ చూసి మాత్రం ఆశ్చర్యపోయింది. ''నువ్వెప్పుడొచ్చావు అన్నయ్యా! ఇంకా మామయ్యగారి వూర్లో వున్నావనుకుంటున్నాం మేమంతా?'' అంది.

''అక్కడే వున్నాను ఇన్నాళ్లూ. నిన్ననే వచ్చానిక్కడికి'' అని తొణుకు, బెణుకూ లేకుండా సమాధానమిచ్చాడు సౌమిత్రి.

ఎందుకో అతన్ని చూసి మొదటిసారిగా భయపడింది స్వరాజ్యం.

ముసలమ్మ అనుభవజ్ఞురాలు కనుక కొంత గ్రహించింది. కొంత వూహించింది. 'పెద్దవాళ్ళ వ్యవహారం తనకెందుకు' అనుకుంది. ''నీకు మాత్రం ఒళ్ళొచ్చింది. అమ్మాయ్! కొంచెం రంగూ వచ్చావు'' అంది స్వరాజ్యాన్నే




పట్టి పట్టి చూస్తూ. స్వరాజ్యం తత్తరపడి తల వంచుకుంది.

లీలకి స్వరాజ్యంలా చదువు జీవితంకాదు. కాలక్షేపం మాత్రమే. అందులో ప్రయాణంచేసి వచ్చిందేమో, చాలా త్వరగా నిద్రపోయింది. సౌమిత్రి చెల్లెలు మెలకువగా వున్నంతసేపూ పుస్తకాలు ముందువేసుకుని చదువు నటించాడు. ఆ పిల్ల నిద్రపోగానే వచ్చి స్వరాజ్యం పక్కన చేరాడు.

''బాబోయ్! పక్కగదిలో లీల వుంది'' అంది స్వరాజ్యం కంగారుపడి.

''ఏడ్చింది. చిన్నప్పటినుండీ చూస్తున్నా. ఒకసారి నిద్రకు పడిందా ఆదమరిచిన గొడ్డే అది. తెల్లారిందాక లేవదు'' అన్నాడు సౌమిత్రి స్వరాజ్యాన్ని కౌగిలించుకుంటూ.

''వంటింట్లో ముసలమ్మ...''

''నల్లమందు వేసుకుపడుకుంటుంది. దానికి మెలకువ ఎన్నడొస్తుందీ?''

''స్వరాజ్యం అతన్ని దూరం నెట్టడానికి ప్రయత్నించి విఫలురాలయింది. అతనీసారి సున్నితమయిన పద్ధతులేవీ అవలంబించదలచుకోలేదు. శారీరక అవసరం అతన్ని నిలవనివ్వకుండా చేస్తున్నది. భయం భయంగా, గది తలుపులవంక చూస్తూ, శబ్దాలు కాకుండా జాగ్రత్తపడుతూ స్వరాజ్యం అతనికి లొంగిపోయింది. కోరిక తీరాక, అతను ఒక్కక్షణం కూడా ఆ గదిలో వుండదలుచుకోలేదు. స్వరాజ్యం అతని చెయ్యిపట్టుకుని ఆపింది. అతని ఒడిలో సేదదీరాలని, ధైర్యం పొందాలని వుందామెకు. ఆమె మనసు తోడు కోరుకుంటున్నది. అతను చటుక్కున లేచినిలబడి,

''వాళ్ళు లేస్తారేమో'' అని సన్నగా గొణిగి వెళ్ళిపోయాడు. స్వరాజ్యం కంటనీరు తిరిగింది. తుడిచే చెయ్యి మాత్రం లేదు.

★ ★ ★

సౌమిత్రి ముసలమ్మను ఎలా 'మానేజ్' చేశాడో స్వరాజ్యానికి తెలియదు. మధ్యాహ్నాలు లీల కాలేజీలో వుండే సమయంలో అతను ట్రైనింగ్ స్కూలుకు వచ్చేవాడు. స్వరాజ్యాన్ని ఇంటికి రమ్మనేవాడు. ఆమెకు మొదట్లో సిగ్గుగానూ, బిడియంగానూ వుండేది. మిగిలినవాళ్ళు ఏమనుకుంటారో అని భయపడేది. కానీ, ఆమెకు సౌమిత్రిని ఎదిరించి అతనికి కోపం తెప్పించగల ధైర్యం లేదు. తనకి ఇష్టమయినా, కాకపోయినా అతను తన భర్త అతన్ని అనుసరించటం తన కర్తవ్యం అనుకునేది. తోటి సహాధ్యాయులు గుసగుసలాడుకునేవారు.

ఒకసారి మేరీ అడగనే అడిగింది.

''ఎవరతను? తరచు ఎందుకు నీ కోసం వస్తాడు?''

స్వరాజ్యం సమాధానం చెప్పకుండా దాటెయ్యాలని చూసింది. మేరీ రెక్కించి అడిగాక 'కజిన్' అని గొణిగింది.

నాకు సౌమిత్రిని విమర్శించే హక్కు లేదు. అతనే కాదు పెళ్లి విషయంలో నేను కూడా అబద్ధం చెప్తున్నాను. మేరీతో అతను నా భర్త అని ఎందుకు చెప్పలేకపోయాను. అని తనను తాను విమర్శించుకుంది.

స్వరాజ్యం సమాధానానికి మేరీ వంకరగా నవ్వింది. ముసలమ్మ వేషధారణలో, తల వంచుకుని స్కూలుకు వచ్చి, బుద్ధిగా పాఠాలు వినే ఈ అమ్మాయి తాను భావించినట్టు అమాయకురాలుకాదని తెలుసుకునివుండాలి. తర్వాతెప్పుడూ తన ప్రశ్నలతో ఆమెను విసిగించలేదు.

ముసలమ్మ పగటిపూటే నిద్ర నటించేది. సౌమిత్రి కంగారుగా తలుపులు వేసేసి, తమకంతో స్వరాజ్యాన్ని మీదకు లాక్కునేవాడు. అతని ప్రతి చేష్టనూ 'భర్త' అనుకుంటూ భరించగలిగిన స్వరాజ్యం ఈ దొంగచాటు శృంగారాన్ని భరించలేకపోయేది. మనసులో తప్పు చేస్తోన్న భావన కలిగేది. సౌమిత్రికి ఈ వ్యవహారం బాగానే లాభించివుండాలి. స్వరాజ్యం మాత్రం ఏమీ ఆనందించలేకపోయేది.

అతను తన భర్త కనుకనూ, అతన్ని ఎదిరించగల శక్తిని తనకు తానుగా కోల్పోయింది కనుకనూ, ఇప్పుడతనికి కోపం వస్తే ఎక్కువ నష్టపోయేది తానే కనుక ఆమె ఈ దొంగకాపురాన్ని పళ్ళబిగువున సహించడం నేర్చుకుంది.

సౌమిత్రి అవసరం తీర్చుకుని వెళ్ళిపోయినా, స్వరాజ్యం మాత్రం నిస్త్రాణగా మంచంమీద పడివుండేది. ఆశకు, నిరాశకు

మధ్య మనసు వూగిసలాడేది. ఇల్లు వదలిపెట్టి నప్పటి ధైర్యం, మేనమామను ఎదిరించి నిలిచిన మొండితనం ఇప్పుడామెలో లేవు. ఆమె మానసికంగా పూర్తిగా సౌమిత్రిమీద ఆధారపడడం మొదలుపెట్టింది. అప్పుడప్పుడూ ఆమెకు తల్లి మాటలు గుర్తుకువచ్చేవి.

''మా అమ్మ బుచ్చిరెడ్డిపాలెం జమీందారుని తప్ప మరో మగవాడిని ఎరగదనుకో. గొప్ప పతివ్రత'' అనేది రత్తమ్మ. స్వరాజ్యానికి అప్పట్లో ఆ మాటలు చాలా నవ్వు తెప్పించేవి. 'సానికి పాతివ్రత్యం ఏమిటి, అమ్మ పిచ్చిగానీ!' అనుకునేది. ఇప్పుడామాటలు గుర్తుకొచ్చి 'నేను అమ్మమ్మలా అయిపోనుకదా' అని వణికిపోయేది.

ముసలమ్మ స్వరాజ్యం స్వభావాన్ని కనిపెట్టి ఆమెను 'ఎమోషనల్‌గా బ్లాక్‌మెయిల్' చేసేది.

''స్వరాజ్యం ఏమిటో ఈమధ్య నీరసంగా వుంటోంది''

''అమ్మాయికి పనిబాగా ఎక్కువైనట్టుంది''

''లీలమ్మా! నీ స్నేహితురాలు మధ్యాహ్నమే బడినుండి వచ్చేసింది. తలనెప్పి కామోలు. కొంచెం చూడు''

''తర్వాత అన్నయ్యగారొచ్చారు. అప్పటికి తలనెప్పి లేదేమో!''

''కడుపుతో వున్న మనిషిలా ముఖం పచ్చబడిందే అమ్మాయీ''

ఈవిధంగా మాట్లాడి స్వరాజ్యాన్ని భయపెట్టేది. లీలకు ఈ సంగతులేవీ తెలీవు.

''ముసిలిదానికి ఛాదస్తం వచ్చేసింది పూర్తిగా. ఒక్క మాటకీ తలా తోకా వుండదు'' అని విసుక్కునేది.

స్వరాజ్యం బితుకుబితుకుమంటూ స్నేహితురాలినీ, ముసలమ్మనూ మార్చి మార్చి చూస్తుండేది. పాలిపోయిన ఆమె ముఖంచూసి ముసలమ్మ పైశాచికానందంతో నవ్వుకునేది. స్వరాజ్యం ధైర్యంచేసి ఒకరోజు ముసలమ్మ గురించి సౌమిత్రికి చెప్తే అతను దాన్ని అదుపులో పెట్టివుండేవాడు. స్వరాజ్యానికి ఆ తెలివీ లేదు. సమర్ధతా లేదు. సౌమిత్రిని భరించినట్టే, ముసలిదాన్నీ భరించేది. భయంతో, ఆదుర్దాతో కాలం గడపడం ఆమెకు అలవాటయిపోయింది. 'ఇంకెంత నా ట్రైనింగ్ అయిపోతే ఏదో ఒక వూరిలో ఉద్యోగం వస్తుంది. వేరు కాపురం పెట్టేస్తాం' అని తనకు తాను ధైర్యం చెప్పుకునేది. తనను‌తాను ఓదార్చుకునేది.

తమ పెళ్ళి గురించి నాయుడుగారూ తల్లీ యాగీ చేస్తారని భయంగా వుండేది మనసులో. అవన్నీ సౌమిత్రి చూసుకుంటాడులే అని సర్ది చెప్పుకునేది.

★ ★ ★

స్వరాజ్యం పరీక్షలకు చాలా కష్టపడి చదివింది. లీలా, సౌమిత్రి పరీక్షలను సీరియస్‌గా తీసుకోలేదు. ముందు వాళ్ళిద్దరి పరీక్షలు పూర్తయ్యాయి. ఆ రాత్రి సౌమిత్రి స్వరాజ్యాన్ని నిద్రపోనివ్వలేదు.

స్వరాజ్యం బయటకు ఏమీ అనలేదు. కానీ, మనసులో చాలా బాధపడింది. ఆమెకు వారంరోజుల్లో పరీక్షలున్నాయి. చదువుకోవాలని వుంది. పరీక్షలు తప్పితే ఇన్నాళ్ళ శ్రమా వృధాఅవుతుంది.సౌమిత్రి విన్పించుకునే పరిస్థితిలో లేడు. తెల్లవారుజామున నాలుగు గంటలకు ఆమెను వదిలాడు. ఆమెకు ఒళ్ళంతా పచ్చి పుండులావుంది. కళ్ళు మంటలు పెడుతున్నాయి.

ఉదయం లేస్తూనే లీల సామాన్లు సర్దడం మొదలుపెట్టింది. ముసలమ్మ పప్పులూ, ఉప్పులూ వగైరా అలమారలో పెట్టి తాళం వేస్తోంటే ఆవిణ్ణి మందలించింది.

''స్వరాజ్యానికి ఇంకా పరీక్షలు మొదలవలేదు. నెలాఖరువరకు ఇక్కడే వుంటుంది. అన్ని సరుకులు బయట వదిలెయ్యి. అది వచ్చేటప్పుడు ఏకంగా ఇల్లు తాళం వేసుకుని తీసుకు వస్తుందిలే'' ముసలమ్మ పదిసార్లు రొక్కించి రొక్కించి స్వరాజ్యాన్ని అడిగింది. ''నువ్వొక్కదానివేగా అమ్మాయ్! బియ్యం సరిపోతాయా? కందిపప్పు సరిపోదేమో! ఒక్కదానివేగా. సరిపోతుందంటావా?'' అంటూ ప్రశ్నలతో వేధించింది.

సాయంత్రానికి సౌమిత్రి తిరిగి పట్నం వచ్చే




స్తాడని ఆవిడ ఊహ. స్వరాజ్యం వూహ కూడా అదే.

సౌమిత్రి స్నేహితులందరికీ చెప్పిరావటాని కి వెళ్ళాడు. పదకొండుగంటలకు వస్తూనే తన వెంట బండి తీసుకువచ్చాడు. ముసలమ్మ, లీలా చుట్టుపక్కల లేని సమయంలో స్వరాజ్యాన్ని దగ్గరకు తీసుకుని రెండువందల రూపాయలిచ్చాడు. అంత పెద్దమొత్తం చూసి స్వరాజ్యం కంగారుపడింది. ప్రశ్నార్థకంగా అతని ముఖంలోకి చూసింది. ''ఉంచు స్వరాజ్యం! నేను రావటానికి నాలుగయిదురోజులు పడుతుంది. మరీ వెంటనే వచ్చేస్తే ఇంట్లో అనుమానపడతారు. ఏమయినా అవసరం రావచ్చు'' అన్నాడు సౌమిత్రి.

స్వరాజ్యానికి రాత్రి ఒళ్ళునొప్పులు ఇంకా తగ్గలేదు. చదవాల్సిన కోర్సుని ఒక్కసారి కూడా 'రివిజన్' చేసుకోలేదు. అందుకని నాలుగయిదురోజులు రాడు అని విని 'అమ్మయ్య' అని మనసులో నిట్టూర్చింది.

లీల ''జాగ్రత్త స్వరాజ్యం! ఒక్కదానివే వున్నావు. పరీక్షలు కాగానే ఇంటికొచ్చేస్తావుగా. రాగానే కబురు చెయ్యి. గుడి దగ్గర కలుస్తాను'' అని వీడ్కోలు చెప్పింది

ముసిల్ది ఎప్పటిలాగానే వంకరగా ''ఎవరో ఒకరు తోడు పడుకుంటారులే'' అంటూ బండెక్కింది.

'పిచ్చివాగుడు' అన్నట్లుగానే లీల ముఖం చిట్లించింది. సౌమిత్రి బుద్ధిమంతుడిలా,

''వెళ్ళొస్తాను స్వరాజ్యం! పరీక్షలు బాగా రాయి. బెస్టాఫ్ లక్'' అన్నాడు. బండి కదిలింది. స్వరాజ్యం సాయంత్రంవరకూ వంటి మీద స్పృహ లేకుండా నిద్రపోయింది. ఆరు దాటాక, ఆకలివేసి మెలకువ వచ్చింది. ఉదయం అందరూ తినగా మిగిలింది కొంచెం అన్నం ఉంటే వూరగాయ వేసుకుని తిన్నది. శరీరానికి కొంచెం శక్తివచ్చింది. సౌమిత్రి నాలుగయిదురోజులవరకూ రానని చెప్పినప్పటికీ స్వరాజ్యానికి అతని మాటమీద నమ్మకంలేదు. రాత్రి అవుతోంటే అయిష్టంగానే అతను వస్తాడని ఎదురుచూసింది. ఆమె లేకుండా అతను నిద్రపోలేడని ఆమె అనుభవం చెప్పింది. అతను రావాలనీ వుంది. రాకూడదనీ వుంది. చదువుమీద దృష్టి నిలవలేదు. 'రేపటినుండి జాగ్రత్తగా చదువుకోవాలి' అనుకుంది అర్ధరాత్రెప్పుడో నిద్రకు ఒరుగుతూ.

★ ★ ★

మరుసటి రోజునుండి స్వరాజ్యం దృష్టి నంతటినీ చదువుమీదనే కేంద్రీకరించింది. ఇంటి దగ్గర పనుల ఒత్తిడిలో సౌమిత్రికి ఇక్కడకు రావటానికి వీలుచిక్కి వుండదు- అని తనకుతానే నచ్చచెప్పుకుంది. అయినా, మాయదారి మనసు కీడును శంకిస్తూనే వుండేది. తనకుతాను ధైర్యం చెప్పుకుంటూ, ఓదార్చుకుంటూ, పిచ్చి భయాలలో బెంగటిల్లే మనసును కూడతీసుకుంటూ జాగ్రత్తగా చదవటానికి ప్రయత్నించేది. ఆమె భయాందోళనల మధ్య వూగిసలాడుతుండగానే పరీక్షలు వచ్చేశాయి.

ఇప్పుడిక ఆలోచనతో స్వరాజ్యం కాలాన్ని వృధాచేయదలచలేదు. 'సౌమిత్రి వచ్చినా, రాకున్నా నా జీవితంలో ఈ అవకాశం మరింక రాదు' అనుకుని గుండె రాయిచేసుకుని రాత్రింబగళ్లు చదివి పరీక్షలు రాసింది.

సౌమిత్రి వాళ్ళ వూరు వెళ్ళిన పదిహేను రోజులకు స్వరాజ్యం పరీక్షలు పూర్తయ్యాయి. తన కర్తవ్యం ఏమిటో స్వరాజ్యానికి తెలియలేదు.

కాలేజీలకు వేసవి శలవులిచ్చేశారు. రెండు నెలల తర్వాతగానీ కాలేజీలు తెరవరు. యిప్పటివరకు సౌమిత్రి రాలేదంటే కాలేజీలు తెరిచే వరకు రాడనే అనుకోవాలా. అందుకే తనకు అంత డబ్బు యిచ్చాడా? ఏమయినా పనిత గిలి ఆగిపోతే తనకో ఉత్తరంముక్క రాయొచ్చునే. లేక ఊరు వెళ్ళేముందే సౌమిత్రి శలవుల్లో రాకూడదని నిర్ణయించుకున్నాడా? తనీ డబ్బుతో ఈ రెండు నెలలు యిక్కడ కాలక్షేపం చేస్తే కాలేజీలు తెరిచాక, అన్నా చెల్లెళ్ళిద్దరూ ముసలమ్మను తీసుకుని వస్తారా? తనుకూడా వూరు వెళితేనే మంచిదేమో! లేక సౌమిత్రికోసం పట్నంలోనే ఎదురుచూడాలా? స్వరాజ్యం ఎటూ తేల్చుకోలేకపోయింది. వంట చేసుకోవాలన్పించేది కాదు. నిరాసక్తంగా ఏదో యింత వుడకేసుకున్నా తినాలన్పించేదికాదు.

ఏదో తెలియని భయమూ, దిగులూ ఆమెను కృంగదీయటం మొదలుపెట్టాయి.

స్వరాజ్యం ఈ అయోమయపు పరిస్థితిలో ఎక్కువరోజులు లేకుండానే ఒకరోజు వూరి నుండి బండి తోలుకుని నాయుడిగారి పెదపాలేరు ఓబులయ్య వచ్చాడు.

వస్తూనే సంభాషణ మొదలుపెడుతూ, ''అల్లుడుగారు సీమనుంచి వచ్చేసారంట స్వరాజ్యమా? అమ్మాయిగార్ని కాపరానికి పంపేస్తావున్నారు'' అన్నాడు.

''ఎవరూ? లీల భర్తా?'' అనడిగింది స్వరాజ్యం.

''అవును... ఇల్లంతా ఒకటే సందడిగా వుందనుకో. పసుపు దంచడాలు, సున్నాలు వెయ్యడాలు, పిండివంటలూ...''

సౌమిత్రి గురించి ఏమని అడగాలో తెలియ లేదు స్వరాజ్యానికి. ఎలాగో మాటలు కూడబలుక్కుని ''అబ్బాయిగారు...''

''ఆఁ అదే చెప్తావుండా. ఆయనకీ పెళ్ళి కుదిరిపోయింది. వాళ్ళ మామయ్యగారి అమ్మాయినే యిస్తావుండార్లే. పెద్దోళ్ళు ఆస్తులు బయటకు పోనిస్తారూ? వాళ్ళల్లో వాళ్ళే ముళ్ళు పెట్టేసుకుంటారు. లేకపోతే, ఆ పిల్ల ఏం బావుంటుంది సెప్పు. మనూరు నాలుగయిదు సార్లు వచ్చిందిలే. నువ్వు చూశావో, లేదో అబ్బే! ఈయనకి ఆయమ్మేం కొత్తగాదులే. సక్కబెడతానే వుండేవాడు''

స్వరాజ్యానికి ఓబులయ్య మాటలు వినపడటం మానేశాయి. విన్నది అర్ధమూ కాలేదు. అతను గబగబా సామాన్లన్నీ కట్టి బండిమీదకు చేరవేస్తున్నాడు. ఆమె అలాగే శిలాప్రతిమలా నిలబడి అతన్ని గమనిస్తూ వుంది.

ఏమంటున్నాడు ఓబులయ్య? సౌమిత్రికి పెళ్ళి కుదిరిపోయిందా? అతని మేనమామ కూతురితోనా? ఆమె అతనికి కొత్తకాదా? ఈ విషయాలన్నీ తనకేనా కొత్తగా వున్నాయి?

ఓబులయ్య సామానంతా బండిమీదకు చేర్చి ''పోతా స్వరాజ్యమా! నువ్వూరికి రావా ఏంది? నాయుడుగారు పెళ్ళికి నీ మేళం పెట్టించమని మీ అమ్మకి పదిబస్తాలు ఒడ్లు కూడా తోలినాడు. నువ్వు పట్నంలో సదూకున్నావు. పల్లెటూరి ఆట చూసి చూసి విసుగెత్తిపోయింది. త్వరగా రామరి...'' అని చెప్పి బండెక్కాడు. రెండు క్షణాల తర్వాత బండి దిగి దగ్గరకు వచ్చి,

''ఇల్లు ఖాళీ చేసేసినామని యింటిగలాయనకు చెప్పెయ్యమన్నారు. బయానా నెలాఖరుదాకా వుందట. నువ్వు కావాలంటే అప్పటిదాకా వుండొచ్చని చెప్పింది లీలమ్మ. నే పోతా'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఓబులయ్య వెళ్ళిపోయిన రెండు గంటల దాకా అలాగే కూర్చుండిపోయింది స్వరాజ్యం. యిల్లంతా ఖాళీ అయిపోయింది. స్వరాజ్యం వూరునుండి తెచ్చుకున్న పెట్టె, సౌమిత్రి వాళ్ళు దయతలచి యిచ్చిన బొంతవంటి పడకచుట్ట, రెండుమూడు వంటపాత్రలు తప్ప మిగిలినవన్నీ - మంచాలు, కంచాలతో సహా ఓబులయ్య తీసుకెళ్ళిపోయాడు.

స్వరాజ్యానికి భయంవేసింది. ఇప్పుడేంచేయాలో తోచలేదు. సౌమిత్రి నా భర్త! అని పెద్దగా అరవాలన్పించింది. నేను చదువుకున్నాను. ఈ అన్యాయాన్ని సహించను అనుకుంది స్వరాజ్యం. అనుకోవటమయితే అనుకుందికానీ సహించక ఏం చెయ్యగలదో, ఏం చెయ్యాలో తెలీలేదు. ఆ రాత్రంతా ఉలికిపడుతూ, లేచి కూర్చుంటూ తిరిగి పడుకుంటూ గడిపింది. ఏడుపు రాలేదు. గుండె బరువెక్కింది. ఆలోచనలతో బుర్ర వేడెక్కింది.

ఉదయం పదిగంటలకు కళ్ళు విప్పిన స్వరాజ్యానికి ఎవరో తలుపు తడుతోంటే మెలకువ వచ్చింది. ఒక్కక్షణం ఆ తలుపు తట్టేది సౌమిత్రే అన్పించింది. ఆ క్షణంలో స్వరాజ్యం తన అనుమానాన్ని తలుచుకుని పశ్చాత్తాపపడింది. ఓబులయ్య సౌమిత్రితో తాను ఒంటరిగా వున్నట్టు చెప్పి వుంటాడు. ముందు తన పరీక్షలు పూర్తయ్యేవరకు తన ఏకాగ్రతను భంగం చేయకూడదని వచ్చివుండడు. తర్వాత తను శలవులకు వూరు వెళ్ళిపోయి వుంటుందనుకుని వుంటాడు. యిపుడు ఓబులయ్య చెపితే తెల్సుకుని వచ్చివుంటాడు.

తనని తాను శపించుకుంటూ తలుపు తీసిన స్వరాజ్యానికి, గడప అవతల




కన్పించిన వ్యక్తి ఎప్పుడో, ఎక్కడో చూసిన మనిషనీ, సౌమిత్రికాదని తెలిసి నిరుత్సాహం కలిగింది.

అతనే చొరవగా లోపలకు వచ్చి జేబులన్నీ తడుముకుని ఒక పెళ్ళిపత్రిక తీశాడు. అప్పటికి స్వరాజ్యం తెప్పరిల్లి,

''కూర్చోండి'' అన్నది. అన్నదేగానీ, ఆ యింట్లో కూర్చోవటానికి ఏమీలేదు ఆమె పడుకున్న బొంత తప్ప. అతను దాన్నే సరిచేసుకుని ఒక మూలగా కూర్చున్నాడు. కూర్చున్నవెంటనే ఆ పెళ్ళిపత్రిక అందిస్తూ.

''ఇదేమిటండీ?'' అనడిగాడు.

అదేమిటో స్వరాజ్యానికి తెలియదు. దానిని యిప్పుడే మొదటిసారి చూస్తున్నది. అందుకని దానిలోకి చూసింది. అది పెళ్ళి శుభలేఖ. దానిలో సౌమిత్రికీ, సుభద్ర అనే అమ్మాయికి పెళ్ళి అని రాసివుంది తేదీతోసహా.

స్వరాజ్యం ముఖంలోకి చూస్తున్న మనిషి గమనించాడు ఆమె పాలిపోతున్న ముఖాన్నీ కళ్ళల్లో నిండుతున్న నీటినీ, సన్నగా వణుకుతున్న చేతుల్నీ.

''మీ పేరు స్వరాజ్యంకదూ!''

శుభలేఖలో అచ్చు అయివున్న పేరు ఆమెది కాదు అని నిర్ధారించుకునేందుకే అతను ఆ ప్రశ్న అడిగాడని తెలియని స్వరాజ్యం అమాయకంగా,

''మీరెవరో నాకు తెలియదండీ!'' అని సమాధానమిచ్చింది.

''అయ్యో! నేను మీ పెళ్ళి పెద్దనండీ. మీ రిజిస్టర్ పెళ్ళికి సంతకం పెట్టిన సాక్షుల్లో నేను ఒకడిని. నా పేరు మోహనరావు''

అప్పటికి స్వరాజ్యానికి గుర్తు వచ్చింది. అతన్నిఎక్కడో చూసినట్టు ఎందుకన్పించిందో కూడా తెల్సింది.

''మీరు కళావంతుల అమ్మాయనీ... మిమ్మల్ని ప్రేమిస్తున్నానని, పెద్దల్ని ఎదిరించి పెళ్ళి చేసుకుంటున్నానని సౌమిత్రి చెపితే, ఒక మంచిపనికి దోహదం చేస్తున్నాననుకుని ఆరోజు వచ్చి సంతకం పెట్టాను. నేను శలవులకు మా వూరు వెళ్ళిపోయాను. నిన్న ఏవో అవసరమయిన పుస్తకాలున్నాయని, తీసుకోవాలని గదికి వస్తే యిది... ఈ పెళ్ళి శుభలేఖ ఎప్పుడు వచ్చిందో గదిలో పడివుంది...''

స్వరాజ్యం మంచుతెర కరిగినట్టు భోరుమంది. గుండెలు అవిసేలా, యిన్నిరోజుల భారం తీరేలా వెక్కివెక్కి ఏడ్చింది. అతను నిస్సహాయంగా ఆమెను చూస్తూ కూర్చున్నాడు. చాలాసేపటికి అతనే ముందు మాట్లాడాడు.

''స్వరాజ్యంగారూ! మీది మామూలు పెళ్ళి కాదు''

స్వరాజ్యం తప్పుచేసినట్టు తల వంచుకుంది.

''మీరు తెలివిగలపని చేశారు. యిదే ఏ గుడిలోనో జరిగిన పెళ్ళయితే సౌమిత్రి తప్పించుకుని వుండేవాడు. ఇంత దుర్మార్గుడూ, మూర్ఖుడిలా ప్రవర్తించాడు. మీ పెళ్ళిని రిజిస్టర్ చేయించారు. మీ అనుమతి లేకుండా... ఆ మాటకు వస్తే మీ అనుమతితో కూడా అతను రెండవ పెళ్ళి చేసుకోలేడు. నేను ఆ సాక్ష్యాలన్నీ పట్టుకువస్తాను. మనం ఈ పెళ్ళిని ఆపుదాం'' అంటూనే లేచి అతను బయటకు హడావుడిగా వెళ్ళిపోయాడు.

మెడలో మంగళసూత్రం కూడా లేదే అని కించపడుతోన్న స్వరాజ్యానికి మోహనరావు మాటలు చాలా వూరట కలిగించాయి. అతను ఈ కాగితాల పెళ్ళే సాంప్రదాయ వివాహంకంటె బలమయినది అంటున్నాడు. తనీ రెండవ పెళ్ళిని ఆపగలనంటున్నాడు. సముద్రంలో కొట్టుకుపోతున్న తనకు గడ్డిపోచ, కాదు కాదు పెద్ద ఓడ సహాయానికి వచ్చినట్టు తోచింది స్వరాజ్యానికి. లేచి ముఖం కడుక్కుని, జడ వేసుకుంది. కొంచెం పాలు తెచ్చుకుని వేడిచేసుకుని తాగింది. మళ్ళీ మోహనరావు వస్తే యివ్వవచ్చునని కొన్ని వుంచింది. సాయంత్రం కావొచ్చింది. కానీ మోహనరావు జాడలేదు. ఉదయం విచ్చుకున్న కలువలాంటి స్వరాజ్యం ఆశ సాయంత్రానికి సూర్యాస్తమయం తర్వాత కలువలా ముడుచుకుపోయింది. ఎవరు ఈ మోహనరావు. ఇతనుమాత్రం మగవాడు కాదూ! యితను ఏవిధంగా సహాయం చేస్తాడని తాను భ్రమపడుతున్నది?

అతను ఎంతయినా సౌమిత్రి స్నేహితుడు. భిన్నంగా ఎలా వుంటాడు? ఉన్నా స్నేహితునికి వ్యతిరేకంగా తన సహాయానికి వస్తాడా? వచ్చినా, తిరిగి తాను సౌమిత్రితో కాపురం చేయగలగటం జరిగేపనేనా? ఈ చట్టాన్ని తన వూరిలో ఎవరయినా గౌరవిస్తారా? ప్రేమించానని నమ్మబలికి, తాళికట్టిన సౌమిత్రే కట్టిన తాళిని, పెట్టిన సంతకాన్ని కాలదన్ని వెళ్ళిపోయాడు. మోహనరావు సహాయంతో ఆ కాగితాలను తీసుకుని, తన ఊరి ప్రజలముందుకు వెళ్ళి తన హక్కుకోసం పోరాడగల ధైర్యం తనలో వుందా? లేదు. లేదుగాక లేదు. ఒకవేళ తనకు ధైర్యం వున్నా దానికి ఫలితం ఏమీ వుండదు. నాయుడు ఆ కాగితాన్ని క్షణంలో చింపి తన తాట వలిపించి తల్లినీ, తనను ఉన్నపళాన వూరునుండి వెళ్ళగొట్టగలిగేటంత బలశాలి సామాజికంగానూ, ఆర్థికంగానూ కూడా. మరెందుకు తానీ పెళ్ళి వూబిలో యిరుక్కున్నట్టు. ఈ పెళ్ళి తనకేవిధంగా రక్షణ కల్పిస్తుందో స్వరాజ్యానికి అర్థంకాలేదు. అయినా మోహనరావు కూడా రాలేదు. ఇప్పటికి స్వరాజ్యానికి ఒకవిషయం మాత్రం స్పష్టంగా తెలిసింది. సౌమిత్రికి పెళ్ళి కుదిరిన మాట ఖాయం. అది జరిగేది కూడా ఖాయం. అతనికీ, తనకూ రుణం తీరిపోయింది.



స్వరాజ్యం వూహించినట్టు మోహనరావు మనసు మార్చుకుని, ఈ సమస్యనుండి పారిపోలేదు. మూడవరోజు మళ్ళీ వచ్చాడు. స్వరాజ్యం పరీక్షలయితే రాసిందిగానీ ఫలితాలు అప్పుడే తెలియవు. ఊరికి వెళితే తల్లిపోరు తట్టుకునే శక్తి లేదు. ఇక పట్నంలో వుండటం నాలుగయిదు రోజులకంటె కుదరదు. సౌమిత్రీ వాళ్ళు యిచ్చిన బయానా నెలాఖరుకి సరిపోతుంది. నిన్ననే ఎవరో వచ్చి యిల్లు చూసుకుని వెళ్ళారుకూడా. స్వరాజ్యం ఈ సందిగ్ధంలో వుండగా మోహనరావు వచ్చాడు.

"మీరు పూర్తిగా మోసపోయారండీ" అన్నాడు. స్వరాజ్యం నవ్వటానికి ప్రయత్నించి విఫలమయింది. 'నేను మోసపోయానని తెలుసుకోవటానికి ఈ మనిషికి మూడురోజులు పట్టినట్టుంది' అనుకుంది విషాదంగా. స్వరాజ్యం అడగకుండానే మోహనరావు చెప్పుకొచ్చాడు.

"మీ రిజిస్టర్ పెళ్ళి ఉత్త నాటకం. ఆ ఆఫీసరు... వాడి పుస్తకాలు... అంతా బోగస్"

ఇది నిజంగా కొత్త విషయం స్వరాజ్యానికి. నోరు తెరుచుకుని కళ్ళు పెద్దవి చేసుకుని విన్నది. సౌమిత్రి విశ్వరూపం ఆమెకు పూర్తిగా అవగాహన అయింది.

"ఆ రెండవసాక్షి లేడూ... ఆఫీసరుగారినీ, దండల్నీ స్వీట్లనూ పట్టుకొచ్చినవాడు... సుబ్బారావు అతనిపేరు, అతను చెప్పాడు. సౌమిత్రీ, అతనూ మంచి స్నేహితులు. మీరు పెళ్ళి ప్రసక్తి లేకుండా దగ్గరకు రారని వాళ్ళిద్దరూ కలిసి ఈ నాటకం ఆడారట."

ఆమె శిలాసదృశ్యురాలై విన్నది. చిన్ననాటి నుండి సౌమిత్రి తెలుసు. కనీసం, తెలుసుననుకున్నది. తనకు లౌక్యం తెలీదు. తనకు సౌమిత్రేకాదు, ఎవరూ తెలియదు. ఈ లోకంలో ఏ రక్షణాలేని తనకు ఏమీ తెలియదు.

తన బోగస్ పెళ్ళివల్ల తనకు ఒరిగిందేమిటి? సౌమిత్రికి దైవభక్తీ పాపభీతీ వుంటే ఈ పెళ్ళి లేకున్నా తనను విడనాడేవాడు కాదు. అవి లేనివాడిని యిది బోగస్ పెళ్ళికాక నిజమయిన పెళ్ళే అయినా బంధించలేదు. రేపు సుభద్రను సౌమిత్రి వదిలేస్తే ఆమె తరవున నిలబడి సమాజం అతన్ని మందలిస్తుంది. ఆమెకు రక్షణ కల్పిస్తుంది. తనకు సమాజంకాదుకదా కన్న తల్లి కూడా మద్దతునివ్వదు. తాను ఏమాసించి ఈ పెళ్ళి చేసుకుంది? తనకు చివరకు ఏం మిగిలింది?

స్వరాజ్యం పిచ్చిదానిలా, సర్వం కోల్పోయిన

నిరుపేదలా భోరుభోరుమని ఏడ్చింది. మోహనరావుకి విపరీతమయిన జాలి కల్గింది. 'వూరుకోండి' అన్నట్టుగా, ఓదార్పుగా భుజంమీద చేయి వేయబోయాడు. స్వరాజ్యం చురుక్కున అతన్ని చూసింది. ఆ క్షణాన అతనికి అర్థం అయింది, ఇక జన్మలో ఈ అమ్మాయి ఏ మగవాడినీ నమ్మదు. 'హ్యాట్స్ ఆఫ్ సౌమిత్రీ!' అనుకుని లేచి నిలబడ్డాడు.

మోహనరావు లేచి నిలబడటమూ, స్వరాజ్యం మేనమామ గదిలోకి రావటమూ ఒకేసారి జరిగాయి.

"ఏంది స్వరాజ్యం! మీకు శలవులిచ్చి ఎన్నాళ్ళే..." అంటూ వచ్చినవాడల్లా మోహనరావుని చూసి, "ఓహో! నువ్విక్కడ వ్యాపారం మొదలుపెట్టేశావన్నమాట..." అని వాక్యం పూర్తిచేశాడు.

మోహనరావుకి ఈ పల్లెటూరి ఆసామీ ఎవరో, అతని మాటల్లోని భావం ఏమిటో అర్థంకాలేదు. తెల్లబోయి స్వరాజ్యందెస చూశాడు.

"ఏం బాబూ? ఏవూరు మనది? ఏమాత్రం పొలం వుంది? ఎన్నాళ్ళయింది దీన్ని చేరదీసి?" అని ఆరాలడుగుతున్న మేనమామను ఛీత్కారంగా చూసి,

"మీరు చేసిన సహాయానికి కృతజ్ఞతలు మోహనరావుగారూ! మీరిక వెళ్ళిరండి" అని దాదాపు అతన్ని బయటకు నెట్టినంత పని చేసింది స్వరాజ్యం.

మోహనరావు వెళ్ళిపోయాక ఆమె మామయ్యా సరాసరి పాయింటుకు వచ్చేశాడు.

"స్వరాజ్యం! ఈ బాబెంత ముట్టచెప్పాడే?"

ఆమె సమాధానం ఇవ్వలేదు.

"పోన్లే, నాకు చెప్పమాక. దాచుకో. మీ అమ్మ నీకోసం ఎదురుచూస్తావుంది. నాయుడుగారి పిల్లలు ఏనాడనగా వచ్చేశారు. చదువుకని వచ్చినదానివి అది పూర్తవగానే కొంప చేరద్దూ!" మాట్లాడుతూనే అతను దండేనికి వేలాడుతున్న స్వరాజ్యం బట్టలు పెట్టెలో వేసి మూత వేసేశాడు. పక్క చుట్టేసి చిన్న గోనె సంచిలో వంటపాత్రలు వేస్తుంటేమాత్రం స్వరాజ్యం,

"అవి మనవికాదు. నాయుడుగారివి" అంది.

అతను ఓ వంకరనవ్వు నవ్వి గోనె మూతి బిగించేశాడు. తర్వాత బండి తీసుకురావటానికి బయటకు వెళ్ళాడు. ఆ కొద్దిసేపట్లో స్వరాజ్యం అతనిబారినుండి తప్పించుకోవటానికి ఎటైనా పారిపోదామా? అని ఆలోచించింది. కానీ సౌమిత్రి అనుభవంతో తన లోకజ్ఞానం ఎంత గొప్పదో ఆమెకు అర్థమయింది. ఈ ప్రపంచంలో ఎవరూలేని తాను, ఏమీ తెలియని తాను ఎక్కడికి వెళ్ళగలదు? ఎలా తనను తాను రక్షించుకోగలదు? పరీక్షా ఫలితాలు తెలిసి వుద్యోగం వస్తే అదోదారి! ప్రస్తుతానికి ఆ దారీ లేదు. మేనమామను అనుసరించటానికే స్వరాజ్యం నిర్ణయించుకుంది.

దారిలో మేనమామ, "నాయుడిగారి అబ్బాయి పెళ్ళికి నీ మేళం వుందే" అన్నప్పుడు దీనంగా,

"నాకు రాదుకదా మామయ్యా! నన్ను వదిలెయ్యండి" అంది.

"నీ ముఖం. అదేమన్నా భరతనాట్యమేంటే రావటానికి. కోయిలకి పాటా, చేపకి ఈతా, మనకి ఆటా ఎవరు నేర్పుతారే స్వరాజ్యం! అవి పుట్టుకతోనే వస్తాయిగదే" అన్నాడాయన.

★ ★ ★

స్వరాజ్యానికి తిండి సహించేది కాదు. నిద్ర వచ్చేది కాదు. మంచంమీద బాసిపట్టు వేసుక్కూర్చుని చీకట్లోకి చూస్తూ గంటలు గంటలు కాలం గడిపేది. సౌమిత్రి ఏక్షణాన అయినా వస్తాడనీ, సంజాయిషీ యిస్తాడనీ ఏ మూలనో మినుకు మినుకుమనే నమ్మకం. ఏదో అద్భుతం జరిగి అతని పెళ్ళి ఆగిపోతుందనే ఆశ.

కానీ ఏ ఆశా నెరవేరలేదు. ఏ అద్భుతమూ జరగలేదు.

వియ్యంకుడు పెళ్ళి పెద్దతిరుపతిలో చేస్తానని మొక్కుకున్నాడుట. నాయుడిగారి కుటుంబం పెళ్ళికి పెద్ద వూరేగింపుతో తరలి వెళ్ళారు. ఊరేగింపు తమ యింటిముందు నుండి వెళ్తున్నప్పుడుమాత్రం స్వరాజ్యం నిగ్రహించుకోలేక కిటికీ దగ్గరకు వెళ్ళి చూసింది.





ఈ నెలరోజుల్లోనూ సౌమిత్రి ఒళ్ళు చేశాడు. పెళ్ళికొడుకు అలంకరణలో వెలిగిపోతున్నాడు. తన శీలాన్ని అపహరించటానికి ఎవరో అపరిచితుడు, పెద్దమీసాలలో, గళ్ళ లుంగీతో ఎక్కడినుండో వూడిపడతాడనుకునేది స్వరాజ్యం. యిలా చిన్ననాటి స్నేహితుడు వెన్నుపోటు పొడుస్తాడని వూహించలేదు. ఎవరు, ఏవిధంగా మోసం చేస్తారో అని వూహతెల్సిననాటి నుండీ తనను తాను రక్షించుకుంటూ వచ్చింది. తానే మోసపోయి తన శీలాన్ని, యవ్వనాన్ని పళ్ళెంలో పెట్టి అందిస్తానని వూహించలేదు. స్వరాజ్యం విరక్తిగా నవ్వుకుంది.

ఆనరికి పరీక్షాఫలితాలు వచ్చేవుంటాయనే ధ్యాసే లేకపోయింది స్వరాజ్యానికి. ఉద్యోగానికి ప్రయత్నించాలనే వుత్సాహమూ కలగలేదామెకి.

★ ★ ★

''మీరెవరు? ఈ గదిలో మీకేం పని?'' కఠినంగా అంది స్వరాజ్యం తన గదిలో తన మంచంమీద కూర్చుని పరపరా కిళ్ళీ నములుతోన్న మధ్యవయస్కుణ్ణి చూసి.

''మీ అమ్మకి డబ్బిచ్చా!'' అన్నాడతను తుపుక్కున గదిలో ఓ మూలకి వుమ్మతూ.

''గెటవుట్!''

''అంటే ఏంటి? పడుకోనంటావా?'' అనడిగాడతను తాపీగా. తనమీద, తన జన్మమీద పట్టరాని అసహ్యం వేసింది స్వరాజ్యానికి.

''అమ్మా! అమ్మా! అమ్మా'' అంటూ హిస్టీరిక్‌గా అరిచింది. తల్లి వచ్చి ఏం చెప్పిందో ఆ నడివయస్కుడిని గది బయటకు తీసుకువెళ్ళింది.

స్వరాజ్యం నిస్త్రాణగా మంచంమీద పడిపోయింది. కొంతసేపటికి రత్తమ్మ తిరిగి వచ్చి కూతురిమంచంమీద కూర్చుంది.

''సొరాజ్జెం! నిద్రపోతావుండావా?'' అనడిగింది. స్వరాజ్యం మెలకువగానే వుంది. కళ్ళు విప్పలేదు. తల్లికి సమాధానమూ యివ్వలేదు.

''నేను తెలియనట్టు వున్నానని నాకేం తెలియదనుకోబాకు. అన్నీ తెలుసు. నువ్వు సంవత్సరంపాటు నాయుడిగారబ్బాయి యిలాకాలో వున్నావని వూరంతటికీ తెలుసు. ముసలమ్మ వూరందరికీ చెప్పింది. అందుకే, ఆ కుర్రాడికి తొందరపడి మనువుచేసేశారు. ఆ నాలుగు అక్షరమ్ముక్కలు చెప్పించటం తప్ప నీకేమైనా యిచ్చాడా? నీ పెట్టె చూశా. ఒక్క కొత్తచీరె కూడా కొనిపించుకోలేకపోతివి. ఎట్టా బతుకుతావే నువ్వు? బతుకుతెరువు నేర్చుకో'

స్వరాజ్యం కళ్ళయితే తెరవలేదుగానీ కంటినిండా నీరుమాత్రం తిరిగింది.

ఉంచుకోలేదు. సౌమిత్రి నన్ను పెళ్ళిచేసుకున్నాడు అని చెప్పాలనుకుంది. అంతకంటే పెద్ద జోకు మరొకటి వుండదనిపించి నోరు మూసుకుంది.

రత్తమ్మ జ్ఞానబోధ చేసి బయటకు వెళ్ళిపోయింది. తమ్ముడితో మంతనాలు మొదలుపెట్టింది. అక్కా, తమ్ముడు అర్ధరాత్రివరకు మల్లగుల్లాలు పడుతూనేవున్నారు.

గదిలో అలికిడికి స్వరాజ్యానికి మెలకువ వచ్చింది. గదంతా చీకటిగా వుంది. కోడిగుడ్డు దీపం ఎప్పుడు ఆరిపోయిందో తెలియదు. సమయం ఎంతయిందో తెలియటంలేదు. గదిలో మరో మనిషి అలికిడిమాత్రం తెలుస్తోంది.

''ఎవరూ? ఎవరూ?'' అనరిచింది స్వరాజ్యం. సమాధానంగా ఆ వ్యక్తి స్వరాజ్యం మంచంవద్దకు వచ్చాడు. స్వరాజ్యం భయంతో గడ్డకట్టుకుపోయింది.

''అమ్మా! అమ్మా'' అని అరవటం మొదలుపెట్టింది. ఆ వ్యక్తి స్వరాజ్యం నోరు చేత్తో మూసి ఆమె చీరె గుంజటం మొదలుపెట్టాడు. యిందాకటి మనిషేనా? యింకా వెళ్ళలేదా? అమ్మ ఏమయింది? మేనమామ ఏడీ? స్వరాజ్యం తనలో తాను ప్రశ్నించుకుంటూనేవుంది. అవతలి వ్యక్తి పశువులాగ స్వరాజ్యాన్ని ఆక్రమించుకుని అనుభవిస్తున్నాడు. పోరాడి పోరాడి అలిసిపోయింది స్వరాజ్యం. ఆమె శరీరంమీద ఆమెకు ఆసక్తిపోయింది. చాలాసేపటి తరువాత ఆ వ్యక్తి తలుపు తీస్తోంటే కొంత కుతూహలంగానూ, కొంత అనాసక్తితోనూ అటువైపు తల తిప్పింది స్వరాజ్యం. వసారాలోని వెలుతురులో అతని ముఖం స్పష్టంగానే

కన్పించింది. అతను స్వరాజ్యం మేనమామ!

ఈ మనిషిని పితృతుల్యుడని, సోదర సమానుడని స్వరాజ్యం ఏనాడూ భావించలేదు. కానీ, తనకంటె వయసులో యిరవై సంవత్సరాలు పెద్దవాడు, తనను ఎత్తుకుని పెంచినవాడు యీనాడు యిలా పశువులా మట్టెగిస్తాడని వూహించలేదు. బాధ తగ్గేక స్వరాజ్యం తననుతాను ప్రశ్నించుకుంది.

'నేను ఎందుకింత ప్రతిఘటిస్తున్నాను? ఈ శరీరాన్ని కాపాడుకోవటానికా? దీనిలో ఏముంది ప్రత్యేకత? శీలమా? లేక ఏనాటికయినా ఎవరికయినా యిల్లాల్ని కావాలనే ఆశా. ఏమిటి నా మూర్ఖత్వం?'

తర్వాతెప్పుడూ ఆమె తల్లిమాటను కాదనలేదు.

★ ★ ★

శ్యామలపట్ల తన మనసు చలించినాక వాసుకి వాళ్ళ క్లాసుకు వెళ్ళాలన్పించలేదు. రెండురోజులు శలవు పెట్టేశాడు. అతను స్కూల్లో కనపడకపోయేసరికి శ్యామలకు పిచ్చెత్తినట్టయ్యింది. మధ్యాహ్నం భోజనానికి యింటికి కూడా వెళ్ళలేదు. క్లాసులు జరుగుతోన్న స్పృహేలేదు. పాఠం వినక, పరధ్యానంగా వుండి ఒకరిద్దరు మాస్టార్లతో చీవాట్లు కూడా తిన్నది.

''ఏమయిందే? ఒంట్లో బాగులేదా?'' అనడిగింది సంధ్య. శ్యామల సమాధానం చెప్పలేదు. ఒకటికి రెండుసార్లు స్టాఫ్‌రూంచుట్టూ తిరిగింది. చివరకు రాజ్యలక్ష్మి ఒంటరిగా కన్పిస్తే,

''వాసూమాస్టారు రాలేదా మేడమ్!'' అనడిగింది.

''లేదమ్మా! యివాళా, రేపూశలవు'' అన్నదావిడ.

'అయితే రేపుకూడా రారన్నమాట' అనుకుంది శ్యామల నిస్పృహగా.

ఆ రెండురోజులూ కాలం మేకపోతును భోంచేసిన కొండచిలువలా కదలలేక, కదలలేక కదిలింది. వాసుమాత్రం స్కూలుకు రాకుండా ఎన్నాళ్ళని శలవుపెట్టగలడు. మూడవరోజు స్కూలుకి రాకా తప్పలేదు. స్కూలు ఫైనల్ క్లాసుకు వెళ్ళకా తప్పలేదు. శ్యామల మనసున వెన్నెల విరిసింది. అతనుమాత్రం వయసుకుమించిన నిగ్రహంతో క్లాసు తీసుకుని వచ్చేశాడు. ప్రతిఫలాపేక్ష లేని శ్యామల అభిమానం ఏమాత్రం చెక్కుచెదరలేదు. వాసు కంటికి కన్పిస్తున్నంతకాలం ఆమెకు సంతోషంగానే వుంటుంది. అంతకుమించి ఆమె ఆశించిందేముంది గనుక?

స్కూలు ఫైనల్‌వాళ్ళంతా నాగార్జునసాగరం విహారయాత్రకు వెళ్ళాలని నిర్ణయించుకున్నారు. ఈ సంవత్సరంతో వాళ్ళకూ, ఆ స్కూలుకూ రుణం తీరిపోతుంది. ఈ టూర్ తమ స్కూలురోజుల్లోని మరిచిపోలేని మధుర స్మృతి కావాలని వాళ్ళ కోరిక. చిన్నక్లాసుల ఉపాధ్యాయులు, పెద్దక్లాసుల ఉపాధ్యాయులు కూడా బయలుదేరారు.

రాజ్యలక్ష్మి మాత్రం తన మామూలు నిర్లిప్తతతో ''నేను రాను'' అనేసింది. వాసు ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు.

''మేమంతా వెళుతూవుంటే మీరుమాత్రం ఎందుకురారు? మీరు మాతో వస్తున్నారు'' అంటూ తన తరపునా, ఆవిడ తరపునా కూడా తనే డబ్బు కట్టేశాడు. ఆమె కోపగించుకోబోయింది. కానీ అతనిపట్ల కోపగించుకోవటం ఆమెకు సాధ్యంకాని పని.

బస్సు స్కూలు ఆవరణ దాటి రోడ్డు ఎక్కిన వెంటనే పిల్లలు అల్లరి మొదలుపెట్టారు. వాసు కూడా వాళ్ళతోచేరి అల్లరి చేయటంలోని మెళకువలన్నీ వాళ్ళకు నేర్పాడు.

''చూడండోయ్! మీరు పెద్దవాళ్ళవుతున్నారు. కాలేజీకి వెళ్తారు. మీ అల్లరి చాలా నాటు అల్లరి. కాలేజీలో యిలా అల్లరి చేస్తే పల్లెటూరి వాళ్ళని తెలిసిపోతారు'' అంటూ ఎలా అల్లరి చేయాలో చేసి చూపించాడు.

''బార్‌బార్ దేఖో... హజార్‌బార్ దేఖో''
చాహే కోయీ ముఝే జంగ్లీకహే''

అంటూ సినిమాపాటలు పాడి అందర్నీ హుషారుచేశాడు. శ్యామల మాట్లాడటం మరిచిపోయినదానిలా, అతని ప్రతి చేష్టనూ ఆరాధనాపూరితంగా చూస్తూ వుండిపోయింది.

ఇదివరకటిలా మగపిల్లలతో దెబ్బలాడ




టంలేదు. ఈ అమ్మాయిలో వుత్సాహం పూర్తిగా తగ్గిపోయింది అనుకున్నాడు వాసు.

బస్సు నాగార్జునసాగర్‌లో ఆగాక పిల్లల్ని పట్టడం కష్టమయిపోయింది. ఒకటే ఉరుకులూ, పరుగులూ!

"మాస్టారూ! ఈ విగ్రహం చూడండి"

"మాస్టారూ! ఈ యజ్ఞవాటిక చూడండి"

"టీచర్! ఈ బుద్ధుడికి చెయ్యిలేదు"

"వీళ్ళ నోటికసలు విశ్రాంతిలేదు" అన్నారు విసుగ్గా తెలుగుమాస్టారు.

"వాళ్ళేమయినా మనలా ముసలివాళ్ళా ఏమిటి? నోటికీ, ఒంటికీ విశ్రాంతినివ్వటానికి?" అని నవ్వేశారు డ్రాయింగ్‌మాస్టారు.

పిల్లలంతా పంజరం విడిచిన పక్షుల్లా తిరుగుతున్నారు. వాసు వాళ్ళనే చూస్తున్నాడు. వాళ్ళల్లో శ్యామల ప్రత్యేకంగా కన్పిస్తోంది.

'వీళ్ళంతా ఈ సంవత్సరం తర్వాత మరి తనకు కన్పించరు. ఇది తన మొదటి స్కూలు ఫైనల్‌బ్యాచ్. తనూ, ఈ స్కూలూ వాళ్ళకు బాల్యస్మృతులు మాత్రమే. బాల్యంనుండి, తారుణ్యందాటి యవ్వనంలోకి అడుగుపెడతారు. ఈ స్కూలునీ, ఈ వూరినీ వదిలి, పట్టణానికి, కాలేజీకి వెళ్ళిపోతారు. అందులో కొందరు అదృష్టవంతులు విదేశాలక్కూడా వెళ్ళొచ్చు. ఈ హైస్కూలు, యిందులోని ఉపాధ్యాయులు వాళ్ళకు జ్ఞాపకాలుమాత్రమే!'

అవును... ఉత్త జ్ఞాపకాలు మాత్రమే! శ్యామలక్కూడానా! ఆహాఁ! ఆమెమాత్రం ఏం మినహాయింపు? ఆమెక్కూడా తాను ఒక జ్ఞాపకంమాత్రమే. ఆమె వయసు ఎంత వుంటుంది. పదిహేను సంవత్సరాలు. మహా అయితే పదహారు. ఈ వయసులో టీచర్లంటే, సినిమా హీరోలంటే క్రేజ్ సహజం. పూర్తి బాల్యచాపల్యం! యస్... షీర్ ఇన్‌ఫాట్యుయేషన్. పాశ్చాత్యభాషలో చెప్పాలంటే కాఫీలవ్. తనకు పాతికేళ్ళు నిండాయి. పూర్వంసంగతి తెలియదుకానీ యిప్పుడు యింత వయసు తేడాతో వివాహాలు జరగటంలేదు. అయినా, నేనెవరిని? ఆ అమ్మాయికి గురువుని. ఆమె నా విద్యార్థిని. గురుశిష్యులమధ్య బంధం పవిత్రంగా వుండాలి. గురువు తన విద్యార్థులకు తండ్రిస్థానంలో వుండాలి. రక్షకుడిలా ప్రవర్తించాలి. ఆ అమ్మాయి చిన్నపిల్ల. ముగ్ధ. యిప్పుడు తనవైపునుండి ఏమాత్రం ప్రోత్సాహం లభించినా యిద్దరి జీవితాలు భ్రష్టమవుతాయి. నా జీవితం నాదికాదు. నాకు చాలా బాధ్యతలున్నాయి. నేను సుమతికి తప్ప మరెవరికీ నా జీవితంలో స్థానం కల్పించకూడదు. అది దేవుడి దృష్టిలోనూ సంఘం దృష్టిలోనూ కూడా తప్పే. ఆ తప్పు నేను చెయ్యను' అనుకున్నాడు వాసు.

"ఏమిటి వాసూ! స్థల ప్రభావమా ఏమిటి? నువ్వు కూడా బుద్ధుడిలా అయిపోయావు" అని రాజ్యలక్ష్మి వేళాకోళం చేసింది.

'ఆయనతో నాకు పోలికా?' అన్నట్టు నాలిక కరుచుకుని, చెంపలు వాయించుకున్నాడు వాసు.

అయితే, అతను నాగార్జునసాగర్‌లో చేసుకున్న ఆత్మపరిశోధనంతా ఏమయిందోగానీ మూడోరోజు స్టాఫ్ మీటింగులో...

"ఆ స్కూలు ఫైనల్ 'బి' వాళ్ళకు గురువారం 'హాబీ' క్లాసు ఒకటి వుంది. ఎవరు తీసుకుంటారు?" అని హెడ్మాష్టరు అడగగానే,

"నాకు కావాలండీ. లెక్కల సిలబస్ కవర్ చేయలేకుండా వున్నాను" అన్నాడు వాసు.

తీరా హెడ్మాస్టరు 'సరే' అన్నాక 'నాకు బుద్ధిలేదు. నిజంగా నాకు బుద్ధిలేదు' అనుకున్నాడు. 'ఇదంతా ఏదో అనర్థానికే దారితీయబోతోంది' అని కూడా అనుకున్నాడు.

★ ★ ★

స్వరాజ్యం జీవితం ఎటువంటి మార్పులూ లేకుండా సాగిపోతోంది. ఒకటిరెండుసార్లు లీల కబురుచేసింది 'గుడివద్దకు రమ్మనీ, చూడాలని వుందనీ'! స్వరాజ్యం వెళ్ళలేదు. లీలంటే ఆమెకు చాలా అభిమానం. ఆ అమ్మాయికి ఏ కుట్రలూ, కుతంత్రాలు తెలీవు. నిజంగా స్నేహశీలి. స్వరాజ్యం కులంతో, వృత్తితో నిమిత్తంలేకుండా ఆమె స్నేహాన్ని కాంక్షించిన ఏకైక వ్యక్తి. ఆమె ఎప్పుడూ స్వరాజ్యాన్ని స్నేహితురాలిగానే ప్రేమించింది. పెళ్ళయి,

పిల్లల తల్లయినా ఆమె దృక్పథంలో మార్పు రాలేదు.

ఒక్కోసారి స్వరాజ్యానికి సందేహం కలిగేది. 'నా గురించి, సౌమిత్రి గురించి లీలకు తెలుసా?' అని. లీలని కలవాలని, చాలా విషయాలు అడగాలనీ అనుకునేది. మళ్ళీ అంతలోనే తనను తాను సంబాళించుకునేది. తన సందేహాలు తీరినంతమాత్రాన ఏమీ ఉపయోగం వుండదు. 'భగవంతుడు తనకిచ్చిన జీవితం యిదే. దీన్ని మార్చాలనుకోవటం నా మూర్ఖత్వం' అని మనసుకు సర్దిచెప్పుకునేది. స్వరాజ్యం అలాగే బతికి, అలాగే చచ్చిపోయి వుండేది. కాని, అలా జరగలేదు.

''సారాజ్జెం! బట్టలు సర్దుకో'' అంది తల్లి ఓరోజు.

ఎందుకని స్వరాజ్యం అడగకుండానే ఆవిడే చెప్పుకొచ్చింది. శ్రీనివాసరావు అని కేంద్ర ప్రభుత్వోద్యోగి. నడివయసువాడు. అలా కనపడడు. బలమయిన శరీరం- జుట్టుకు రంగు వేసుకుంటాడు. డబ్బు బాగా ఇస్తానన్నాడు. 'మరీ రాటుదేలిన సరుకు వద్దు. కొంచెం సంసారపక్షంగా వుండే పిల్లకావాలి' అన్నాడు. దక్షిణాది టూర్‌కు తీసుకుపోతాడట. పదిహేను, ఇరవైరోజులు తన వెంటే వుండాలన్నాడు. రెండువేల రూపాయలు బయానా ఇచ్చాడు. మేనమామ స్వరాజ్యాన్ని పట్నంలో దింపితే మిగతా విషయాలు ఆయనే చూసుకుంటాడు. మళ్ళీ టూరునుండి తిరిగి వచ్చాక రత్తమ్మకు కబురుచేస్తాడు.

అంతా విని స్వరాజ్యం మౌనంగా తనకున్న నాలుగుజతల బట్టలూ సర్దుకుని మేనమామ వెంట పట్నానికి బయలుదేరింది. ఇదివరకు వెళ్లినప్పుడు 'చదువుకుని, ఉద్యోగం చేస్తూ తన కాళ్లమీద తాను నిలబడాలనే' గంపెడాశతో వెళ్లిన స్వరాజ్యం ఇప్పుడు 'వృత్తిరీత్యా' బయలుదేరింది.

శ్రీనివాసరావుకి స్వరాజ్యాన్ని అప్పచెప్పి మేనమామ వూరికి తిరిగివెళ్లిపోయాడు. ఆయన బాహాటంగా స్వరాజ్యాన్ని వెంటపెట్టుకుని షాపింగ్ చేశాడు. కొత్త బట్టలు, బ్యాగు, చెప్పులు చాలా వస్తువులు కొన్నాడు. 'ఇవన్నీ వద్దండీ' అన్నది స్వరాజ్యం మొహమాటంగా. ''సంసారపక్షపు పిల్ల కావాలంటే పూర్తిగా సంసారినే తెచ్చాడే వీడు. వద్దంటావేమిటి? ఆడవాళ్ళు ఇంకా కావాలి. ఇంకా కావాలి అనాలిగానీ వద్దనకూడదు. మనం వెళ్ళే టూరుకు ఇవన్నీ అవసరం కూడాను. కొడైకెనాల్ వెళ్తాం. ఉండు. స్వెట్టరు, రగ్గు కూడా కొంటాను'' అన్నాడాయన.

రైల్లో ఆయనే సంభాషణ సాగించాడు. ఒకటవతరగతి రైలు ప్రయాణం స్వరాజ్యానికి కొత్త. ఆయన పులిలాగ స్వరాజ్యంమీద పడకుండా ప్రేమగా దగ్గర కూర్చోబెట్టుకుని తన స్వవిషయాలు చెప్పుకొచ్చాడు.

ఆయనకు చాలా పొలాలు వుండేవి. ఇప్పుడు లేవు. చాలా వ్యాపారాలు కూడా వుండేవి. అవి కూడా ఇప్పుడు లేవు. కేంద్రప్రభుత్వంలో ఉద్యోగం మాత్రం ఇంకా వుంది.

ఆయనకు పదహారు సంవత్సరాల వయసులో పెళ్ళయింది. స్వరాజ్యం వయసు కొడుకున్నాడు. పెళ్లినాటికి ఆయన భార్య వయసు పది సంవత్సరాలు. ఆమె తన పధ్నాలుగో యేట కాపురానికి వచ్చింది. వాళ్ళ జాతకాలు అలా కలిశాయో, లేక ముహూర్తబలమో తెలియదు. వాళ్ళిద్దరూ ఒకే ప్రాణం, రెండు శరీరాలుగా బ్రతికారు. ఆయన శృంగారానికి చాలా ప్రాముఖ్యత ఇస్తాడు. ప్రేమలేని శృంగారం, శృంగారం లేని ప్రేమ ఉత్త ట్రాష్. అటువంటి తన భార్యకు నాలుగు సంవత్సరాల క్రితం పుట్టకురుపు వ్యాధి అని తేలింది. అన్ని ఆసుపత్రులూ తిరిగారు. చివరకు, రాయవెల్లూరు చేర్చారు. ఈయన రాత్రింబవళ్ళు భార్య పక్కనే గడిపాడు. ఆమె వైద్యం నిమిత్తం ఈ నాలుగేళ్లలో పొలాలు అమ్మేశాడు. ఈయనకు తీరిక లేనందువల్ల,కొడుకుకుదక్షత లేనందువల్ల వ్యాపారాలు దివాలా తీశాయి. ఆవిడ బతకదని తెలుసు. కానీ, 'నేను ప్రయత్నం చేశాననే తృప్తి నాకుండాలి' అంటాడతను. ఏమయితేనేం? ఆమె పోయింది. ఇంత శృంగారపురుషుడు నాలుగు సంవత్సరాలుగా స్త్రీ సుఖమనేది ఎరుగడు. ఆమెకు జబ్బుగా వున్న నాలుగేళ్ళలోనూ చాలాసార్లు భార్య లేకుండా ఇతర స్త్రీలతో పొందుకోసం ప్రయత్నం చేశాడు. కానీ




లాభం లేకపోయింది. ''నేను తాత్కాలికంగా నపుంసకుడిని అయ్యాను. బహుశా, నా భార్య బ్రతికే వున్నది. నేను ఆమెకు అన్యాయం చెయ్యకూడదు. అనే భావన నాకు ఎక్కడో అడ్డుతగిలి వుండాలి. స్వరాజ్యం! ఇప్పుడామె లేదు. పోయింది. నేను ఆమెలేని శూన్యాన్ని తట్టుకోలేకుండా వున్నాను. నా మనసుకు ప్రశాంతత కావాలి. నా శరీరానికి పూర్వపు ఉత్సాహం కావాలి. దాని కోసమే నీతో ఈ విహారయాత్ర'' అన్నాడు శ్రీనివాసరావు. స్వరాజ్యం ఏమీ మాట్లాడలేదు. మనసులో మాత్రం 'విచిత్రమయిన మనిషి' అనుకుంది.

స్వరాజ్యం ఆయనకేమిచ్చిందో, ఏమి ఇవ్వగలిగిందో ఆమెకు తెలియదు. అతను మాత్రం స్వరాజ్యానికి కొత్త ఉత్సాహాన్నిచ్చాడు. ఇరవైరోజులు అనుకున్న టూరు నెల్లాళ్లు సాగింది. మద్రాసు, మధుర, కంచి, మహాబలిపురం, కొడైకెనాల్, కన్యాకుమారి తిరిగి చూశారు. అతని అభిరుచిలో రక్తీ భక్తీ రెండూ వున్నాయి. మంచు బొమ్మవంటి స్వరాజ్యానికి ఉత్తేజం కలిగించాడు. అతని సమక్షంలో ఆమె మనసు, శరీరమూ కూడా కొత్త ఉత్సాహాన్ని పొందాయి. అతనితో గడిపిన ప్రతి క్షణాన్ని స్వరాజ్యం మధురక్షణంగానే భావించి మననున పదిలపరుచుకొంది. అతను ఆమె శరీరాన్ని ఆసరాగా తీసుకుని, ఆమె మనసును జయించాడో లేక మనసును ఆకట్టుకుని శరీరాన్ని స్వంతం చేసుకున్నాడో చెప్పటం కష్టం. ముప్ఫయిరోజుల తర్వాత చూసుకుంటే మాత్రం ఆమె శరీరమూ, మనసూ కూడా అతనివే అయ్యాయి.

'నాకంటూ ఏం మిగల్లేదు. ఆయన స్మృతులు తప్ప' అనుకుందామె.

★ ★ ★

'స్వరాజ్యం! రేపు మనం వెనక్కు వెళ్లిపోతున్నాం. నీతో సమయం చాలా చక్కగా గడిచింది. నా దుఃఖం కొంత ఉపశమించింది. నీకు చాలా కృతజ్ఞుడిని. మనం విడిపోయే ముందు నీకేం కావాలో చెప్పు. ఇవ్వటానికి ప్రయత్నిస్తాను'' అనడిగాడు శ్రీనివాసరావు.

స్వరాజ్యం ''నాకేమీ వద్దండీ. ఇప్పటికే మీకు చాలా ఖర్చయింది. మీరేమయినా ఇవ్వదలిస్తే మా అమ్మకు ఇవ్వండి. ఇవ్వకపోతే వూరుకోదు కూడా'' అంది అమాయకంగా.

''పిచ్చిదానా! మీ అమ్మకు ఇవ్వవలసింది, మీ అమ్మకు ఇస్తాలే. నీకుగా వేరే ఏమీ కోరికలు లేవూ? నీకేమైనా ఇవ్వాలని వుంది నాకు. మొహమాటపడకుండా అడుగు. డైమండ్ వుంగరం కొనివ్వనా?''

స్వరాజ్యం తల అడ్డంగా తిప్పింది. ''నేను కొన్ని సంవత్సరాల క్రితం టీచరు ట్రైనింగు పరీక్ష రాశాను. దాని ఫలితం ఏమయిందో తెలియదు. నేను పాసయి ఉంటే, ఆ సర్టిఫికెట్టు, ఒక బిడ్డా కావాలి నాకు''

శ్రీనివాసరావు చాలా ఆశ్చర్యపోయాడు.

''ఏమిటి స్వరాజ్యం! నువ్వు టీచరు ట్రైనింగ్ కోర్సు చదివావా? ఏదీ. ఇలారా... ఇటు వచ్చి కూర్చో. నాతో మనసువిప్పి మాట్లాడు''

స్వరాజ్యం అతని గుండెల్లో పసిబిడ్డలా ఒదిగి, జీవితంలో మొదటిసారిగా, అరమరికలు లేకుండా ఆనాటివరకు జరిగిన తన జీవితమంతా విప్పి చెప్పింది. అతను తల్లిలా ఓర్పుగా, లాలనతో ఆమె చెప్పిందంతా విన్నాడు. వెంటనే లేచి కూర్చుని ఆమె చదివిన స్కూలు వివరాలు, చదివిన సంవత్సరం, పూర్తి పేరు, మిగిలిన వివరాలు అడిగి తెలుసుకుని పట్నానికి ఒక పెద్ద టెలిగ్రాం ఇచ్చాడు, తన స్నేహితుడి పేరిట.

మూడవరోజు ఇద్దరూ పట్నం చేరారు. మేనమామ ఊరినుండి స్వరాజ్యాన్ని తీసుకువెళ్లడానికి వచ్చాడు. స్వరాజ్యం అప్రయత్నంగా వంగి శ్రీనివాసరావు పాదాలకు నమస్కరించింది.

అతను ఆమెను లేవనెత్తి శిరస్సుమీద ముద్దుపెట్టుకుని స్వరాజ్యం చేతిలో టీచర్ ట్రైనింగ్ సర్టిఫికెట్టు ఉంచాడు.

స్వరాజ్యం సంభ్రమంగా చూసింది, 'ఇది నిజామా' అన్నట్టు.

అతను కళ్లు ఆర్పి 'అవును సుమా' అన్న భావం వచ్చేలా చూశాడు.

''ఇది నీ మొదటి కోరిక స్వరాజ్యం. నీ

రెండవకోరిక... బహుశా తీర్చలేననుకుంటా. నా ఫెర్టిలిటీ'మీద నాకు పెద్ద నమ్మకంలేదు. మా ఆవిడకు కూడా ఒకటే బిడ్డ'' అన్నాడు పెద్దగా నవ్వుతూ.

స్వరాజ్యం మేనమామ వెనుక బయలుదేరింది. శ్రీనివాసరావు ''స్వరాజ్యం!'' అని వెనక్కుపిలిచి, డైరీలోనుండి ఒక కాగితం చింపి తన చిరునామా రాసిచ్చాడు.

''మొహమాటపడకు స్వరాజ్యం. నీకెప్పుడు అవసరం కలిగినా ఈ చిరునామాకి ఉత్తరం రాయి''

స్వరాజ్యానికి కంటనీరు తిరిగింది.

''ఛీర్ అప్ స్వరాజ్యం! జీవితం అలా సాగిపోతూనే వుంటుంది. ప్రతి మలుపు దగ్గర నిలబడి సంతాపం పాటించడంలో అర్థంలేదు. ముందుకు సాగడమే జీవితం''

''మహానుభావుడు! మంచి వేదాంతం ఒంట బట్టించుకున్నాడు. అందుకే పెళ్ళాం చచ్చిపోయిన నెలలోనే సానిదానితో విహారయాత్రకు బయలుదేరగలిగాడు'' అన్నాడు మేనమామ.

★ ★ ★

తనకు గర్భం అని తెలియగానే ముందు స్వరాజ్యం భయపడింది. తనవంటిదానికి తల్లినయ్యే అర్హత వుందా? అని తననుతాను శోధించుకుంది. మాతృత్వకాంక్ష, పిల్లలపట్ల వాత్సల్యం వుండటం తల్లికి అర్హతలయితే, ఆ రెండూ తనకు వున్నాయి. అలాకాక వాళ్ళకి మంచి జీవితం, సాంఘికహోదా కల్పించటం అర్హతలయితే, తనకు తల్లి కావటానికి అర్హత లేదు. ఈ ద్వైదీభావంతో చాలారోజులు మధనపడింది స్వరాజ్యం. ఇన్నాళ్ళుగా, తాను తల్లి కాకపోవటం ఆశ్చర్యం. 'పశువులు తొక్కిన నేలను, గడ్డి కూడా త్వరగా మొలవదు' అనేవాడు మేనమామ. కారణమేదైనా ఇన్నాళ్ళకు ప్రకృతి శ్రీనివాసరావు ద్వారా తనకీ వరాన్ని ప్రసాదించబోతున్నది. దీన్ని నేను స్వీకరిస్తాను' అనుకుందామె.

రత్తమ్మ ఈ వార్త విని చాలా సంతోషపడింది. అందరిలాగే, ఆడపిల్ల పుట్టాలని వేనవేల దేవుళ్ళకు మొక్కుకుంది. ''నీకు ఆడపిల్లే పుడుతుంది. అదీ నావంటి ఆడపిల్లే పుడుతుంది. చూస్తావుండు. సొరాజ్జెం! నీలాగ అర్బనాకారపు పిల్ల పుట్టదు' అంది.

'భగవంతుడా! నాకు ఆడపిల్ల వద్దు. మగబిడ్డనే ప్రసాదించు' అని వేడుకుంది స్వరాజ్యం.

మనవరాలు పుడుతుందని ఎంతో ఆశపడిన రత్తమ్మ స్వరాజ్యం ప్రసవించకముందే కళ్ళు మూసింది. ఆ విధమయిన జీవితం గడిపిన వారందరిలాగే, దుర్భరంగా బాధపడి జబ్బుపడి చనిపోయేటప్పుడు మాత్రం తమ్ముడిని పిలిచి కూతురి గురించి జాగ్రత్త చెప్పింది.

''మన కులంలో పుట్టిందిగానీ, దానికి ఈ వృత్తి ఎప్పుడూ ఇష్టం లేదురా. దాన్ని ఏ పనికీ బలవంతపెట్టమాకు. అసలే బలహీనపు మనిషి. ఇప్పుడు ఒపలేని మనిషి కూడాను. జాగ్రత్తగా చూసుకో. దానికి తండ్రివయినా నువ్వే, మామవయినా నువ్వే. నా కూతురిని నీ చేతుల్లో పెడుతున్నా''

అతను కూడా అక్క మాటకు భిన్నంగా ప్రవర్తించలేదు. స్వరాజ్యం పట్ల విపరీతమయిన ప్రేమాభిమానాలు చూపించి వుండకపోవచ్చు. ఆమెను నొప్పించే పనులు కూడా ఏమీ చెయ్యలేదు. రత్తమ్మకి స్వంత ఇల్లు వుంది. కొద్దో, గొప్పో పొలం వుంది. మేనమామ, స్వరాజ్యం వున్నంతలోనే గుట్టుగా ఇల్లు గడపటం మొదలు పెట్టారు. స్వరాజ్యం జీవితాన్ని కాటువేసిన ఆ రాత్రిలాగా మళ్ళీ అతనెప్పుడూ ఆమెతో ప్రవర్తించలేదు.

''ఏదిఏమయినా స్వరాజ్యం! ముసలాడు పవర్‌ఫుల్లే సుమా! నిన్ను అమ్మని చేసేశాడు'' అని సరసమాడేవాడు. స్వరాజ్యం కూడా ఆ మాటలకు కోపగించుకోకుండా నవ్వుకునేది. కాలం నిండుగర్భిణి అయిన స్వరాజ్యంలాగే మెల్లగా కదలసాగింది.

★ ★ ★

నెలలు నిండి స్వరాజ్యం మగబిడ్డను ప్రసవించింది.

''అబ్బ! అచ్చు ముసలాడి నోటినుండి

వూడిపడ్డాడే వీడు'' అని ఆశ్చర్యపోయాడు మేనమామ. ఆ పురుటికందులో అతనికి శ్రీనివాసరావు పోలికలు అచ్చొత్తినట్టు కన్పించాయి.

''నీ పాలు అలవాటు చెయ్యమాకు స్వరాజ్యం! ఇప్పటికే ఇల్లు గడవటం కష్టంగా వుంది'' అన్నాడు.

'అబ్బ! నేనింకా ముసలిదాన్ని కాలేదా?' అని విచారపడింది స్వరాజ్యం. పైకి మాత్రం, ''కొన్నాళ్లు ఆగు మామయ్యా! ఒంట్లో నీరసంగా వుంది'' అంది.

''అట్టాగేలే. కంగారులేదు'' అన్నాడు మేనమామ, స్వరాజ్యం కోపం తెచ్చుకోకుండా అంగీకరించినందుకు సంతోషపడుతూ.

మూడునెలల తర్వాత స్వరాజ్యం పెద్ద చెక్కబీరువా సర్దుతోంటే, తల్లి చీరెల అడుగున శ్రీనివాసరావు చిరునామా దొరికింది. కొంచెం ఆలోచించి, అతనికి తల్లి పోయిన సంగతీ, తనకి కొడుకు పుట్టిన సంగతీ తెలియచేస్తూ ఉత్తరం రాసింది. ఆమె ఏమి ఆశించి ఆ పనిచేసిందో తెలియదు. ఉత్తరంలో మాత్రం అతనినుండి ఆమె ఏ సహాయాన్నీ అర్థించలేదు. ఆ ఉత్తరానికి జవాబును కూడా ఆమె ఆశించలేదు. తన సర్టిఫికెట్లు, అతని చిరునామా మాత్రం తన పెట్టెలో చీరెల అడుగున భద్రపరుచుకుంది. ఆ ఉత్తరం పోస్టు చెయ్యగానే, ఆమె ఆ సంగతే మర్చిపోయింది.

★ ★ ★

గుమ్మంలో నిలబడిన యువకుడిని 'మీరెవరు?' అని అడగవలసిన అవసరం కన్పించలేదు స్వరాజ్యానికి. అతను శ్రీనివాసరావుకి కార్బన్ కాపీలా వున్నాడు. 'అతను స్త్రీని మనసుతో సహా అనుభవిస్తాడు. అందుకే ఇలా తన ప్రతిబింబాల్ని ఉత్పత్తి చేయగలుగుతున్నాడు' అనుకుంది స్వరాజ్యం నవ్వుకుంటూ. అదృష్టవశాత్తు మేనమామ వూరిలో లేడు.

''మీరేనా స్వరాజ్యం'' అనడిగాడు అతను.

స్వరాజ్యం అవునన్నట్టుగా తల వూపింది. ''నా పేరు విష్ణు. శ్రీనివాసరావుగారి పెద్దబ్బాయిని. మీ ఉత్తరం అందింది. తమ్ముడూ, మీరూ బయలుదేరండి. ఇంటికి వెళ్దాం'' అన్నాడు అతను తను మాట్లాడుతున్నది స్వరాజ్యంతోనే అని నిర్ధారించుకున్నాక, ఏ ఉపోద్ఘాతమూ లేకుండా.

శ్రీనివాసరావుకి ఒక్కడే కొడుకని ఆమె ఎరుగును. తాను పెద్దబ్బాయినని చెప్పుకోవడంతో తన కొడుకుని విష్ణు శ్రీనివాసరావు చిన్న కొడుకుగా గుర్తించాడని స్వరాజ్యానికి అర్థమయింది. ఈ తండ్రీ కొడుకుల మధ్య శారీరకమయిన పోలికలే కాదు- గుణగణాలు కూడా ఒకటే. 'భగవంతుడా! ఈ సుగుణాలే నా కొడుకుకు కూడా ప్రసాదించు' అని ప్రార్థించింది స్వరాజ్యం.

స్వరాజ్యం బట్టలు సర్దుకునేవరకు విష్ణు పసివాడితో ఆడుకుంటూ గడిపాడు. ఆమె తన సర్టిఫికెట్లు తీసుకోవడం మరిచిపోలేదు. బిడ్డను అతని చేతిలోనుండి లోపలిగదిలోకి తీసుకువెళ్ళి, కడుపునిండా పాలు పట్టింది. పెట్టెను అతనూ, బిడ్డను స్వరాజ్యం తీసుకుని బయటకు వచ్చారు. స్వరాజ్యం ఇంటికి తాళంవేసి ప్రక్కఇంటిలో ఇచ్చింది. శ్రీనివాసరావుతో టూరు వెళ్లినప్పుడు తప్ప ఎన్నడూ ఇల్లు కదలని స్వరాజ్యం ఇల్లా పెట్టే, బేడా సర్దుకుని బిడ్డతో సహా బయలుదేరడం చుట్టుపక్కలవాళ్లందర్ని ఆశ్చర్యపరిచింది. ''మీ మామ వస్తే ఏం చెప్పమంటావు స్వరాజ్యం'' అనడిగిన పక్కింటావిడకు.

''ఏమీ చెప్పొద్దు'' అని సమాధానం ఇచ్చింది.


విష్ణు, స్వరాజ్యం రైలుకోసం ఎదురుచూస్తూ




ప్లాట్‌ఫారంమీద కూర్చున్నారు. స్వరాజ్యం మనసులో ఎన్నో ప్రశ్నలు మెదులుతున్నాయి. 'మీ నాన్నగారు బావున్నారా? ఎక్కడున్నారు? నా ఉత్తరం అందిన వెంటనే నన్ను మీ యింటికి తీసుకువెళ్ళాలని ఎందుకు నిర్ణయించుకున్నారు? మీకు పెళ్ళయిందా? నన్ను మీ యింటికి తీసుకువెళ్తున్నారుకదా! ప్రపంచానికి నన్నేమని పరిచయం చేస్తారు?' ఈ ప్రశ్నల్లో ఏ ఒక్కటీ స్వరాజ్యం పెదవిదాటి బయటకు రాలేదు. వాళ్ళిద్దరూ మాట్లాడుకున్నదీ లేదు. 'బిడ్డకు తండ్రిపేరు కలిసి వచ్చేలా పేరు పెట్టానని' స్వరాజ్యం చెప్పటం మినహాగ వాళ్ళిద్దరిమధ్యా ఏవిధమయిన సంభాషణ జరగలేదు.

మేనమామ వూరినుంచి వస్తాడేమో, యింటివద్ద విషయం తెలుసుకుని పట్నానికి వస్తాడేమో, తనగురించి రైల్వేస్టేషన్లో వెదుకుతాడేమో అని సందేహపడుతూ, బితుకుబితుకు మంటూ కూర్చుంది స్వరాజ్యం. విష్ణు పిల్లవాడిని ఒడిలో పెట్టుకుని ఆడిస్తూ వున్నాడు. ఇంతలో రైలు వచ్చేసింది. అతను బిడ్డతోసహా రైలు ఎక్కేశాడు. స్వరాజ్యం బిడ్డ బట్టలున్న సంచీని అతనికి అందించింది. రైలు కదులుతోందన్న సూచనగా గంట కొట్టారు. అతను సిగ్నల్‌వైపు గాభరాగా చూస్తూ స్వరాజ్యానికి చేయి అందించాడు. అయితే, స్వరాజ్యం ఆ చేతిని అందుకోవటానికి బదులు రెండు అడుగులు వెనక్కువేసి, అతనికి రెండు చేతులూ జోడించి నమస్కరించింది. అతని ముఖంలో ప్రశ్నార్థకం అలాగేవుంది. రైలుమాత్రం ముందుకు సాగిపోయింది.

స్వరాజ్యం వెనక్కు తిరిగి యింటికి వెళ్ళలేదు....

నేను రాయవలసినదంతా రాసేశాను. యిక రాయవలసినదేమీ లేదు అనుకుంది రాజ్యలక్ష్మి పుస్తకం మూసేస్తూ.

★ ★ ★

శ్యామలకు మూడురోజులుగా జ్వరం. రెండురోజులు బాగా తీవ్రంగా వుండి మూడవ రోజు కొంత మెరుగయింది. అప్పటినుండి స్కూలుకు వెళ్ళాలని పేచీ పెట్టుకుని కూర్చుంది.

"నీకేమైనా పిచ్చి పట్టిందేమే. జ్వరం యింకా దిగందే. నిన్నా మొన్నా స్పృహ లేకుండా పడున్నావు. నా ప్రాణానికి సుఖంగా వుంది. యివాళ కొంచెం బాగుందో, లేదో నాతో పేచీకి తయారయ్యావు" అని విసుక్కుంది తల్లి.

తండ్రి అదంతా కూతురికి చదువుపట్ల గల శ్రద్ధే అనుకున్నాడు.

"సంధ్య నోట్సులు తెచ్చి యిస్తుందిలే తల్లీ! గొడవ చెయ్యకు? మళ్ళీ జ్వరం ఎక్కువవుతుంది" అని బతిమాలుకున్నాడు.

శనివారం మధ్యాహ్నం సంధ్య వచ్చింది.

"అయ్యో! ఏంటే శ్యామలా! యింత చిక్కిపోయావు? యింత నల్లబడిపోయావు" అని స్నేహితురాలిని పరామర్శించింది.

"అవునే... మునుపు పాలమీగడలా వుండేదాన్నికాదూ! ఈ మాయదారి జ్వరం వచ్చి నల్లబడిపోయాను. తన్నానంటే చూడు" నవ్వింది శ్యామల.

ఏ సబ్జెక్ట్‌లో ఏయే పాఠాలు చెప్పారో స్నేహితురాలికి వివరించడం మొదలుపెట్టింది సంధ్య.

"లెఖ్ఖలు థీరమ్స్ చెప్పేశారేమే" అనడిగింది శ్యామల.

సంధ్య శ్యామల కళ్ళల్లోకి గుచ్చిగుచ్చి చూసింది. శ్యామల తడబడి కళ్ళు దించుకుంది.

సంధ్య లేచి గుమ్మందాకా వెళ్ళి, చుట్టుపక్కల ఎవరూ లేరని నిర్ధారించుకుని వెనక్కి వచ్చి స్నేహితురాలి పక్కన కూర్చుంది. తర్వాత ఆ అమ్మాయి చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని,

"నీకు వాసూమాస్టారంటే యిష్టంకదే!" అనడిగింది.

ఈ ప్రశ్నకు శ్యామల తృళ్ళిపడింది. తన మనసులో తనే అనుకోవడానికి భయపడే ఈ బ్రహ్మరహస్యం స్నేహితురాలికి ఎట్లా తెలిసిందో ఆమెకు అర్థంకాలేదు.

సమాధానంమాత్రం చెప్పలేదు.

"మాస్టారికి కూడా నువ్వంటే యిష్టమేనే!"

శ్యామల నమ్మలేనట్టు చూసింది.

''అవును... ఈ మూడురోజులు మాకు క్లాసు చెప్పనేలేదు. ఒకరోజు రివిజన్ చేయించారు. ఒకరోజు డిబేటింగు కండక్ట్ చేశారు. యివాళ ప్రేమసాగర్ పాఠం చెప్పమంటే 'శ్యామల వచ్చాక చెప్పుకుందాంలేవోయ్. మళ్ళీ అనుమానాలతో మన ప్రాణాలు తీసేస్తుంది' అన్నారు''

శ్యామల కొంచెం గర్వంగా ఫీలయింది. ఇంతలో తల్లి పండ్లరసం తీసుకువచ్చింది.

''సంధ్యా! నాకు నీరసంగా వుంది పడుకుంటానే''

''అలాగే... నోట్సులు యిక్కడ పెడుతున్నా. పిన్ని రేపు పథ్యం పెడతానన్నది. రేపు మధ్యాహ్నం నోట్సులు ఎక్కించుకో. నిద్రరాదు'' అని సలహా యిచ్చి సంధ్య వెళ్ళిపోయింది.

★ ★ ★

స్కూలుకు సంక్రాంతి శలవులిచ్చేశారు.

''వాసూ! నువ్వు శలవులకు యింటికి వెళతావా?'' అనడిగింది రాజ్యలక్ష్మి.

''లేదండీ! అడవులకు తపస్సు చేసుకోవటానికి వెళ్దామనుకుంటున్నాను'' అన్నాడు వాసు.

ఆమె పడీ పడీ నవ్వింది.

''అబ్బ! ఏకాక్షరిగారిని నవ్వించిన ఘనత నీదేనయ్యా'' అని అభినందించారు జార్జిగారు.

ఆమెమాత్రం తాను యిన్నాళ్ళూ ప్రాణప్రదంగా దాస్తూ వచ్చిన ఎర్రబౌండు బుక్కును వాసు చేతిలో వుంచి,

''వీలు చూసుకుని చదువు'' అని చెప్పింది.

బట్టలు సర్దుకుంటూ సూటుకేసులో ఆ పుస్తకాన్ని కూడా ఉంచాడు వాసు. శ్యామల గుర్తుకొచ్చింది. మాయాబజార్‌లో శశిరేఖలాంటి శ్యామల. ఆమె శరీరంనుండి బాల్యం పూర్తిగా తప్పుకోలేదు. అందువల్ల, ముద్దుగా వుంటుంది. యవ్వనం తన ముద్రలు వేయటం మొదలుపెట్టింది. అందువల్ల అందంగానూ వుంటుంది. ఆ కళ్ళల్లో తెలివీ, అమాయకత్వమూ రెండూ వున్నాయి. మరో పదిహేను రోజులపాటు ఈ అమ్మాయి నాకు కన్పించదు. పోనీలే... అదేమంచిది ఆ అమ్మాయికీ, నాకూ కూడా అనుకున్నాడు వాసు దీర్ఘంగా నిశ్వసించి.

★ ★ ★

''ఏమిరా? శలవులిచ్చేశారా స్కూలుకి?'' అనడిగింది తల్లి గుమ్మంలో అడుగు పెడుతుండగా.

''అబ్బే! బడి ఎగ్గొట్టి వచ్చా!'' అన్నాడు వాసు.

''నువ్వు అంతటివాడివేలే'' అంది కాఫీ తెస్తూ.

''మీ అత్తగారింటికి వెళ్ళి వస్తున్నావా? సరాసరి యిటేనా రావడం?'' అని పలుకరించాడు తండ్రి.

''లేదు నాన్నా, యిటే వచ్చేశాను. రెండురోజులాగి వెళతాను'' అన్నాడు. ప్రస్తుతం అతను సుమతిని ఎదుర్కొనేందుకు మానసికంగా సంసిద్ధంగా లేడు.

''అసలే ఒక్తి మనిషి కూడా కాదు. అటు వెళ్ళి రావాల్సింది'' అన్నాడాయన.

''అబ్బ! వెళ్తాడులెండి. వచ్చాడో, లేదో ఎప్పుడెళ్తావ్? అని పట్టుకున్నారేమిటి?'' అని తల్లి విసుక్కుంది.

మధ్యాహ్నం భోజనం చేసి, తోచక రాజ్యలక్ష్మిగారిచ్చిన పుస్తకం తీశాడు చదువుదామని. చదువుతూ అందులో లీనమైపోయాడు. ఆమె ఏమన్నారు దీనిగురించి. స్వీయ చరిత్ర అని కాదూ! అంటే యిందులో స్వరాజ్యం ఆమేనన్నమాట. జీవితంలో యింత చేదుని చూశారు కాబట్టే ఆమె అలా శిలాసదృశ్యురాలైనారు అనుకున్నాడు వాసు. కానీ, ఆమె ప్రత్యేకం దానిని తనకే చదవమని యివ్వటంలో ఆంతర్యం అతనికి బోధపడలేదు. ఆలోచిస్తూ నిద్రపోయిన వాసు తర్వాత ఆ పుస్తకం సంగతి మరిచిపోయాడు.

★ ★ ★

రైలు కదిలాకగానీ విష్ణుకి అర్థంకాలేదు స్వరాజ్యం పసివాడి బాధ్యతను తనకు అప్ప




గించి వెళ్ళిపోయిందని. అతను చాలాసేపు నిమూఢుడిలా వుండిపోయాడు. ఈ నాలుగు నెలల పసివాడిని తనేం చెయ్యాలి.

సలహా అడగటానికి తండ్రి కూడా లేడు. ఆయనకు స్ట్రోక్ వచ్చాక పదిహేను నిమిషాలు మాత్రం బతికాడు. అప్పుడు చెప్పాడు స్వరాజ్యం గురించీ, ఆమె దగ్గరనుండీ వచ్చిన వుత్తరం గురించీ.

"విష్ణూ! అసహ్యంగా వుందా నాన్నంటే" అని అడిగాడు. తనకు నిజంగా అసహ్యం వేయలేదు. ఆయనంటే తనకు చాలా ఆరాధనాభావం వుంది చిన్ననాటినుంచి కూడా. తన స్నేహితుల యిళ్ళల్లోలాగ తల్లీ తండ్రీ పోట్లాడుకోవటం, పగలంతా ఎడముఖం, పెడముఖంగా వుండటం, రాత్రుళ్ళు రాజీకి రావడం విష్ణుకి తెలియదు. తండ్రి తన తల్లిని చాలా ప్రేమించాడు. అది రహస్యమని అతను అనుకోలేదు. కొడుకుముందు నిరాఘాటంగా తన ప్రేమను వ్యక్తీకరించేవాడు. వయసు పెరిగినకొద్దీ, ఆయన ఉత్సాహం పెరిగిందేతప్ప తరగలేదు. 'నా యవ్వన రహస్యం వసంత కుసుమాకరం కాదు. మీ అమ్మ' అనేవాడాయన.

'లాలయేత్ పంచవర్షాణి
దశవర్షాణి తాడయేత్

ప్రాప్తేతు షోడసే వర్షే
పుత్రం మిత్రవదా చరేత్'

అనే సిద్ధాంతాన్ని పూర్తిగా నమ్మినవాడే. కానీ, తల్లి జబ్బు ఆయన్ని కుంగదీసింది. ఆయన మనసులో ఏముందో ఎవరికీ తెలియలేదు. బాహ్యప్రవర్తనం మాత్రం మునుపటిలాగే వుంది. 'ఈయనకు డాక్టరు చెప్పింది ఏమయినా అర్థమయిందా?' అని ఆశ్చర్యపోయాడు విష్ణు. ఆరునెలల్లో ఆయన నల్లటి జుత్తంతా ఒక్క వెంట్రుక కూడా మిగలకుండా తెల్లబడినప్పుడు అర్థమయిందతనికి, 'ఈ మనిషి అంతరాంతరాల్లో ఎంత చిత్తక్షోభనను భవిస్తూ వున్నాడో! తల్లి జబ్బుకోసం పొలాలన్నీ అమ్ముతున్నప్పుడు, "విష్ణూ! నీకు అన్యాయమే చేస్తున్నానో, మీ అమ్మకు న్యాయమే చేస్తున్నానో తెలియదు. ఇది పిత్రార్జితం. కావాలంటే నువ్వు నన్ను అభ్యంతరపెట్టొచ్చు" అన్నాడు.

పిత్రార్జితంగా ఆయననుండి తనకు సంక్రమించవలసింది ఆస్తికాదు. ఆయన వ్యక్తిత్వం. విష్ణు ఆ మాట ఆయనతో అనలేదు. తల్లి చావుబతుకులమధ్య ఊగిసలాడుతూ తన పెళ్ళి చూడాలని కోరుకున్నది.

అప్పుడు తండ్రి,

"విష్ణూ! నేనయితే యిరవైయ్యేళ్ళ కుర్రవాడికి పెళ్ళి చెయ్యను. నేను అంతకంటె చిన్న వయసులో పెళ్ళాడాను కనుక. అది వేరే విషయం. ఆరోజులు వేరు. అమ్మ నీ పెళ్ళి చూడాలనుకుంటున్నది. నీ యిష్టం"

తను పెళ్ళికి ఒప్పుకున్నాడు.

"అమ్మ బతకదు. నువ్వు బతుకుతావు. బాగా ఆలోచించుకున్నావు కదూ!" అనడిగాడు.

తన పెళ్ళయింది. పొలాలన్నీ అమ్ముడయిపోయాయి. వ్యాపారాలు దివాళా తీశాయి. పెళ్ళి చేసుకున్నాడన్నమాటేగానీ రాధను కాపురానికి తీసుకురానేలేదు. తనకూ, నాన్నకూ రాయవెల్లూరు చుట్టూ ప్రదక్షిణాలే సరిపోయాయి. నాలుగేళ్ళు మంచంలో వుండి అమ్మ పోయింది. ఆయన భోరున ఏడవలేదు. పైకి మామూలుగానే వున్నాడు. నెలరోజుల తర్వాత దేశం తిరిగిరావాలని వుందంటూ ప్రయాణమైపోయాడు. ఆ పోవటం పోవటం నెల తర్వాత వచ్చాడు.

ఈసారి కొంత ఉత్సాహంగానే కన్పించాడు. తాను వలంటరీగా ఉద్యోగ విరమణ చేసి ఆ ఉద్యోగం తనకు వచ్చేలా చూశారు. రాధను కాపురానికి తీసుకురావాలని ఉత్సాహపడ్డారు. అంతా ప్రశాంతంగా జరుగుతున్నట్టుగానే తనకు తోచింది. ఇంతలో ఆకస్మికంగా ఆయనకు గుండెపోటు వచ్చింది. ఆయన తన సంతోషాన్నే తప్ప దుఃఖాన్ని ఎవరికీ పంచలేదు. ఆ బరువు హృదయంమీద మోపరానిదయింది. అప్పుడే ఆయన స్వరాజ్యం గురించి తనకు చెప్పారు. ఈరోజు స్వరాజ్యం ఆ బిడ్డను తన చేతుల్లో వుంచి తాను తప్పుకుంది. తండ్రి మరణం తర్వాత రాధ కాపురానికయితే వచ్చిందిగానీ తాము కలిసి జీవితం ఆరంభించనేలేదు. ఈ కుర్రవాడి రాకకు ఆమె

ఎట్లా ప్రతిస్పందిస్తుందో తెలియదు. తండ్రి గురించి రాధకు చెపుదామా? అనుకున్నాడు. రాధకి అర్థంకాదేమో అని సందేహించాడు. తన తండ్రిని ఆమె కాముకుడు అనుకోవటం అతనికి యిష్టంలేదు. అయితే రాధ బిడ్డను గురించి ఏమీ అడగలేదు. అత్తగారుమాత్రం 'అచ్చుగుద్దినట్టు నీ పోలికే అబ్బాయ్' అన్నది. అది నిజమేకూడాను. ''అవునండి'' అని తాను ఆ నిజాన్ని అంగీకరించాడు. తనను ఏమీ అడగని భార్యకు తానేం చెప్పాలో విష్ణుకి తెలియలేదు. అందువల్ల, అతను ఆమెకు ఏమీ చెప్పాలని ప్రయత్నించలేదు. 'ఇది నా తండ్రి రహస్యం. నాకు వెల్లడి చేసే అధికారం లేదు' అనుకున్నాడతను. 'చెప్పవలసిన బాధ్యత అతనిది. చెప్పకపోవటం అతని తప్పు' అని రాధ అనుకుని వుండవచ్చునని అతనికేనాడూ తట్టలేదు. బాబు మాటలు వచ్చిన కొత్తలో 'నాన్నా... నాన్నా' అంటోంటే 'అన్నయ్యా' అని సరిదిద్దబోయి వూరుకున్నాడు. రాధ ఎప్పుడు ఎలా వాడిని బిడ్డగా అంగీకరించిందో అతనికి గుర్తులేదు. తర్వాత తనకు యిద్దరు పిల్లలు పుట్టాక కూడా వాడి స్థానానికి భంగం వాటిల్లలేదు - పెద్దకొడుకుగా ప్రమోషన్ వచ్చిందేతప్ప.

బాబుకి తండ్రిపేరు కలిసి వచ్చేలా పేరు పెట్టానని స్వరాజ్యం చెప్పింది. అది ఏమయి వుంటుందో విష్ణు ఊహకు తట్టలేదు. వాసుదేవ రావు అని వాడికి నామకరణం చేశాడు. వాడు తనను తాకితే తండ్రి స్పృశించినట్టే తోచేదతనికి. వాడిలో అతను తన తండ్రిని చూసుకున్నాడు. వాడికి తనలో తండ్రిని చూపించటానికి ప్రయత్నించాడు. సామాజికంగానూ, చట్టపరంగానూ తండ్రిగానే వ్యవహరించాడు. ఎప్పుడయినా, అతనికి ఆ అభాగ్యురాలు, వాడి తల్లి గుర్తుకు వచ్చేది. సౌందర్యప్రియుడయిన తన తండ్రి ఆ అర్భనాకారపు ఆడపిల్లకు అంత ప్రాముఖ్యతనిచ్చాడంటే తప్పక ఆమె మానసిక సౌందర్యం మహోన్నతమయినది అనుకునేవాడతను. వాసుకు ఉద్యోగం వచ్చి, వివాహం జరిగినప్పుడు, 'అమ్మా! నీ బిడ్డను నాకు చేతనయినంతలో ప్రయోజకుణ్ణి చేశాను' అని ఆ దీనురాలికి మనసులోనే విన్నవించుకున్నాడు.

ఇప్పుడు ఆ తల్లి తన బిడ్డను కలుసుకున్నది. అంతేకాదు, తన బిడ్డగా గ్రహించింది. తన బిడ్డనుండి ఊరటను, ఆదరణను ఆశిస్తున్నది. అందువలననే తన స్వీయచరిత్రను కథగా రాసి తన బిడ్డకు అందించింది. అయితే తన బిడ్డ సంస్కారాన్ని ఊహించలేక, అతను ఛీత్కరిస్తే తట్టుకోలేని అసహాయతలో పేరు మార్చుకుంది.

★ ★ ★

మంచంమీద, వాసు పక్కన పడిఉన్న పుస్తకం విష్ణుని ఆకర్షించింది. అతను దాన్ని యదాలాపంగాతిరగేసినవాడల్లా అది రాసింది వాసు తల్లి అని గ్రహించగానే ఆమూలాగ్రం చదివాడు. ఆమె రాయటం పూర్తవగానే, మిగిలిన కథను అతను పూర్తిచేశాడు.

ముందు అతనికి వాసు పనిచేసే ఊరు వెళ్ళాలనిపించింది.

'అమ్మా! నీ బిడ్డ యిడుగో. నీ వృద్ధాప్యం అయినా వీడి నీడన గడుపు' అని ప్రార్థించాలనుకున్నాడు. తనను కొద్దిరోజులపాటు విలాసానికి ఆదరించిన శ్రీనివాసరావు కొడుక్కు మచ్చ తెచ్చేందుకు యిష్టపడకే ఆమె దూరంగా తప్పుకున్నది. ఇప్పుడు తన స్వంతబిడ్డమీద తన నీడ పడనిస్తుందా! అది ఆమె జీవితం. నిర్ణయం ఆమె తీసుకోవాలి! దానిలో తామెవరి ప్రమేయమూ ఉండరాదు. తన యింటి తలుపులుమాత్రం తల్లికాని ఆ తల్లికోసం ఎప్పుడూ తెరిచే వుంటాయి. విష్ణు ఆ పుస్తకాన్ని వాసు సూటుకేసులో ఉంచి మూతవేశాడు. అప్రయత్నంగానే దీర్ఘంగా నిశ్వసించాడు.

★ ★ ★

వాసు బట్టలు చాకలికి వేసేందుకు రాధ అతని సూటుకేసు తెరిచింది.

రాజ్యలక్ష్మి పుస్తకం క్రిందపడింది. రెపరెపలాడిన పేజీల మధ్య భర్త దస్తూరిని పోల్చుకున్నది. ఆమె కనుబొమలు ముడిపడ్డాయి. ఉత్సుకత ఆగలేదు. సంస్కారం ఒక్కక్షణం మాత్రమే దానికి కళ్ళెం వేయగలిగింది. గబగబ ఆ పేజీలన్నీ ఒక్క బిగిలో చదివేసింది.

'దీనికి ముగింపు రాయవల్సింది నేనే' అను




కుంది రాధ.

★ ★ ★

విష్ణు తండ్రి పెంపకంలో సంస్కారాన్ని అలవరచుకుంటే రాధ జన్మతః సంస్కార వంతురాలు. ఆమెను అందరూ అల్లరిపిల్ల గానే చూశారు. కానీ ఆ అల్లరి వెనుక తనదైన ఆలోచన, ఆత్మ ఉండవచ్చని ఎవరికీ తట్టినట్టు లేదు.

''శ్రీనివాసరావు భార్యకు బాగోలేదు. కొడుక్కి పెళ్లి చెయ్యాలనుకుంటున్నారట. అబ్బో! బోలెడు పొలం. బోలెడు వ్యాపారాలు. నాలుగు తరాలు కూర్చుని తిన్నా తరగని ఆస్తి. రాధమ్మను ఇచ్చి చేస్తే బావుంటుంది'' అన్నాడు తండ్రి.

'ఎవరికి నాన్నా నన్నిచ్చి పెళ్ళి చేయాలనుకుంటున్నావు? శ్రీనివాసరావుకా? అతని ఆస్తికా? అతని కొడుక్కా?' అని అడగాలన్పించింది రాధకి. పెంపకంలోని శిక్షణవల్ల కాబోలు అడగలేకపోయింది.

''పెళ్లికొడుకు అమ్మాయిని చూడనవసరంలేదట. ముహూర్తాలు పెట్టేసుకోమన్నారు'' అని కబురు తెచ్చాడు తండ్రి.

'పెళ్ళికొడుకు పెళ్ళికయినా వస్తాడా నాన్నా! లేక కత్తికి బాసికం కట్టేస్తారా?' అని అడగాలనుకున్నది. పైకారణం వల్లనే అడగలేకపోయింది.

ఇలా చచ్చిపోతున్నవాళ్ళు బతికి వున్నవాళ్ళ పెళ్ళిళ్ళు చూడాలనికోరటం ఏమిటో, బతికివున్నవాళ్ళు ఆ చచ్చిపోయేవాళ్ళ కోరిక తీర్చడం కోసం మిగిలినవాళ్ళను చంపటమెందుకో రాధకు అర్థం కాలేదు.

'ఆ చేసుకోబోయే పెద్దమనిషి సాక్షాత్తు ఆంజనేయుడిసోదరుడే అయినా నాకు తల ఒగ్గకతప్పదు. బోలెడాస్తి. బోలెడు వ్యాపారాలు. కాదంటే నాన్న గుండాగి చచ్చిపోతాడు' అనుకుంది రాధ.

పెళ్లయినాక ఆస్తులు, పొలాలు అన్నీ అత్తగారి జబ్బుకింద ఖర్చయిపోయాయని తెలిసి పడీపడీ నవ్వుకుంది రాధ. 'వీటిని చూసుకునే కదా, నాన్న పెళ్ళికొడుకుని కూడా చూడకుండా పెళ్లిచేశాడు. తిక్క మహబాగా కుదిరింది' అనుకుంది.

''పోనివ్వు. కుర్రాడు బుద్ధిమంతుడు. అత్త పోరు, ఆడబిడ్డ పోరూ లేదు'' అన్నారు తల్లీ తండ్రీ ముక్తకంఠంతో.

'హుఁ! అలా తమ చర్యల్ని తాము సమర్థించుకోలేకపోతే మనములు బ్రతకటం కష్టం' అనుకుంది రాధ.

శోభనానికి ముహూర్తాలు పెడుతుంటే, విష్ణు ''వద్దండీ! ఇప్పుడు నాకు ఇష్టంలేదు. మా అమ్మ మంచంమీద ఉంది. ఆలోచించండి'' అన్నాడు.

అతని గొంతు నెమ్మదిగా వుంది. కానీ, ఆ గొంతులోని కరుకుదనాన్ని రాధ మాత్రమే గుర్తించగలిగింది.

'ఓహో! తల్లి మంచంమీద ఉండటం వివాహానికి అడ్డంకాదుగానీ, శోభనానికి అడ్డు అన్నమాట. లేక పెళ్ళి చూడాలని కోరుకున్నట్టు వాళ్ళమ్మ కొడుకు శోభనం చూడాలనో, మనుమణ్ణి చూడాలనో కోరుకుంటేగానీ కార్యం జరగనివ్వడేమో' అనుకుంది రాధ.

రాధకు పెళ్లివల్ల మెళ్లో మంగళసూత్రం, కాలికి మట్టెలు రావటం తప్ప మార్పేమీ కన్పించలేదు. మామగారు, భర్తా ఎక్కువ కాలం రాయవెల్లూరులోనే గడుపుతున్నారన్నారు. భర్త తమ ఇంటికి రాలేదు. ఆమె మెట్టినింటికి వెళ్ళలేదు. అత్తగారు పోయింది. ఆ కబురుమాత్రం భర్తే స్వయంగా తీసుకువచ్చాడు. అప్పుడు మొదటిసారి అతన్ని పరిశీలనగా చూసింది.

అకస్మాత్తుగా తనముందు నిలబడి ''బాగున్నావా?'' అన్నాడు. అతని నవ్వుతోన్న కళ్లు చెప్పాయి 'అతనే తన భర్తని'.

తను లోపలకు వెళ్ళి తల్లిని బయటకు పంపింది. 'మా అమ్మాయి మెట్టిన వేళావిశేషం అంటారేమో బాబూ!' అంది తల్లి వినయంగా మాట్లాడాననుకుని మురిసిపోతూ.

''ఇందులో మీ అమ్మాయి ప్రసక్తి లేదులెండి. నాలుగు సంవత్సరాలుగా మా అమ్మకు పుట్ట కురుపువ్యాధి. ఎప్పటికయినా పోవలసిందే. ఆవిడను బాధనుండి విముక్తిచేసిన

ఘనత ఏదయినా ఉంటే మీ అమ్మాయిదే అనుకుంటే పోతుంది'' అన్నాడు విష్ణు.

అల్లుడేమన్నాడో అత్తగారికి అర్థం కాలేదు. చాటునుండి విన్న రాధ మనసారా నవ్వు కుంది.

తల్లి చావు కబురు తెచ్చినవాడితో శోభనం గురించి మాట్లాడటానికి తల్లీ తండ్రి కూడా బిడియపడ్డారు. వాళ్ళు ఆ దుఃఖంనుండి కొంత తేరుకున్నాక రాధనే కాపురానికి పంపాల నుకున్నారు. ఈ లోపున మామగారు యాత్ర లకు వెళ్ళారన్నారు.

ఆయన తిరిగివచ్చాక మంచిరోజుకోసం వెతుకుతుండగానే అటునుండి కబురు వచ్చింది. ఆ సంవత్సరం పుష్కరాల సంవ త్సరం కనుకనూ, తల్లి పోయిన సంవత్సరం కనుకనూ రాధను కాపురానికి తీసుకువెళ్లటం కుదరదని.

సంవత్సరం జరిగాక మామగారి చావుకబు రు వచ్చింది. భర్తతో పరిచయం లేకపోయినా రాధకు అతని ఆత్మతో పరిచయం వుంది. అందువల్ల ఆమె ఏమీ భయపడలేదుగానీ తల్లి మాత్రం,



''ఇదేమిటండీ పెళ్లయిన రెండేళ్ళలోనే-కాపురానికి వెళ్లకుండానే అత్తనీ, మామనీ సాగనంపేసింది అంటారేమోనండీ'' అంటూ వణికిపోయింది.

తండ్రి మామగారి కర్మలకు బయలుదేరుతోంటే రాధ మొదటిసారి ధైర్యంగా ''నాన్నా! నేనూ నీతో వస్తాను'' అంది.

''మంచిరోజు చూసి...'' అని తల్లి గొణుగుతూ వుంటే దానింటికి అది వెళ్ళడానికి మంచి రోజేమిటి? నువ్వూ బయల్దేరు అందరం కలిసే వెళదాం'' అన్నాడు తండ్రి.

రాధనూ, ఆమె తల్లినీ శ్రీనివాసరావు ఇంట్లో వదలి తను వూరికి తిరిగి వెళ్ళిపోయాడు ఆమె తండ్రి. దుఃఖంలోనూ, ముభావంగానూ ఉన్న భర్తకు ఎలా దగ్గర కావాలో రాధకు తెలియలేదు. దానికితోడు తల్లి అతిగా అన్ని విషయాల్లో కల్పించుకుని అతన్ని విసిగించేది.

ఒకరోజు అతను ఊరు వెళ్తున్నానని చెప్పి వెళ్ళాడు. వెళ్లినవాడు పసిబిడ్డతో తిరిగి ఇంటికివచ్చాడు. అత్తగారి యక్షప్రశ్నలకు జవాబేమీ చెప్పకుండా భార్య చేతిలో బిడ్డనుంచాడు. ముమ్మూర్తులా తన భర్తనే పోలిన ఈ బిడ్డ తనకేమవుతాడో రాధకు తెలియలేదు.

రాధ విష్ణుకి శారీరకంగా దగ్గర కాలేదు.

అందువల్ల మానసికంగా దగ్గర కాలేకపోయింది. అతనిని నిలదీసి అడిగే చనువు ఆమెకు లేదు. ''ఏముందీ? పోలికలు తెలియటంలేదూ! ఈ మహానుభావుడి వరప్రసాదమే వీడు. తండ్రి పోయేవరకు, ముచ్చులా ఊరుకున్నాడు. పోయాక స్వతంత్రం వచ్చింది కాదూ! బిడ్డను తెచ్చాడు'' అంది తల్లి.

'నా భర్తది ముక్కుసూటి వ్యవహారం. మనసులో ఒకటి బయటకు ఒకటి చెప్పేతీరు కాదు. అమ్మ చెప్పేది నేను నమ్మను, అనుకుంది రాధ దృఢంగా. తన భర్త ఈ బిడ్డ గురించి తనతో ప్రత్యేకంగా ఏదో మాట్లాడాలనీ, మాట్లాడతాడనీ ఆమె ఆశించింది. కానీ అటువంటిదేమీ జరగనేలేదు. కొన్నాళ్ళు రాధ ఉత్సుకతతో కొట్టుకుంది. సూటిగా అతన్నే అడుగుదామా! అనుకుంది. అడిగితే నిజం చెపుతాడని భయం. అందుకే అడగలేకపోయింది. ఒకసారి తల్లి తెగించి,

''వీడు అచ్చు నీ పోలికే అబ్బాయ్!'' అంది.

''అవునండీ!'' అని అంగీకరించాడు భర్త! అంత సిగ్గువిడిచిన అల్లుడిని ఎలా సిగ్గిలచేయాలో అత్తగారికి తోచలేదు. ఆ తర్వాత రాధ ఆ బిడ్డపట్ల, భర్తపట్ల కఠినంగా ఉండాలని ప్రయత్నించింది. ఊహు! అది సాధ్యంకాలేదు. పసివాడయిన ఆ బిడ్డది ఎంత నిర్మలమయిన ముఖమో, యువకుడయిన తన భర్తదీ అంతే నిర్మలమయిన ముఖం. లాభంలేదు. వీళ్ళిద్దరిపట్లా నేను కఠినంగా వ్యవహరించలేను. అని తన అంతరాత్మ ముందు ఒప్పేసుకుంది రాధ.

''పుణ్యాత్ముడు! బిడ్డనే తెచ్చాడు. సవతిని తేలేదు. సంతోషించు'' అంది తల్లి.

''శోభనం వద్దంటాడేవిటే? దాని దగ్గరకు వస్తూపోతూ ఉంటాడంటావా?'' అనడిగింది ఒకసారి.

''అదేమీలేదు. నువ్వు ఇంటికి వెళ్ళు. నేను నా ఇంటిని సమర్థించుకోగలను'' అంది రాధ.

''నీకేదో మందుపెట్టాడు'' అని నిట్టూర్చి ఆవిడ వెళ్ళిపోయింది. అత్తగారి నిష్క్రమణంతో ఇల్లు ప్రశాంతమయినట్టు తోచింది విష్ణుకి. అప్పుడుగానీ అతను రాధను దగ్గరకు తీసుకోలేదు. అప్పుడు కూడా ఆమెను కౌగలించుకున్నవాడల్లా చటుక్కున వదలి,

''రాధా! నీకేమీ అభ్యంతరం లేదుకదూ!'' అని అడిగాడు. భర్త ముక్కుసూటి వ్యవహారం రాధకు ఎంతగా అర్థం అయిందంటే సిగ్గుపడి మౌనంగా వుంటే వదిలేసి వెళ్ళిపోతాడని భయపడి చిన్నపిల్లలా అతన్ని గాఢంగా కౌగిలించుకున్నది.

''మీరెటువంటివారయినా కానీ... మీ తప్పులతోసహా నాకు ప్రేమాస్పదులు'' అనుకుంది రాధ. తన మనసును వెల్లడించగల భాషాప్రావీణ్యమూ, చొరవా కూడా అప్పటికి ఆమెకు లేవు.

కానీ, తొలి సమాగమంలోనే ఆమెకు అర్థమ




యింది. పవిత్రత అనేది శరీరానికి సంబంధించినమాటే అయితే తానెంత పవిత్రురాలో అతనూ అంతే పవిత్రుడు. మనసుకు సంబంధించినదే అయితే మనసులో ఒక స్త్రీని నిలుపుకుని మరో స్త్రీతో రమించే స్వభావం కాదు తన భర్తది.

ఈ బిడ్డ ఎవరయినా కానీ, తనకు ప్రేమాస్పదుడైన తన భర్తకు ప్రేమాస్పదుడు. అందువల్ల, నాకు కూడా ప్రియమయినవాడే అనుకుంది రాధ.

★ ★ ★

రాధ తాను రాయవలసిందేదో రాసి, తిరిగి పుస్తకాన్ని వాసు సూటుకేసులో ఉంచేసింది. ఇవేవీ తెలియని వాసు దాన్ని బట్టల అడుగుకు తోసేశాడు. అతను పండుగకు అత్తగారింటికి వెళ్ళాడు.

జాజితీగెలా సన్నగా ఉండే సుమతి, విరగ బూసిన మల్లెపొదలా నిండుగా వుంది.

"ఇవాళే మా అబ్బాయిని వెళ్ళమంటున్నాం మిమ్మల్ని పిలుచుకు రావటానికి" అన్నాడు మామగారు.

"ఎందుకండీ ఛార్జీలు దండుగ? నేను రాలేనూ...?" అన్నాడు వాసు.

"ఊరు బాగుందా? స్కూలు బాగుందా? ఇల్లు చూసుకున్నారా? సుమతిని ఎప్పుడు తీసుకువెళతారు?" అని ప్రశ్నల పరంపరను సంధించి వదిలాడు.

ఆ రాత్రి సుమతి పక్కన పడుకుని ఆలోచించాడు వాసు. తాను సుమతిని ప్రేమించి పెళ్లి చేసుకోలేదు. అసలు తనకు ప్రేమపట్ల నిర్దిష్టమయిన అభిప్రాయం ఏమీలేదు. తాను ప్యూర్ మాథమాటిక్స్‌లో యమ్మే చేయటం చాలా తెలివితక్కువపని. ఆ తెలివి తక్కువతనానికి తాను జరిమానా చెల్లించేశాడు. యమ్మే మూడవశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. తృతీయశ్రేణి యమ్మే డిగ్రీతో నేను అయ్యేయస్‌కి శిక్షణ పొందుతాను అని అడిగే ధైర్యం అతనికి లేకపోయింది. తమ్ముడూ, చెల్లెలూ కాలేజీ చదువులకు వచ్చారు. తల్లీ తండ్రీ నోరువిప్పి చెప్పకపోయినా ఆర్థికస్థితి అంతంత మాత్రమే అని తెలుస్తూనే వుంది. తనకు ఉద్యోగం చాలా అవసరం. అందుకే బియ్యీడీలో చేరాడు. తనని నిరాశ ఆవహించింది. బియ్యీడి ప్యాస వగానే తల్లి సుమతిని తనకు వధువుగా నిర్ణయించింది. తాను పెళ్లికి కొన్నాళ్లు వాయిదా వెయ్యవలసింది. 'సుమతి అయితే ఉమ్మడి కుటుంబంలో సర్దుకుపోగల పిల్ల' అని అమ్మ పోరటంలో తను పెళ్ళికి అంగీకరించాడు. పెళ్లి తర్వాత అతను పశ్చాత్తాపపడవలసిన పనులేవీ సుమతి చేయలేదు. వెంటనే గర్భవతి అయింది. మూడవ నెలలోనే పుట్టింటికి వెళ్ళిపోయింది. వాసుకు ఉద్యోగం వచ్చింది. వెళ్ళి చేరిపోయాడు.

అతనికి శ్యామల గుర్తుకు వచ్చింది. బాల్యంనుండి యవ్వనంలోకి అడుగిడుతున్న శ్యామల! మాయాబజార్‌లో శశిరేఖలా ముద్దుగానూ, అందంగానూ ఉండే శ్యామల! విరిసీ విరియని పుష్పం వంటి శ్యామల! తనకు ఆ అమ్మాయిపట్ల గల భావం ఏదయినా కానీ, దానికి రూపం కల్పించకపోవటమే ఇరువురికీ శ్రేయస్కరం!

వాసు తిరిగి ఇంటికి వెళ్ళేముందు సుమతితో చెప్పాడు. "సుమతీ! నేను పనిచేస్తున్న వూరు బాగుంది. స్కూలు కూడా బాగుంది. కానీ, నేను నాన్నగారికి సాయంగా ఉండాలనుకుంటున్నాను. మా ఊరికి బదిలీకి ప్రయత్నిస్తాను. నీ కిష్టమేనా?"

"మీ ఇష్టమే నా ఇష్టం" అంది సుమతి. అతను సుమతిని గాఢంగా చుంబించి వీడ్కోలు తీసుకున్నాడు.

★ ★ ★

స్నేహితురాలి నిరుత్సాహం సంధ్యకు తెలుస్తూనే వుంది. రెండు మూడుసార్లు అడిగింది కూడా.

"ఎందుకే శ్యామలా! దిగులుగా ఉంటున్నావు?"

"లేదే! బాగానే ఉన్నాను" అంది సమాధానంగా శ్యామల.

"వాసూ మాస్టారు గుర్తుకు వస్తున్నారేమే?" అని ఒకసారి ఠక్కున అడిగేసింది.

శ్యామల వణికిపోయింది ఆ ప్రశ్నవిని. లేద

న్నట్టు తల అడ్డంగా వూపింది కానీ, కళ్ళ వెంట నీళ్లు జలజలా రాలాయి.

సంధ్య స్నేహితురాలి బాధను అర్థం చేసుకున్నదానిలా భుజం నొక్కి, ''నువ్వు ఆయనను ప్రేమిస్తున్నావనుకుంటానే...'' అంది.

శ్యామల గుండెమీద చేయివేసుకుని భీతిగా ''అమ్మో!'' అంది. అనటమయితే అనేసింది గానీ సంధ్య క్కూడా తన మాటలు పూర్తిగా అర్థం కాలేదు.

''నువ్వు మాస్టారిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నావా?''

''ఛ!''

కొంతసేపయ్యాక శ్యామలకు యింకో అనుమానం వచ్చింది. ''సంధ్యా! పెళ్ళంటే.. అప్పుడు నువ్వు చెప్పావు చూడు. అలా ఉంటారేమే?'' అనడిగింది.

''అవును'' అంది సంధ్య శ్యామలకంటె తనకు కొంచెం ఎక్కువ తెలిసినందుకు గర్విస్తూ.

''ఛీ!''

''యిష్టం లేదా నీకు?''

''ఉహూ!'' శ్యామల తల అడ్డంగా ఊపింది. ''నీకిష్టమేనేమే సంధ్యా?''

''నా కిష్టమేనే'' అంది సంధ్య. ''స్కూలు ఫైనలు పరీక్షలు కాగానే నాకు పెళ్ళి చేసేస్తామంటున్నారు మా యింట్లో'' ఉత్సాహంగా చెప్పింది.

శ్యామల కాసేపు ఆలోచించి చెప్పనా? మాననా? అని తటపటాయించి

''మొన్న సెలవులకు బావొచ్చాడు చూడు. అప్పుడు నన్ను ముద్దుపెట్టుకున్నాడే'' అని చెప్పింది.

''ఆఁ!''

''నాకు అసహ్యం వేసి ఊచిపెట్టి కొట్టాను''

స్నేహితురాళ్ళిద్దరూ పడీపడీ నవ్వుకున్నారు.

''మా అమ్మకి చెప్తాడనుకున్నాను. కానీ చెప్పలేదనుకుంటా. మర్నాడే వాళ్ళ వూరు వెళ్ళిపోయాడు''



సెలవులు పూర్తయి, తిరిగి స్కూళ్ళు తెరిచారు. రాజ్యలక్ష్మిగారి పుస్తకం ఆమెకు తిరిగి యిచ్చేశాడు వాసు.

''చదివావా?'' అనడిగింది.

''చదివాను. కానీ మీరు దానిని నాకే ప్రత్యేకంగా ఎందుకిచ్చారో అర్థంకాలేదు'' అన్నాడు వాసు.

''కారణం లేకుండా మాత్రం కాదు'' అన్నదామె.

వాసుని చూసి శ్యామల ముఖం చంద్రుడిని చూసిన చకోరంలా విప్పారింది. వాసు గమనించాడు కూడా. ఈసారి అతను తన మనసుకు గట్టి శిక్షణయిచ్చాడు స్పందించకుండా. హెడ్మాస్టరుగారిద్వారా బదిలీకి దరఖాస్తు పెట్టుకున్నాడు కూడా. ఆ వార్త మాత్రం ఎలాగో కార్చిచ్చులా వ్యాపించింది స్కూలంతా.

శ్యామల ఆ వార్తవిని తల్లడిల్లిపోయింది. మాస్టారికి, నాకూ ఏమిటి సంబంధం? ప్రత్యేకం ఆయనంటే నాకు ఎందుకింత యిష్టం? దీక్షితులు గారంటే తనకు ఎంతో అభిమానం. ఆయన రిటైరయిపోయారు. వెళ్ళిపోయారు? యిప్పుడు వాసు మాస్టారు వెళ్ళిపోతారు? దానికీ, దీనికీ ఏమిటి తేడా? ఎప్పుడూ మాస్టారిని చూడాలని ఎందుకన్పిస్తుంది? శలవు దినాలు, ఆదివారాలు ఆయనను చూడకుండా ఎంత దుర్భరంగా గడిచాయి? మునుపు మాస్టారు రాకముందు శలవులంటే ఎంత ఉత్సాహం? ఎంత సంతోషం? యిప్పుడలా ఎందుకు





లేదు?

మాస్టారు వెళ్ళిపోతారు. ఈ వూరిలో, ఈ స్కూల్లో, తన క్లాసులో ఎప్పుడూ కన్పించరు. యిన్నాళ్ళూ వెళితే మళ్ళీ వస్తారనే ఆశ ఉండేది. యిక ఆ ఆశ ఉండదు. శ్యామల తన ఆలోచనల్లో తాను ఉండగానే వాసు లెక్కల క్లాసుకు వచ్చేసాడు. సంధ్య చెపితేగానీ శ్యామలకు ఆ విషయం తెలియలేదు. ఇలా జరగటం ఇదే ప్రథమం. ఎప్పుడూ ఎదురు చూపులు చూసే శ్యామల స్తబ్దుగా వుందివాళ.

''మాస్టారు వచ్చారు. లేవవే'' అని సంధ్య గిల్లితే ఉలికిపడి లేచి నించుంది.

అతనూ అన్యమనస్కంగానే వున్నాడు. పిల్లల హెూంవర్కు కూడా చూడలేదు. అరునెలలక్రితం ఈ పిల్లల్ని నేను కోపగించుకున్నాను. హైస్కూలు పంతులుగా చేయవలసివచ్చినందుకు నా కర్మను నేను నిందించుకున్నాను. ఇంతలో నాకీ అనుబంధం ఏమిటి? అని అతను ఆశ్చర్యపోయాడు.

''మాస్టారూ! మీరు వెళ్ళిపోతారా?'' ఆనంద్ చాలా బేలగా అడిగాడు.

''అప్పుడే మీవరకూ వచ్చిందీవార్త? ఎక్కడికీ వెళ్తున్నాను. బదిలీకోసం అర్జీ పెట్టుకున్నానంతే'' అన్నాడు వాసు తేలిగ్గా.

''మేము మీకు నచ్చలేదా మాస్టారూ?''

''మీరు లేకపోతే మాకు బాగుండదు మాస్టారూ!''

''మాకు లెక్కలంటే అసలే భయం మాస్టారూ!''

ఎవరికి తోచిన భాషలోవాళ్ళు తమ ఆవేదనను వ్యక్తం చేశారు. శ్యామల మాట్లాడకుండా కళ్ళప్పగించి చూస్తూ ఉండిపోయింది.

''చూడండి పిల్లలూ! నేను యిప్పుడు ఎక్కడికీ వెళ్ళటంలేదు. సరేనా? నా అర్జీని హెడ్మాస్టారు పై అధికారులకు పంపాలి. వాళ్ళకు నా విన్నపం న్యాయమైనదిగా తోచాలి. నేను అడిగిన స్కూళ్ళల్లో ఖాళీలు ఉండాలి. చాలా తతంగం ఉంది. ఈ లోపున మీ పరీక్షలు వచ్చేస్తాయి కూడా. తర్వాత మీరెవరూ తిరిగి ముఖాలు కూడా చూపించరు. నాకంటె ముందు మీరే వెళ్ళిపోతారు''

అయినా పిల్లల ముఖాలు వికసించలేదు.

''ఇలా ప్రతి మాస్టారూ వెళ్ళిపోయినపుడు, ప్రతి స్కూలు మారినపుడు ఏడుపుముఖాలు పెట్టేస్తే మీరు జీవితంలో ఎలా పైకి రాగలరు? యస్సెల్సీ అయిపోగానే మీరంతా గుంటూరు వెళ్ళి కాలేజీలో చేరతారు. పియ్యూసీ అయిపోయాక ఆ కాలేజీ వదలి మెడికల్ కాలేజీకో, యింజినీరింగ్ కాలేజీకో వెళ్ళిపోతారు. పరిచయస్తుల్నీ స్నేహితుల్నీ విడిచిన ప్రతిసారీ బాధగానే వుంటుంది మరి. అందుకే షేక్స్పియర్ 'పార్టింగ్ ఈజ్ సచె స్వీట్‌సారో!' అన్నాడు''

ఆరోజుకు పాఠం సాగలేదు.

★ ★ ★

రాజ్యలక్ష్మి ఎంతకూ నిద్రరాక వాసు తిరిగి యిచ్చిన పుస్తకం, తను రాసిందే చదువుతూ పడుకుంది. ఆమె రాత పూర్తయిన తరువాత అందులో విష్ణు రాసిన 'మేటర్' కన్పించింది. ఆమె గబుక్కున లేచి కూర్చుని చకచకా అదంతా చదివింది. దాని తర్వాత రాధ రాసింది కూడా చదివింది. 'ఇది అసలు వాసు చదివాడా?' అని అనుమానం కలిగింది ఆవిడకు. అర్ధరాత్రి బావుండదని ఊరుకుంది గానీ, అప్పుడు వాసు రూముకు వెళ్ళి అనుమాన నివృత్తి చేసుకోవాలన్పించింది. మిగిలిన రాత్రంతా ఎప్పుడు తెల్లవారుతుందా? అని ఎదురు చూసింది.

ఉదయం స్కూలుకు రాగానే ఆమె వాసుని పిలిచి,

''సెలవు పెట్టు. మా యింటికి వెళ్ళాలి'' అని ఆజ్ఞ జారీ చేసింది. వాసు అయోమయంగా చూస్తోంటే ''అవును. నీతో మాట్లాడాలి. శలవుపెట్టు'' అంది.

వాసు సెలవుపెట్టి ఆమెను అనుసరించాడు. శ్యామల చూస్తూనే ఉంది యిద్దరూ కలిసి వెళ్ళిపోవటం. 'ఇవాళ లెక్కల క్లాసు లేదన్నమాట' అనుకుంది నిరుత్సాహంగా.

★ ★ ★

రాజ్యలక్ష్మి, వాసు ఆమె యింటికే వెళ్ళారు. యిల్లు చేరగానే ఆవిడ వాసును అడిగిన

మొదటి ప్రశ్న అదే!

"వాసూ! నేనిచ్చిన పుస్తకం నువ్వు చదివావా?"

"చదివానండీ! పూర్తిగా చదివాను"

"ఏమయినా అర్థం అయిందా నీకు?"

వాసు తల వంచుకున్నాడు "స్వరాజ్యం మీరే అని అర్థమయింది. కె.యస్. రాజ్యలక్ష్మి అంటే కె. స్వరాజ్యలక్ష్మి అని కూడా అర్థమయింది"

"అయ్యో! మొద్దూ!" అందావిడ చనువుగా. ఎన్నడూ ఆమెనింత సంతోషంగా చూసినగుర్తులేదు. గబగబా పుస్తకం అంతా తిప్పి "యిదంతా రాసిందెవరు?" అనడిగింది.

"యిదెవరు రాసారు?" అని అతను ఎదురుప్రశ్నించాడు.

"విష్ణు, రాధా ఎవరు?"

"మా అమ్మా, నాన్నా"

"అయితే యిది వాళ్ళిద్దరే రాసారు. నువ్వీ పుస్తకం ఎక్కడ పెట్టావు?"

"నా సూటుకేసులోనే పెట్టాను. ఇతరుల వస్తువులు ముట్టుకునే అలవాటు మా యింట్లో ఎవరికీ లేదు. ఎందుకు రాసారో" అతనికి విచిత్రంగా ఉంది.

"అయితే నువ్విది చదవలేదా?"

"చదవటమా? భలేవారే! నేను చూడలేదు కూడాను"

"అయితే నువ్విప్పుడిది చదవాలి వాసూ! చదువు నేను కొంచెం కాఫీ చేసి పట్టుకువస్తాను"

రాజ్యలక్ష్మి టిఫిన్, కాఫీ తయారుచేసేసరికి వాసు ఒక్కబిగిన అందులో రాసినదంతా చదివాడు. ఇలా సినిమాల్లో జరుగుతుందని తెలుసు కానీ, జీవితాల్లో జరుగుతుందా? అదీ తన జీవితంలో ఎంత సాదా, సీదా జీవితం అనుకున్న తన జీవితంలో యింత పెద్ద రహస్యం ఉండటం ఆశ్చర్యం! నిజంగా అత్యాశ్చర్యం! అతను వంటింట్లోనుండి వచ్చిన రాజ్యలక్ష్మిని విభ్రమంగా చూశాడు.

"ఇందులో కుర్రవాడిని నేనేనా?" యింకా ఏమూలో సందేహం పోలేదు.

"నీకు అన్నయ్యలూ, అక్కయ్యలూ ఉన్నారా?" ఆవిడ ఎదురు ప్రశ్నించింది.

"లేదు. నేను పెద్దవాడిని. నా తర్వాత ఒక చెల్లి, ఒక తమ్ముడు ఉన్నారు. కాలేజీలో చదువుతున్నారు. ఈ పిల్లవాడిని నేనేనా?"

"అవును"

అయిదు నిమిషాల నిశ్శబ్దం తర్వాత గొంతు పెగుల్చుకుని అడిగాడు.

"అయితే మీరు నా తల్లా?"

ఆమె అంగీకార సూచనగా తల ఊపి అంది.

"అసహ్యంగా ఉందా?"

"లేదు" అన్నాడు వాసు దృఢంగా.

"అయితే యిన్నాళ్ళూ నేను తల్లిదండ్రులుగా భావిస్తున్న వాళ్ళు నా అన్నా వదినలన్నమాట"

రాజ్యలక్ష్మి ఏమీ మాట్లాడలేదు.

అతను తనలో తాను గొణుక్కుంటున్నట్టుగా అన్నాడు.

"మీరు యిక్కడ వున్నట్టు వాళ్ళకు తెలిసింది. మరి నన్నేమీ అడగలేదేం? నాతో ఈ విషయం మాట్లాడలేదేమీ? కనీసం మిమ్మల్ని కలవాలని ప్రయత్నం కూడా చెయ్యలేదేం?"

కథ పూర్తి చేసి పంపించాడుగా. దాని అర్థం అదే. ఆ రోజు తాను రమ్మన్నా నేను వెళ్ళలేదు. అప్పుడు సమాజం కళావంతులను చాలా చిన్నచూపుచూసేది. నేను వెళ్ళి వాళ్ళ ప్రశాంతమయిన జీవితాలలో కల్లోలం సృష్టిస్తానని భయపడ్డాను. యిప్పుడు నన్ను వచ్చి కలిస్తే ప్రయోజనం ఏముంది? నా కిష్టంలేనిదే నేను రానని వాళ్లకు తెలుసు"

"నేను అడిగినా రావా??" అన్నాడు వాసు దీనంగా. తన సంబోధన ఏకవచనంలోకి మారటం అతను గమనించనేలేదు.

"రమ్మంటావా వాసూ? ఈ వయసులో నన్ను మీ మధ్యకు రమ్మంటావా? బిడ్డ అచ్చట్లు, ముచ్చట్లు చూడలేదు. పసిడి పలుకులు వినలేదు. తప్పటడుగులు సరిచెయ్యలేదు. యిప్పుడొచ్చి ఏం చెయ్యను?"




''మనుమడి తప్పటడుగులు చూద్దువుగానీ అమ్మా! నన్ను పెంచని నువ్వు వాడిని పెంచి నీ కోరిక తీర్చుకో''

''నీకు పెళ్ళియిందా వాసూ?''

''భలేదానివే. ఇంకో రెండు నెలలలో నేను తండ్రిని కాబోతున్నాను. వస్తావా?''

''బదిలీ చేయించుకుంటున్నావా?''

''అవును, నాన్న... అదే అన్న...

''ఆయన నీకు తండ్రే నాయనా! కన్న తండ్రి కూడా తన బిడ్డకు యింత కంటె ఎక్కువ చేయడు''

''నాన్న రిటైరవుతున్నారు. చెల్లీ, తమ్ముడూ కాలేజీ చదువులకు వచ్చారు. అంతా కలిసి వుంటే బావుంటుందని నా అభిప్రాయం''

రాజ్యలక్ష్మి వాలు కుర్చీలో కళ్ళు మూసుకుని పడుకుని వాసు చెప్పినదంతా శ్రద్ధగా విన్నది.

''నేను వస్తాను నాయనా! నాకు మీ అందరితో ప్రత్యేకంగా పరిచయం లేకపోయినా మీ అందరి ఆలోచనలు, ఆత్మసంస్కారం నాకు అర్థమయినాయి. కొడుకులూ, కోడళ్ళూ, మనమలూ... ఈ బంధాల కోసమయినా వస్తాను. యిక విశ్రాంతి తీసుకుంటాను''

''అయితే అమ్మా! యివాళే నాన్నకు ఉత్తరం రాస్తాను. నువ్వు రాజీనామా చేసి వాళ్ళతో వెళ్ళిపో. బదిలీ కాగానే నేనూ వచ్చేస్తాను'' అన్నాడు వాసు.

★ ★ ★

మూడవ రోజుకల్లా విష్ణూ, రాధా వచ్చారు. విష్ణు స్వరాజ్యాన్ని గుర్తించలేదు కానీ ఆమె మాత్రం అతన్ని గుర్తించింది. పాతికేళ్ళక్రితం ఎలా వున్నాడో అతను ఈనాటికీ అలాగే ఉన్నాడు. జుట్టు మాత్రం తెల్లబడింది.

ఆమె చాలా చనువుగా,

''బాగున్నావా పెద్దబ్బాయ్!'' అని పలకరించింది. అప్రయత్నంగానే ఆమె నోటివెంట ఆ సంబోధన వెలువడింది. స్త్రీ చాలా విచిత్రమయిన వ్యక్తి. పురుషుడు తనకంటె ఎంత పెద్దవాడయినా, పసివాడిని చేసి లాలించగలదు. రమారమి తన ఈడువాడయిన విష్ణులో ఆమె వాసుతో సమానంగా బిడ్డను చూడగలిగింది.

విష్ణు కూడా అప్రయత్నంగా వంగి ఆమె పాదాలకు నమస్కరించాడు. రాధను పరిచయం చేశాడు.

''నువ్వు నా కథను కొనసాగించకపోతే నేను మీతో కలిసి వుండటానికి నిర్ణయం తీసుకోకపోదునమ్మా!'' అంది రాజ్యలక్ష్మి.

''పోనివ్వండి. ఇప్పటికయినా మామీద దయకలిగింది'' అంది రాధ.

ఆరోజే ఆవిడ ఉద్యోగానికి రాజీనామా చేసి విష్ణుతోనూ, రాధతోనూ ఊరు వెళ్ళిపోయింది. వాసును వేసవి శలవుల అనంతరం బదిలీ చేస్తామని పైనుండి ఆర్డర్లు వచ్చాయి. పిల్లలు దానికే ఎంతో సంబరపడిపోయారు.

★ ★ ★

క్లాసు పరీక్ష పెడితే చాలా తక్కువ మార్కులు వచ్చాయి ఎప్పుడూ ఫస్టు మార్కులొచ్చే శ్యామలకు.

వాసుని ఈ విషయం చాలా బాధించింది. ఆ రోజు ఏ క్లాసులో ఏ పాఠం చెప్పున్నా అతనికి శ్యామలే గుర్తుకొస్తూ ఉండింది. తాను ఈ విషయంలో ఏమి చెయ్యాలో అతను నిర్ణయించుకోలేకపోయాడు. జీవితం గురించి ఈ చిన్నపిల్లకు అర్థమయ్యే భాషలో చెప్పటం అతనికి కష్టంగానే తోచింది. అతను ఈ విషయమై ఆలోచిస్తూ ఉండగానే స్కూలు ఫైనల్ వాళ్ళకు ప్రిపరేషన్ హాలీడేస్ యిచ్చారు. అయినా, తనకోసం శ్యామల స్కూలుకి వచ్చి సమయం వృధా చేసుకుంటుందని వాసు సరిగ్గానే ఊహించాడు.

శ్యామల స్టాఫ్‌రూములోకి చూసుకుంటూ వెళుతుంటే, ''శ్యామలా! ఆగు!'' అని అతను కేకవేసి ఆపాడు. శ్యామల కొట్టుకునే గుండెలతో ఆగింది. దగ్గరగా వెళ్ళి రాజ్యలక్ష్మి రాసిన పుస్తకం యిచ్చాడు.

''ఏమిటి మాస్టారూ?'' అనడిగింది.

''చదువు... నీకే తెలుస్తుంది!''

''పరీక్షలయ్యాక చదవనా మాస్టారూ?''

'నువ్వు స్కూలు చుట్టూ కొట్టే చక్కర్లకంటే సమయం ఎక్కువ పట్టదులే' అందామను



కుని చిన్నబుచ్చుకుంటుందని అనలేదు.

"ఫర్వాలేదు. ఒక్కరోజుకి నీ టైము వృధాకాదులే. యివాళే చదువు. నాకు తిరిగి యివ్వనక్కర్లేదు. నీదగ్గరే ఉంచుకో"

★ ★ ★

శ్యామల ఆ పుస్తకాన్ని శ్రద్ధగా, దీక్షతో చదివింది. అందులో చివరగా వాసు కొంత రాశాడు. అది అతను శ్యామలకు రాసిన లేఖ.

"శ్యామలా!

ఆశీస్సులు. నీకు చదువుమీద శ్రద్ధ చాలా తగ్గిందీ. ఇది నేను ప్రత్యేకం నీకు చెప్పనవసరంలేదు. నీ మనసుకు తెలిసేవుంటుంది.

అమ్మ కథ చదివావుకదూ! ఆ రోజులు పాతరోజులు. స్త్రీకి పెళ్ళే జీవితమని సమాజమూ, స్త్రీ కూడా విశ్వసించిన రోజులు. అందుకే పదిహేను సంవత్సరాల బాలిక శారీరకంగానూ, మానసికంగానూ కూడా వివాహానికి సంసిద్ధురాలయి ఉండేది. కాని, ఈ పాతిక సంవత్సరాల్లో సంఘం చాలా మారింది.

మీ హాబీ క్లాసులో ఒకసారి డిబేటింగు పెట్టాను గుర్తుందా? స్త్రీకి విద్య అవసరమా? అనవసరమా? అనేది చర్చనీయాంశం. పందొమ్మిది వందల నలభైలో ఈ చర్చ జరిగితే 'ఆడదానికి రామాయణ, భాగవతాలు చదవటం, చాకలిపద్దు చూడటం వస్తే చాలదూ? దీనికి విద్య అనేంత పెద్ద పేరు ఎందుకు?' అనేవారు. ఇప్పుడు మీలో చాలామంది తల్లిగా కూడా విద్య స్త్రీకి చాలా అవసరమని, తల్లి చదువుకుంటే పిల్లలంతా చదువుకున్నట్టే అని వాదించారు. ఇంకొక్క పాతికేళ్ళ తర్వాతి తరం,

'మనిషి బ్రతకటానికి గాలి అవసరమా? కాదా? గాలికి ఆడా, మగా తేడాలు లేవుకదా! మరి విద్యకు ఆ తేడాలెందుకు?' అని వాదించవచ్చు. మగవాడికి అవసరమయిన విద్య స్త్రీ దగ్గరకు వచ్చేసరికి ఎందుకు చర్చనీయాంశం అయిందో నాకు అర్థంకాదు.

స్త్రీ పురుషులు ఒకరినొకరు చూసుకోకుండా వివాహబంధంతో ఒకటి అయినరోజులనుండి పెళ్ళిచూపులవరకూ వచ్చాం. కొన్నాళ్ళకు స్త్రీ పురుషులు కలిసి జీవించకుండా పెళ్ళితో బంధించబడటానికి యిష్టపడని రోజులు రావొచ్చు.

ఇవన్నీ నేను సంఘం మారిందని చెప్పటానికి ఉదహరించాను. ఇపుడు అమ్మ పుట్టిన కులం పూర్వమంత ఏహ్యమయినది కాదు. ఇతర కులాల్లో పుట్టిన చాలామంది అభాగ్యస్త్రీలు ఆకలి చల్లార్చుకునేందుకై ఆ వృత్తిని అవలంబిస్తున్నారు కూడా!

సరే! ఈ విషయాలను పక్కనుంచి నీ విషయానికి వద్దాం. మీ దీక్షితులు మాస్టారికి లాగానే నువ్వంటే నాకు చాలా యిష్టం. నువ్వు తెలివిగల విద్యార్థినివి. కానీ లోకంపోకడ తెలియని పసిదానివి. నీకు వయసు పెరుగుతున్నది. ఈ వయసులో నీకు వచ్చే ఊహలు అతి సహజమయినవి. నేను ముందు రాసినట్టు, పూర్వకాలంలో అయితే నీకు పెళ్ళి అయిపోయి ఉండేది. శృంగారం అనుభవంలోకి వచ్చి ఉండేది. రెండుమూడు సంవత్సరాల్లో ఇద్దరు ముగ్గురు పిల్లలు పుట్టి ఉండేవారు. అక్కడితో స్త్రీ జీవితం ముగిసిపోయినట్టే లెక్క. ఈ మారినకాలంలో నీ జీవితం యిప్పుడే మొదలయింది. శరీరమూ, మనసూ కూడా యింకా వికసించవలసిఉంది. మొదటిది నీ ప్రమేయం లేకుండానే ప్రకృతి సహజమయిన మార్పుల్ని సంతరించుకుంటుంది.

శ్యామలా! మానసిక వికాసం నీ చేతుల్లో వుంది. ఇపుడు నువ్వు యౌవ్వనం మొదటి మెట్టుమీద వున్నావు. స్త్రీవి అవుతూ అవుతూ వున్నావు. కోరికయొక్క ఛాయ అర్థమయీ కాకుండా ఉంది. పిల్లలకు, ముఖ్యంగా ఆడపిల్లలకు లెక్కలంటే కొంత భయం సహజం. నేను మీకెంతో కఠినంగా అన్పించిన లెక్కలను సులువుగా చేస్తాను. దీక్షితులుగారిలా వృద్ధుడిని కాను. మీరు చదివే కథల్లోని, చూసే సినిమాల్లోని నాయకుడికి దగ్గర లక్షణాలున్న వాడిని. (మీరు నాకు శశికపూర్ అని నిక్‌నేమ్ పెట్టారని నాకు తెలుసు) ఇటువంటి పరిస్థితుల్లో నీకు నామీద యిష్టం కలగటం చాలా సహజం. యిందులో సిగ్గుపడవలసిందికానీ, తప్పు చేసినట్టు భావించుకోవలసిందిగానీ ఏమీ లేదు. మీ క్లాసులోని మగపిల్లలు నాచుట్టూ మూగటంలేదూ? నా రూముకు రావటంలేదూ? వాళ్ళకి కూడా నాపట్ల ఆకర్షణ ఉన్నది. కానీ వాళ్ళు మగపిల్లలు కావటంవల్ల, నేనూ మగవాడిని కావటంవల్ల వాళ్ళు దానిని తప్పుగా భావించుకోవటంలేదు. నువ్వు ఆడపిల్లవి అయినందువల్ల మరీ చిన్నపిల్లవి కానందువల్ల తప్పుచేసినట్లు సిగ్గుపడుతున్నావు. మాస్టారిని ఆడపిల్లలయినా, మగపిల్లలయినా, ఏవయసువాళ్ళయినా యిష్టపడవచ్చు. అందులో తప్పులేదు. ఇది సిగ్గుపడవలసిన విషయంకాదు. ఇది నేను నీకు చెప్పాలనుకున్న మొదటి పాయింటు.

రెండవ విషయం - నువ్వు ఈ యిష్టాన్ని 'ప్రేమ' అనుకోవటం అసంగతం. 'నే అలా అనుకోలేదు' అని నువ్వు బుకాయించవద్దు. నీకు క్లాసు పరీక్షలో వచ్చిన మార్కులే ఈ విషయాన్ని విశదపరుస్తున్నాయి. నీకు జీవితం ఏం తెలుసు? ఏమీ తెలీదు. ప్రేమ గురించి అసలే తెలీదు. ప్రేమకు పరస్పరం అవగాహన కావాలి. ముఖ్యంగా యువతీయు




వకులిద్దరి ఆలోచనా పరిధి ఒకటై ఉండాలి. నువ్వు చాలా చిన్నపిల్లవి. నీకు ప్రేమించే వయసు లేదు. నువ్వు ఒప్పుకున్నా, లేకున్నా యిది నిజం. నేను పరిపూర్ణుడిని అని చెప్పను. కానీ నీకంటె వయసులో చాలా పెద్దవాడిని. నీకంటె ఎక్కువ జీవితం చూశాను. జీవితంప ట్ల మన దృక్పథాలు వేరు. త్యాగాలు సినిమాల్లో శోభిస్తాయేమోకానీ, జీవితాల్లో బావుండవు. అలా త్యాగమయమయిన పదార్థాన్ని నేను ప్రేమగా అంగీకరించను. చాలా గందరగోళంగా ఉందికదూ! అందుకే దీన్ని గురించి ఆలోచించి బుర్ర పాడుచేసుకోకు.

ఇంకొక పది సంవత్సరాల తర్వాత వివాహం చేసుకునేటప్పుడు నేను చెప్పిన మాటలు మననం చేసుకో. మీ భార్యాభర్తలమధ్య వయసు తేడా ఎక్కువ లేకుండా చూసుకో. చాలాసార్లు 'ఏజ్‌గ్యాప్' కమ్యూనికేషన్ గ్యాప్‌కి దారితీస్తుంది.

'నేను జీవితంలో పెళ్ళే చేసుకోను' అని శపథాలు చేసుకోకు. ఇపుడు పెళ్ళి గురించి నిన్ను ఎవరూ ఆలోచించమనటంలేదుకదా! నేను నీ తరపునుండి ఆలోచించి, నీ వూహలు యిట్లా వుండవచ్చని ఊహించి నా స్వంతంగా సమాధానాలు యిస్తున్నాను. చాలావరకు నిజమే అని నాకు తెలుసు.

నీ మనసూ, బుద్ధీ, విచక్షణ యింకా చాలా వికసించాలి. ఇందుకుగాను నువ్వు ముందు బాగా చదువుకోవాలి. తర్వాత వీలయినన్ని ప్రదేశాలు తిరిగి చూడాలి. వీలయినంత మంది మనుషుల్ని కలుసుకోవాలి. వాళ్ళని అర్థంచేసుకోవటానికి ప్రయత్నించాలి. అప్పుడు జీవితాన్ని కూడా చదవగలుగుతావు.

నీ జీవితంలో ఇది ఒక మలుపు. ఒక అనుభవం. దీన్ని గురించి ప్రత్యేకం సిగ్గుపడవలసిందికానీ, దుఃఖపడవలసిందికానీ ఏమీ లేదు. పది సంవత్సరాల తర్వాత నీకిది ఒక తియ్యటి జ్ఞాపకం కావచ్చు. లేక జ్ఞాపకమే వుండకపోవచ్చు. ఇటువంటి మలుపులు చాలా కలిస్తేనే జీవితం. ఇది ఒక ప్రవాహం. ప్రతి మలుపుదగ్గరా నిలబడి, సంతాపమూ, సంతోషమూ ప్రకటించటానికి ముందు ముందు నీకు తీరిక కూడా ఉండకపోవచ్చు. జీవితమంటే ఏమిటి? కొన్ని జ్ఞాపకాల సముదాయం. అన్ని జ్ఞాపకాలూ తియ్యగా ఉండవు. నా జ్ఞాపకంమాత్రం చేదుగా ఉండకుండా వుండాలని నేను చాలా నిజాయితీగా ప్రవర్తించాను.

నేను రాసింది నీకు అర్థమయిందో లేదో తెలియదు. నేను రేపు వెళ్ళిపోతున్నాను. నువ్వు పరీక్షలు బాగా రాస్తావో లేదో నాకు తెలియదు. స్టాఫ్‌రూములో మేమంతా - శ్యామల స్కూలు ఫస్టు వస్తుంది అనుకునేవాళ్ళం. రాకపోతేమాత్రం ఆ పాపం నాదే అనుకుంటాను. కానీ, నువ్వు తెలివిగల అమ్మాయివనీ, బుద్ధిమంతురాలివనీ నాకు తెలుసు. తప్పకుండా ఫస్టు వస్తావని కూడా తెలుసు.

కాలేజీ చదువులు చదువు. ఇటువంటి తాత్కాలిక ఆకర్షణకు లోనైనప్పుడు నా వుత్తరం ఒక్కసారి చదువుకో. ఏమయినా ఉపయోగపడుతుందేమో చూడు. జీవితంలో చేదు జ్ఞాపకాలు మిగలకుండా జాగ్రత్త తీసుకో.

జీవితంలోకి ఎందరో మనుషులు వస్తారు. వెళ్ళిపోతారు. వాళ్ళు శాశ్వతంగా మనతో వుండిపోవాలనుకోవటం - బజారులో మనకి నచ్చిన ప్రతి బొమ్మా మన స్వంతం కావాలనుకోవటంవంటిది. నువ్వు శ్రద్ధగా చదువుకుని జీవితంలో ఎంతో ఎదగాలని ఆశిస్తూ,

నీ
వాసుమాస్టారు



శ్యామల చెప్పటం ఆపింది.

"శ్యామూ! నువ్వు మేధావివనీ, అందువల్లనే

మితభాషివనీ యిన్నాళ్ళూ అనుకుంటూ వచ్చాను. 'రవళి వయసులో ఎవరినయినా ప్రేమించావా?'' అని నేను అడిగితే దానికి సమాధానంగా నువ్వు ఎంత 'పెద్ద కథ విన్పించావూ! తెల్లారిపోయింది చూడూ'' అన్నాడు రావ్.

''అవును రావ్! రవళి వయసులో చాలా మంది అబ్బాయిలూ, అమ్మాయిలూ కూడా అప్పటి నాలాగే ప్రేమిస్తారు. కనీసం ఆ ఆకర్ష ణను ప్రేమ అనుకుంటారు. 'మేరానామ్ జోకర్' చిత్రంలో ఈ బాల్యచాపల్యాన్ని పురుము డిపరంగా చూపించలేదూ! వాసు మాస్టారి వంటి బాధ్యతగల మనిషిని ప్రేమిస్తే జీవితం భ్రష్టుపట్టకుండా బాల్యం తీపికలగా మిగులు తుంది''

''తర్వాతేమయింది శ్యామూ! మీ మాస్టారు నీకు మళ్ళీ కన్పించారా?''

''ఆ ఉత్తరంలోని 'నీ వాసు మాస్టారు' అనే మాటను పదేపదే చదువుకుని ఎంతో పొంగిపో యాను. ఆయన మరిక కన్పించరని తెలుసు



కుని ఎంతో కుంగిపోయాను. ఆయనమీద అకారణంగా చాలా కోపం వచ్చింది. రావ్! మన తొలిరాత్రి నన్ను నువ్వు దగ్గరకు తీసుకున్నప్పుడు ఎఱ్ఱబడిన నీ చెవులను చూస్తేగానీ నా మట్టిబుఱ్ఱకు ఆనాడు మాస్టారు నన్ను స్టాఫ్‌రూంలోనుండి ఎందుకు గెంటేశారో అర్థంకాలేదు. ఆయన కూడా మనిషే. యవ్వనంలోవున్న పురుషుడే. ఆ ఆకర్షణను తాను తట్టుకోగలగటమేకాక నన్ను పతనం కాకుండా కాపాడారు. సరే! మాస్టారు వెళ్ళిపోయాక నాలుగురోజులు మనసు మనసులో లేదు. ఆయన ఉత్తరాన్ని ఎన్ని వందలసార్లు చదివానో లెక్కలేదు. మాస్టారు నేను స్కూలు ఫస్టు రావాలని ఆశించారు. ఆయన కోరిక తీర్చాలి అని మనసు చిక్కబట్టుకుని, పట్టుదలగా చదివాను.

''స్కూలు ఫస్టు వచ్చావా శ్యామూ!''

''ఆహా! స్కూలుకే కాదు. మా జిల్లాకే ఫస్టుగా వచ్చాను. లెక్కల్లో నూటికి నూరుమార్కులు వచ్చాయి. అప్పటివరకు మెడిసిన్ చదవాలని అనుకున్న నేను పియూసీలో యమ్.పి.సి. గ్రూపు తీసుకున్నాను. ఫిజిక్సులో నేను డాక్టరేటు చేశానంటే, దానికి తొలిమెట్టు వేసింది వాసుమాస్టారే. వయసు ప్రభావంవల్ల ఎన్నోసార్లు తాత్కాలిక ఆకర్షణలకు లోనయిన మాట నిజం. కానీ, ప్రతిసారీ మాస్టారి వుత్తరం నన్ను వెన్నుతట్టి హెచ్చరించేది.

'తొలివలపు' రాజ్యలక్ష్మి టీచర్‌కి శాపమయితే, నాకు వరమయింది రావ్ అయితే అది నేను అభిమానించిన వ్యక్తి ఔన్నత్యంవల్లనే సాధ్యమయింది. నీ కూతురు ప్రేమించాననుకుంటోన్న టీచర్ ఎటువంటివాడో మనకు తెలియదు. అసలు మిషనరీ స్కూల్లోకి ఈ లెక్కలపంతులు ఎలా వచ్చాడు రావ్?''

''వీళ్ళకు ఆశ ఎక్కువకదా! సెంట్రల్ సిలబస్‌ని అమలు చేస్తున్నారు. విద్య పేరుతో యిప్పుడు అందరూ వ్యాపారమేకదా చేస్తున్నది. చవుకలో వస్తారని బియ్యే, యమ్మే పాసయి పెళ్ళికోసం ఎదురుచూస్తోన్న అమ్మాయిలను అపాయింట్ చేసుకున్నారు. తెలుగు మీడియంలో బియ్యే పాసయిన ఆ అమ్మాయిలు ఈ పదవ తరగతి విద్యార్థినులకు యింగ్లీషులో లెక్కలు చెప్పలేకపోతున్నారు. అందువల్ల పాసయ్యేవాళ్ళశాతం బాగా పడిపోయింది. దానిని పెంచేందుకు యిదుగో యిప్పుడు నీ కూతురు మనసుపడ్డ ఈ యువకిశోరాన్ని తెచ్చుకున్నారు'' శ్యామల చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపోయింది.

''రావ్! వాసు మాస్టారు నన్ను బాగా చదువుకోమ్మా శ్యామలా! అన్నారు. ఇరవై అయిదేళ్ళు రానిదే పెళ్ళి గురించి ఆలోచించవద్దన్నారు. కానీ నలభై సంవత్సరాలు వచ్చినా చదువుకుంటూనే ఉండమ్మా! పదిహేనేళ్ళు వచ్చిన నీ కూతురిని పట్టించుకోకమ్మా! అనలేదుగా. రావ్! ఆడపిల్లకు తల్లి చాలా అవసరమయ్యే వయసిది. దానిని గురించి నీకు తెలిసినదానిలో పదోవంతు నాకు తెలియదు. యిన్నాళ్ళూ నీ మంచితనాన్ని అలుసుగా తీసుకుని నేను చాలా బాధ్యతారహితంగా ప్రవర్తించాను. చాలా తప్పుచేశాను. కొన్నాళ్ళు నేనీ ఫిజిక్సు పరిశోధనావ్యాసాలు పక్కనపెట్టి నా కూతురి విషయం చూసుకోదలుచుకున్నాను. ఇప్పటికే చాలా ఆలస్యం చేశాను''

రావ్ మాట్లాడలేదు.

''సరేగానీ రావ్! నువ్వీ వయసులో ఎవరినయినా ప్రేమించావా?''

రావ్ పెద్దగా నవ్వేశాడు.

''అబ్బో! అడక్కు... నీలాగ ప్రేమకు ఒక నవలచొప్పున చెప్పాల్సివస్తే నలభై యాభై నవలలు చెప్పాలనుకో. నాకు పదహారేళ్ళు వచ్చిన దగ్గర్నుండీ నువ్వు తగిలేవరకూ కల్సిన ప్రతి అమ్మాయినీ ప్రేమించినట్టే అనుకో. అందులో నేను జెండర్‌కే తప్ప వయసుకి పెద్ద ప్రాధాన్యత యివ్వలేదేమో. 'ఎనీ వుమన్ బిట్వీన్ సిక్స్‌టీన్ అండ్ సిక్స్టీ చలేగా' లైవులో ప్రేమించేశాను.

శ్యామల భర్త జుట్టు గట్టిగా పట్టి లాగింది. ''మరి యిప్పుడు?'' అని చెవులో గుసగుసలాడింది. అతను సమాధానంగా ఆమె నడుము చుట్టూ చెయ్యి వేసి ఆమె ఒడిలో తల దాచుకున్నాడు.

తూర్పున సూర్యోదయం అవుతూవుంది!






స్విట్జర్లాండులోని కోనీలాండ్ మెరీన్ పార్కులోని ఓ ట్యాంకులో స్వేచ్ఛగా తిరుగుతూ వేలాది సందర్శకులను ఆకర్షిస్తున్న షామూ అనే తిమింగలం వర్కింగ్ హాలీడే పేరుతో రెండేళ్ళపాటు అర్జెంటీనాలో నివశించడానికి బయలుదేరింది. ఈ ప్రయాణం షామూకి హుషారుగానే వుందేమోగానీ దాన్ని అహర్నిశలూ కంటికిరెప్పలా చూసుకునే దాని అసిస్టెంటూ, ఆ పార్కు యజమాని కూతురూ అయిన క్లారాగాసర్‌కి మాత్రం భరించలేని దుఃఖాన్ని కలిగిస్తోంది ఈ ఎడబాటు. ఇన్నాళ్ళూ దాని వీపుమీద పడుకుని ట్యాంకు చుట్టూ దానితో పాటు తిరుగుతూ కేరింతలు కొట్టే క్లారా సందర్శకులకు అదనపు ఆకర్షణగా వుండేది. ఈ రెండేళ్లూ అర్జెంటీనాలోని మారెడెల్ ప్లాటాలో, అక్వారమా మెరీన్ పార్కులో వుంటుంది. దాని రక్షణకోసం వాళ్ళు ఎన్నో జాగ్రత్తలు తీసుకోవలసివుంది. పూల్‌లోని నీటి ఉష్ణోగ్రత ఎప్పుడూ 12 డిగ్రీల సెల్సియస్ వుండాలి. అసలు కోనీలాండ్ పూల్‌నుంచి దాన్ని ఎయిర్‌పో





# తిమింగలానికి కన్నీటి వీడ్కోలు

ర్టుకి తీసుకెళ్లడమే ఓ యజ్ఞం. ముందుగా టాంకులోని నీళ్లన్నీ అతినెమ్మదిగా బయటకు వదిలి క్రేన్‌ల సాయంతో దాన్ని మెల్లగా బయటకుతీసి మరో పూల్‌లా భ్రమ కలిగించే ఓ సింథటిక్ పోమ్ వున్న తొట్టెలో దీన్ని వుంచాలి.

ృ భాగానికి పెట్రోలియం జెల్లీ బాగా పులిమి మొప్పలు మాత్రం బయటకు వుండేలా చూసి మిగతా శరీర భాగమంతా మెత్తని గుడ్డతో కప్పాలి. ఇలా అనేక కట్టుదిట్టమైన చర్యలతో దాన్ని అర్జెంటీనా పంపడమైతే పంపారుగానీ, దాన్ని ఆరోప్రాణంగా భావించే క్లారాను మాత్రం ఎవరూ ఊరడించలేకపోయారు.

# చతుర కథలు

## కన్సొలేషన్ బహుమతి

వరహాలు ఏడాదిన్నర క్రితమే సైకిలు కొన్నాడు. వరహాన్నర ఎత్తు చేసే సైకిలు మన్నికలో, నాణ్యతలో చెక్కుచెదరని గొప్ప సైకిలు. ఆ సైకిలంటే వరహాలుకీ, అతని భార్యకూ కూడా ఎంతో మక్కువ.

అలాటి సైకిలు కాస్తా మాయమయింది. హొటల్ వాసంతిలోకి వెళ్ళి, అలా కాఫీ మాత్రమే తాగి, ఇలా బయటి కొచ్చాడో లేదో, జరగరాని ఘోరం జరిగిపోయింది. మాయమైన సైకిల్ని చూసి, లబోదిబో మన్నాడు వరహాలు- అలాగే హాహాకారాలతో రక్షకభటనిలయాన్ని చేరుకుని కంప్లైంట్ ఇచ్చాడు.

ఆ పోలీస్ స్టేషన్‌వారు వరహాలు ఫిర్యాదు ను ఫైల్లోకి ఎక్కించి, ''పొరపాట్న దొరికితే నీకు కబురు చేస్తాము'' అన్నారు.

''కబురూ కాకరకాయా మీనుండి అందగానే ఇట్టే మీ సమక్షంలో వాలిపోతానండి!'' చేతులు నులుముకుంటూ అన్నాడు వరహాలు.

''మాకేమైనా 'కాకరకాయలు కాసే తోట' ఉన్నదనుకున్నావా? ఆయ్! కబురొక్కటే పంపుతాము. ఎలాగూ గుర్తుచేశావ్, కాబట్టి, ఈసారి వచ్చేటప్పుడు చేతులూపుకుంటూ రాకు! ఓ పది కేజీలు కాకరకాయలు పట్రా! మీ ఇల్లు మార్కెట్టుకు దగ్గరేగా!''



''పది కేజీలే!'' మూర్ఛపోబోయి, ఆపుకున్నాడు వరహాలు. ఒకవేళ తనుమూర్ఛపోతే తొమ్మిది బిందెల నీళ్ళు తనమీద దిమ్మరించి, స్పృహ వచ్చాక, బిందెకు మూడ్రూపాయల చొప్పున వెరశి ఇరవైఏడు రూపాయలు వసూలు చేస్తారేమోనని భయంవేసి!

అటుతర్వాత పోలీసు ఠాణాకు వెళ్తున్నప్పుడల్లా, ఏవో ఒక కూరగాయల్ని, మార్కెట్టుకి దగ్గర్లోనే ఉన్న నేరానికి కొని, సదరు ఎర్రటోపీల వారికి ఇచ్చుకుంటూనే వచ్చాడు.

వరహాలు ''తను ఠాణాలో సమర్పించుకుంటున్న ముడుపులు ఠికాణా లేకుండా పోతున్నాయే!'' అని లోలోన దిగులుపడసాగాడు. ఛూత్! దీనికన్న తనకు చిన్నప్పుడు జొరమొచ్చినప్పుడు, తన తల్లి తీసిన దిగదుడుపు అనుకుని సైకిలుపై ఆశ వదిలేసుకుంటే సరిపోతుంది'' అనుకొంటూన్న తరుణంలో...

అనుకోకుండా పొరపాట్న దొరికేసింది పోలీసువారికి ఆ సైకిలు, తత్‌చోర శిఖామణితోసహా! ''పోయిన వస్తువు దొరికి, తన వలనే సాధించబడిందే!'' అన్న అమితానందంతో ఎగిరిగంతేసిన ''బీటురాయుడు'' వరహాలికి కబురంపాడు సైకిలట్టుకెళ్ళమంటూ.

సదరు సంతోషవార్తను వినగానే ఇంటి నుండి పోలీస్‌స్టేషన్‌కి వాయువేగంతో ఆఘమేఘాలమీద వచ్చాడు వరహాలు. కానీ పోలీస్‌స్టేషన్‌లో తన వాహనరాజాన్ని చూడగానే వాతరోగం కమ్మినంత పనయింది వరహాలుకి.

''ఏమండీ! ఇది నా సైకిలేనా?'' దొంగగారిని బెరుకుబెరుగ్గా అడిగాడు. ''ఛల్ నీయవ్వ! అది నీది కాబోతే నాదన్కున్నావా? నాదనే వస్తువేదీ నా దగ్గర ఉండదు. నా వృత్తిమీద ఒట్టేసి చెప్తున్నా!'' అన్నారు చోరశ్రీగారు.

''మరి... మరి... ముందు ఒక లైటు అనే పదార్థం ఉండాలండి!''

''లైటే! దాన్ని బెడ్‌లైట్‌గా వాడుకొంటానని అడిగితే మా బావమరిదికి ఇచ్చేశా!'' తన ఉదారబుద్ధిని దొంగ కాలరెగరేస్కుంటూ చెప్పాడు.

''మరే... మీది చాలా గొప్పమనసండీ! కాబట్టే, అంత ఉదారంగా దానంచేయగలిగారు. మరి, వెనక క్యారేజీ ఉండాలండీ! నాకేదో దృష్టిదోషం సంక్రమించి కనబడటం లేదనుకుంటాను''

''దృష్టిదోషమూ లేదూ గాడిద గుడ్డూ లేదు ఆ క్యారేజీని ఊడదీసి, మా పిల్లలు అట్లతద్ది ఉయ్యాలలు కట్టేస్కున్నారు''

''మీ పిల్లలిది మంచి స్పోర్టివ్ నేచరండీ!'' ఏడుపు మొహంతో మెచ్చుకున్నాడు వరహాలు.

''మళ్ళీ మళ్ళీ అడక్కు! నాకు విసుగు. ఒక్కసారే చెప్పేస్తున్నావిను! ఈ హ్యాండిల్ బార్‌ని మా ఆవిడ బట్టలు తగిలించుకునే హ్యాంగర్‌గా పుచ్చేసుకుంది. ముందు చక్రాన్ని మా తమ్ముడు తీస్కెళ్ళిపోయాడు. ఇయాళ వాడు ''కురుక్షేత్రం'' డ్రామాలో ఎవుడిపైనో చక్రం ఎత్తే కృష్ణుడి పోర్షను వేయాల్సుంది. సాయంత్రం ఆ నాటకం నువ్వు కూడా చూసి, మా తమ్ముడు బాగా వేశాడని, నాతో చెప్పాలి. తెల్సిందా!''

''చిత్తం! చిత్తం!'' చేతులు నులుముకుంటూ, అన్నాడు వరహాలు- కన్సొలేషన్ బహుమతిగా, తిరిగిదొరికిన తన ద్విచక్రవాహనాన్ని చూసుకుని, కళ్లు తుడుచుకుంటూ.

పి. కుసుమకుమారి

---

## న్యాయం

**ఆ**టో దిగి పరుగులాంటి నడకతో బస్టాండులోకి ప్రవేశించాను. 'మదనపల్లె- అనంతపురం' అన్న బోర్డు ఉన్న బస్సు చూడగానే ప్రాణం లేచివచ్చింది. అంతవరకు నేను అనుభవించిన టెన్షన్ అంతా చేతితో తీసివేసినట్లు పోయింది.

నెమ్మదిగా వెళ్ళి, బస్సు ఎక్కి, కిటికీ వైపుగా సీటు చూసుకొని కూచున్నాను. మొహాన పట్టిన చెమట తుడుచుకుంటూ చుట్టూ పరికించాను. బస్సు బయలుదేరడానికింకా టైముంది గాబోలు- అయిదారు మంది కంటే లేరు ప్రయాణీకులు.

ఎందుకైనా మంచిదని ముందు సీట్లోని వ్యక్తిని అడిగాను, ''ఎన్నింటికి బయలుదేరు



తుందండీ బస్సు?'' అని.

''ఒకటిన్నరకి''

టైము చూసుకున్నాను. ఒకటీ ముప్పై రెండు.

సాయంత్రం అయిదున్నరకల్లా వస్తాననీ, పేషెంట్లను కూచోపెట్టమని చెప్పొచ్చాను క్లినిక్ బాయ్‌కి. ఆరుగంటలు దాటాక కూడా రాక పోతే, పేషెంట్లను పంపేసి క్లినిక్ కట్టేయమని చెప్పాను.

మళ్ళీ టైము చూశాను. ఒకటీ ముప్పై ఆరు. డ్రైవరూ, కండక్టర్ల జాడలేదు. మళ్ళీ టెన్షన్ పెరగసాగింది నాలో. ఇక ఉండలేక బస్సు దిగి డ్రైవర్ కోసం వెతక నారంభించాను.

బీడీ తాగుతూ, ఖాకీ బట్టల్లో ఉన్నవ్యక్తి బస్సు వెనకాతల కనిపిస్తే, వెళ్ళి వాకబు చేశాను. అతనే ఆ బస్సు డ్రైవరు.

''కొద్దిగా పక్కకు వస్తారా?'' అభ్యర్థించాను.

కొద్దిగా ఆశ్చర్యపడుతూ, తాగుతున్న బీడీ ముక్క చివరి దమ్ములాగి అవతల విసిరేసి నాతోపాటు వచ్చాడు.

''చూడండి... నేనో డాక్టర్ని. అనంతపురంలో ప్రాక్టీస్ చేస్తున్నాను. స్నేహితుడి పెళ్ళికని వస్తే అనుకోకుండా ఆలస్యమైపోయింది. సాయంత్రం అయిదున్నరకల్లా అనంతపూర్ చేరుకోవాలి. లేకపోతే పేషంట్లు ఇబ్బంది పడతారు. అందుకు మీ సహాయం కావాలి'' అన్నాను.

''నే నెలా సహాయ పడగల్నుసార్?'' ఎరగనట్టే అడిగాడు.

''మీరు తలచుకొంటే అయిదుగంటలకే తీసికెళ్ళవచ్చు...''

''అదెలా సాధ్యం సార్. ఆర్టీసి బస్సు నలభై కిలోమీటర్లు వేగం మించి పోదు. అదీకాక ప్రతీ స్టాప్‌లోనూ టీ తాగడం అలవాటు నాకు'' బెట్టు చేశాడు.

'మీ ఆర్టీసీ డ్రైవర్లకున్న అలవాటే అది' అని మనసులో అనుకొని ''అందుకే గదా మిమ్మల్ని పక్కకు తీసుకువన్న'' అని పర్సు లోంచి పదిహేను రూపాయలు తీసి అతని




చేతిలో పెట్టాను. సంభ్రమంతో అతని ముఖం వెలిగిపోయింది. బహుశ అంత పెద్ద మొత్తం ఎవరూ ముట్టచెప్పలేదేమో.

''మీరు బస్సెక్కి కూర్చోండి సార్. కండక్టర్ని తీసుకొని క్షణంలో వస్తాను'' అంటూ కంట్రోలర్ వైపు పరిగెత్తాడు.

''అంతా తైలం మహిమ' అని చిన్నగా నవ్వుకుంటూ వెళ్ళి, బస్సు ఎక్కబోతుండగా ''కొద్దిగా తప్పుకుంటారా సార్'' అని వినబడితే పక్కకు తప్పుకొని చూశాను. ఎవరో యిద్దరు వ్యక్తులు టీవీని కాబోలు మోసుకుంటూ వెళ్ళి ముందు సీటు అంతా ఆక్రమించేశారు.

మరి కాస్సేపటికి కండక్టరు, డ్రైవరు కూడా విడిగా వచ్చారు.

బస్సు కదిలింది. కండక్టరు టికెట్లు కొట్టేసరికి బస్సు మదనపల్లె దాటేసింది. రాత్రంతా నిద్రలేదు. కిటికీ అద్దానికి తల ఆనించి నిశ్చింతగా నిద్రకుపక్రమించాను.

మళ్ళీ మెలుకువ వచ్చి టైము చూసేసరికి నాలుగుంబావు అయింది. పక్కన కూర్చున్న వ్యక్తిని అడిగాను.

''బస్సు కదిరి దాటిందాండీ?''

''కదిరా నా బొందా... ఇప్పుడే తనకల్లు దాటింది. దీనికంటే ఎద్దుల బండి నయం. త్వరగా చేరుకొనే వాళ్లం'' చిరాకుపడుతూ చెప్పాడా వ్యక్తి.

గుండెల్లో రాయి పడ్డట్టయింది నాకు. నిజమే! బస్సు నెమ్మదిగా వెళుతూంది. నాకు చిరాకేసింది. ఈ ప్రకారం వెళితే అనంతపురం చేరేసరికి తప్పకుండా ఏడుగంటలవుతుంది. తను పడ్డ శ్రమఅంతా వృధా అవుతుంది.

మరో పావుగంటకు కదిరి బస్టాండులో ఆగింది బస్సు. డ్రైవర్ దిగి టీ తాగుతున్నాడు. దగ్గరికి వెళ్ళి బాగా చివాట్లు పెట్టాను. చివర్లో ''కనీసం ఆరు గంటలకయినా అనంతపురం చేర్చు'' అని చేతిలో మరో అయిదు రూపాయ లుంచాను. మాట్లాడకుండా తీసుకొని, వెంటనే బస్సు బయల్దేరదీశాడు. కాని షరామామూలే. నెమ్మదిగానే వెళుతూంది బస్సు. నాకు తల తిక్కగా ఉంది... నా ఆత్రానికి విరుద్ధంగా బస్సు అనంతపురం చేరేసరికి ఆరూముప్పావు అయింది. మధ్యమధ్యలో ప్యాసెంజర్లు ఎగి, బస్సుస్టాండు చేరేసరికి ఏడయింది. దగ్గరే క్లినిక్. కాని ఏం లాభం?

అంతవరకూ రెస్ట్‌లెస్‌గా గడిపిన నాకు పట్టరాని కోపం వచ్చింది.

బస్సు దిగుతున్న డ్రయివర్‌తో ''ఏమయ్యా ఇంత మోసం చేస్తావా?''

''నేనేం మోసం చేశాను సార్?'' తెలివిగా ఆశ్చర్యపడ్డాడు.

''అయిదున్నరకల్లా తీసుకొస్తానన్నవాడివి గంటన్నర లేటు చేశావు. మోసం కాదా?''

''సారీ సర్. స్పీడుగా రావాలనే అనుకొన్నా నుగానీ టీ.వి. పాడవుతుందని నెమ్మదిగా రావ ల్సివచ్చింది''

''టీ.వి.పాడవటమేమిటి'' ఆశ్చర్యంగా అడిగాను.

''అదేసార్ స్పీడుగా వెళ్ళమని పదేహేను రూపాయలిచ్చి మీరటు వెళ్లారుగదా. మరోవ్యక్తి వచ్చి, ఫ్రెండెవరో సాదీ వెళుతూ కలర్ టివి చౌకగా అమ్ముతుంటే పట్టుకొచ్చానని చెప్పి స్లోగా నడపమనీ, లేకపోతే టి.వి. పాడవు తుందనీ చెప్పి ముప్పై రూపాయలు చేతిలో పెట్టాడు. పదిహేనుకంటే ముప్పై ఎక్కువే గదా సార్. అందుకే అతనికి 'న్యాయం' చేయడానికి...''

చెప్పుకుపోతున్నాడు డ్రైవరు. నేను మాత్రం తెరచిన నోరు అలానే ఉంచి చూస్తుండిపోయాను.

**డా. బలరామిరెడ్డి**

## టెన్షన్

'సుబ్బారావీమధ్య ఎందుకో చాలా డల్‌గా కనిపిస్తున్నాడు' అనుకున్నాడు గుర్నాథం.

అదేమాట పక్కసీటు రత్నంతో అంటే, ''అవునోయ్! నాకూ అలాగే అనిపిస్తోంది. పోనీ... 'ఏమిటయ్యాకారణం' అని అడిగితే 'అబ్బే ఏం లేదండీ! నాకే నేను బాగానే వున్నాను' అన్నాడు మొన్న'' చెప్పాడు రత్నం.

''ఏమో! నాకయితే ఏదో గట్టికారణమే

వుందనిపిస్తోంది. లేకపోతే మన స్టాఫ్ అందర్లో కీ హుషారుగా వుండేది ఈ సుబ్బారావేగదూ'' సాగదీశాడు గుర్నాథం.

''ఇంకా నెమ్మదిగా చెబుతావేమిటయ్యా! లంచ్ అవర్లో అతను వేసే జోకులకి కడుపుబ్బి చచ్చేవాళ్ళం కాదూ'' నిర్ధారించాడు రత్నం.

''అవునవును... ఇంటికెళ్లాక కూడా నాకవే జోకులు గుర్తొచ్చి నాలో నేను నవ్వుకుంటూంటే మా ఆవిడ 'ఏమిటా నవ్వు! మెంటల్ పే షెంట్‌లా అని తిట్టేది కూడానూ'' అన్నాడు గుర్నాథం

''ఇంతకీ ఈ విషయం గమనించావటోయ్ గుర్నాథం. సుబ్బారావసలు లంచ్ బాక్సే తేవ ట్లేదీమధ్య. అదేమిటని అడిగితే 'ఇంటికెళ్ళివ స్తున్నానుగా' అని చెపుతున్నాడు.'' మరో కొత్త విషయాన్ని వెల్లడించాడు రత్నం. అంతలో లంచ్ అవర్ కావటంతో పైళ్ళు పక్కనపెట్టి వీరి చర్చలో తనూ పాలుపంచుకున్నాడు రామ దాసు.

''ఏమిటండీ ఏమిటో సుబ్బారావంటున్నా రు. ఏమయిందట ఆయనకీ. ఇదివరకు విష్ చేస్తే హలో అనడమేకాక కుశలప్రశ్నలు కూడా వేసేవాడు. ఇప్పుడసలు కన్నెత్తికూడా చూ డడం లేదు. ఏదో పరధ్యాన్నంగా దిగులుగా కనిపిస్తున్నాడు'' అన్నాడు రామదాసు.

''అదేనయ్యా! దాన్ని గురించే ఆలోచి స్తుంటా. అందరినీ నవ్విస్తూ, నవ్వుతూ హుషా రుగా వుండే సుబ్బారావిలా అయిపోవడం ఏం బాగోలేదు. అతని సమస్యేమిటో కనుక్కొని దాని పరిష్కారం ఆలోచించడం తోటి ఉద్యోగ స్థులుగా మన కర్తవ్యం'' అన్నాడు గుర్నాథం.

''చెప్పండి... ఏం చేద్దాం'' అన్నారు మిగి లిన ఇద్దరూ.

''ఆఫీసులో అయితే అతను విషయాలన్నీ చెప్పకపోవచ్చు. రేపు మన ముగ్గురం ఆఫీసు టైముకి ఓ గంట ముందుగానే వాళ్ళింటికి వెళ్ళి, వాళ్ళావిడ కూడా వుండగా అసలు విషయమేమిటో కనుక్కుందాం'' అన్నాడు గు ర్నాథం.

దానికి మిగతా ఇద్దరూ ఓ.కే. అనడంతో మర్నాడు సరిగ్గా 9.30కి ముగ్గురూ సుబ్బారా వింటికి బయలుదేరారు. దార్లోనే ఓ స్వీటు షాపులో స్వీట్లు కొంటూ కనిపించాడు సుబ్బా రావు.



"అరే! మన సుబ్బారావడుగోనరా! పొద్దున్నే స్వీట్లు కొంటున్నాడేమిటీ! సరే! కలిసేవెడదాం పదండి" అన్నాడు గుర్నాథం.

వీళ్లని చూడగానే సుబ్బారావు మొహం చాటంతయింది. రెండు నెలలుగ్గా మటుమాయమయిన నవ్వు ఒక్కసారిగా స్విచ్ వెయ్యగానే వెలిగే లైటులా మొహమంతా ఆక్రమించింది.

"ముగ్గురూ కలిసి ఎక్కడికోగానీ బయలుదేరారే! కొంపదీసి ఆఫీసుకు సెలవేం కాదుగదా! ఇవ్వాళ మీకందరికీ ఈ స్వీట్లు తినిపించి, ఓ శుభవార్త చెప్పాలనుకున్నానే" అన్నాడు సుబ్బారావు హుషారుగా.

తెల్లమొహాలు వేసిన ముగ్గురూ ఒకేసారి అడిగారు "ఏమిటదీ?" అంటూ.

"ఏముందీ! రెండు నెలలనుంచీ నేను పడుతున్న టెన్షన్ నిన్న సాయంత్రంతో వదిలింది తెలుసా! ఇపుడే కాస్త ఊపిరి పీల్చగలుగుతున్నాను. ఎల్లాగయితేనేం మా వీధిలోనే ఉన్న ప్రఖ్యాత 'రెడ్‌రోజ్' స్కూల్లోనే మా అబ్బాయికి ఎల్.కేజీలో సీటు సంపాదించాను. ఎన్ని రికమండేషన్లు చేయించాల్సొచ్చిందో తెలుసా?" అన్నాడు సుబ్బారావు అందరికీ స్వీట్లు పంచుతూ.

రాధాశివమోహన్

---

## గ్రేట్‌లేడీ

కాలింగ్‌బెల్ మోగింది.

తలుపు తీసిన రాజ్యలక్ష్మికి గుమ్మంలోనే నవ్వుతూ కన్పించింది విమల.

"హాయ్... ఇది నిజమా? కలా?" అంటూ ఆశ్చర్యానందాలు మేళవించిన గొంతుతో స్నేహితురాల్ని కావిలించుకున్నంతపని చేసింది రాజ్యలక్ష్మి.

"సరేలేవే... ఏంటి కబుర్లు? ఇంట్లో ఎవరూ లేనట్లుందే...?"

"ఆయనగారు ఆఫీసుకీ... పిల్లలు స్కూలుకీ వెళ్ళారు. అవునూ ఈ చీరెక్కడ కొన్నావే... బ్రహ్మాండంగా ఉంది" విమల కట్టుకున్న చీర వంక మెచ్చుకోలుగా చూస్తూ అంది రాజ్యలక్ష్మి.

"తమిళనాడు హాండ్‌లూమ్ ఎగ్జిబిషన్ పెట్టారుకదే... అక్కడ తీస్కొన్నా. సరేగానీ, ఏంటీ రాజ్యం ఇల్లంతా ఏదో కొత్తకొత్తగా కనబడుతోంది. ఏంటి కత?" అంది విమల ఇంటిని నలువైపులా పరికించి చూస్తూ.

"అబ్బే... ఏంలేదు! ఈమధ్య పి.యఫ్ లోన్ పెట్టి ఈ డబుల్‌కాట్ బెడ్, అదుగో ఆ ఫ్రిజ్ కొనుక్కొచ్చారాయన" ముసిముసి నవ్వులు నవ్వుతూ అంది రాజ్యలక్ష్మి.

"ఇంతకీ కబుర్లేనా? మా ముఖాన ఓ కప్పు కాఫీ పోసేదేమైనా ఉందా?" కోపం నటిస్తూ తల ఎగరేసింది విమల.

ఆ విసురుకు ఆమె ముక్కుకున్న ఒంటిరాతి ముక్కుపుడక జిగేల్‌మని మెరిసింది.

"అరే... ఈ ముక్కుపుడక ఎప్పుడు చేయించావే?" రాజ్యం గొంతులో ఆశ్చర్యం.

"అయిదు రాళ్ళ బేసరి పెట్టుకుంటే అమ్మమ్మలా ఉంటావని అంటూ మొన్న మేరేజిడేకి ఆయన దీన్ని ప్రెజెంట్ చేశారు"

"రావే కిచెన్‌లోకి! ఎంచక్కా ఇద్దరం అక్కడే కబుర్లాడుకుంటూ కాఫీ తాగేద్దాం" అంటూ వంటింట్లోకి దారితీసింది రాజ్యలక్ష్మి. ఆమెను అనుసరించింది స్నేహితురాలు.

"ఇదేంటే... ఈ పోనీటెయిల్ ఏమిటీ? ఇంకా కాలేజి స్టూడెంట్‌ననుకుంటున్నావా?" కుచ్చులా వేళ్లాడుతున్న స్నేహితురాలి పొట్టి జుట్టును చూస్తూ ప్రశ్నించింది విమల.

"ఏం చేయమంటావే? 'పొడుగ్గా పెద్ద జడ వేసుకుంటే పాతసిన్మా హీరోయిన్లా ఉన్నావ్' అని మావారు ఒకటే సాధింపు. దాంతో బ్యూటీ పార్లర్‌కి వెళ్ళి ఇలా చేయించుకోకతప్పలేదు"

"ఎంతైనా మీ ఆయన రసికుడేనే?" నవ్వుతూ కాంప్లిమెంట్ యిచ్చింది విమల.

"అక్కడికి మీఆయన మహా బుద్ధిమంతుడైనట్లు!" కాఫీ కలుపుతూ సన్నగా నవ్వింది రాజ్యలక్ష్మి.

"అవునే... ఈ గ్రైండర్ ఎప్పుడు కొన్నారు... పాతది అమ్మేశారా?"

"లేదే. మొన్న మా పెద్దన్నయ్య వచ్చినపుడు 'ఇంకా ఈ పాత గ్రైండర్‌తో ఏం అవస్థ పడతావమ్మా' అని తనే దాన్ని బజారుకు తీసుకుపోయి ఎక్స్‌ఛేంజ్ చేసి కొత్తది పట్టుకొచ్చాడు" గర్వంగా అంది రాజ్యలక్ష్మి.

అంటూనే విమల చేతివంక పరిశీలనగా చూస్తూ, "అన్నట్టు ఈ రిస్ట్‌వాచి ఎప్పుడు తీసుకున్నావే... చాలా బావుంది" అందామె.

"మా తమ్ముడు బొంబాయి వెళ్ళాడీమధ్య. వచ్చేప్పుడు నాకోసం ప్రత్యేకంగా పట్టుకొచ్చాడిది" తన రిస్ట్‌వాచ్‌వంక మురిపెంగా చూస్తూ చెప్పింది విమల.

అలా ఆ కబురు, ఈ కబురు చెప్పుకుంటూ మిత్రురాళ్ళిద్దరూ సాయంత్రందాకా గడిపారు.

"అబ్బో! అప్పుడే నాలుగైపోయిందే... ఇక వెళ్తానే చాలా ఆలస్యం అయింది" అంటూ మిత్రురాలివద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయింది విమల.

★ ★ ★

"అమ్మా... నాన్నగార్ని సాయంత్రం హాస్పిటల్‌లో చేర్పించాలి, అంటీవాళ్ళ ఫ్రెండ్స్‌నెవర్నో కారడిగి తెస్తానని వెళ్ళావ్‌గా... తెచ్చావా? హాస్పిటల్ టైం అయిపోతోంది..." విమలని గుమ్మంలోనే నిలబెట్టి అడిగాడు కొడుకు సురేష్.

"అయ్యో నామతి మండ... ఆ విషయమే మరచిపోయానురా! అక్కడికీ సాయంత్రందాకా అక్కడే తగలడ్డానా?... ఈ సంగతే గుర్తుకు రాలేదు..." వాపోయింది విమల.

భార్య జవాబు వింటూనే మంచంలోనున్న ఆమె భర్త స్పృహతప్పాడు.

ప్రతాపచంద్ర




# లేడీస్ లాయర్‌పై సమీక్షలు



ఏప్రిల్ 'చతుర'లో ప్రచురితమైన కాశీవిశ్వనాథ్ నవల 'లేడీస్ లాయర్'పై పాఠకులనుండి అందిన సమీక్షలలో ఉత్తమంగా భావించిన ఆరింటిని ఎన్నికచేసి అందిస్తున్నాం.

## ఇది సంభవమా?

*(ప్రథమ బహుమతి రూ. 100/-లు పొందిన సమీక్ష)*

**లే**డీస్ లాయర్ నవల స్థూలంగా చాలా బావుంది. గానీ పాత్రల సంభాషణలు కొన్ని మరీ సినిమాటిక్‌గా వున్నాయి. ఉద్యోగిని అంటే వెలయాలు అనుకునే భానుమూర్తిని సింధుజ చెప్పుదెబ్బ కొట్టడంలాంటి సంఘటనలు కథలకే పరిమితం కాకుండా నిజంగా జరిగితే బావుండుననిపించాయి. అలాగే సరిపడా డబ్బు చెల్లించకపోయినా ఎస్టీడీ కాల్ బుక్ చేయనిచ్చి ఆ రాత్రికి ఆశ్రయమివ్వడం, లాయర్ మధులత గుంటూరునించి విశాఖపట్నం వచ్చి సింధుజ కేసు బాధ్యత తీసుకోవటం, స్వతహాగా మంచివాడైన ప్రభాకర్‌ని తండ్రి ప్రభావంనుంచి బైటపడేయటం మొదలైనవి కూడా.

మనందరిముందే ఎన్నెన్నో సంఘటనలు జరుగుతున్నాయి. ఎవరికివారే కల్పించుకుంటే మనకేం ముప్పో అనుకుంటున్నారే తప్ప సాయం చేస్తాం అని ముందుకు వచ్చేవారే కనపడరు. అందుకే ఈ నవల్లో యస్.పి. ఉషారాణి అన్నట్లు ఊరికొక 'ఆంటీ' ఐనా వుండాలి. లాయర్ మధులత... పూర్వాశ్రమంలో పెద్దగా చదువుకోని ఒక సాధారణ స్త్రీ ఎంతో దీక్షగా చదివి, మరెంతో జాగ్రత్తగా ప్రాక్టీస్ చేస్తేనే పేరు తెచ్చుకోగలిగింది. భర్త విడాకులిచ్చాడంటే క్రుంగిపోయే స్త్రీలేగానీ ధైర్యంగా నిలబడేవారు ఎందరీ రోజుల్లో.

చదువుకుని ఉద్యోగాలు చేస్తున్న చంద్రమౌళి, భానుమూర్తిల దృష్టిలో భార్యల విలువ ఎంతో- ప్రాణంలేని నబ్బు, భార్య ఒకటే అనే చదువులేని మూర్ఖుడు మట్టయ్య దృష్టిలోనూ అంతే. అలాగే ఎంత లాయరైతే మాత్రం, ఒకప్పటి భార్యేగదా! పిలవగానే వచ్చేస్తుంది అనుకున్నాడు జడ్జి రంగనాథం. వీళ్ళందరి దృష్టిలో వున్న ఆ చులకన భావానికి కారణం ఏమిటి అంటే 'ఆడది' అనే ఒక్క మాట జవాబు. ఇలాంటి అభిప్రాయాలతో వున్న మగవాళ్ల గురించి, వాళ్ళకి తగిన శాస్తి జరిగితే అన్నపూర్ణలాంటి స్త్రీలు 'నరకాసుర వధ'ను స్మరణకు తెచ్చుకోవటం (ఇంకా మనమధ్య

జరగకపోయినా) అతిస్వాభావికం. ఇటువంటి వారిలో మార్పు రావాలనే తపన అంతర్గతంగా నవలంతా కనిపిస్తూనేవుంది. అందుకు రచయిత అభినందనీయులు.

పోతే పోలీసులు ధర్మరక్షణ వదలి నేరస్తులతో చేతులుకలపటం అనేది ఇటీవలి నవలల్లో, సినిమాల్లో తరచు చూస్తున్నాం. ద్వంద్వార్థాల సినిమాలు చూస్తున్నారు గాబట్టి తీస్తున్నాం అని నిర్మాతలు, తీస్తున్నారు గాబట్టి చూస్తున్నాం అని ప్రేక్షకులు అంటున్నట్లే... ఎలాగూ మా గురించి ప్రజల్లో ఈ అభిప్రాయం వున్నప్పుడు మనం నిజాయితీగా వుండి లాభం ఏమిటి? వచ్చిన పేరు పోతుందా అనే అలసత్వం పోలీసువారిలో కలగకుండా వుండాలంటే- ''చంద్రమౌళి''లాంటి పాత్రల చిత్రీకరణ ఆపివేయాలి.

-సాధనాల నాగవర్ధని,
రెడ్డిగూడెం

## ఆదర్శవంతమైన పాత్ర

*(ద్వితీయ బహుమతి రూ. 75/-లు పొందిన సమీక్ష)*

వైవిధ్యమున్న ఇతివృత్తాలతో పాఠకులను స్పందింపచేసే విశ్లేషణతో కూడిన రచనలను ప్రచురించడంలో 'చతుర' ఎప్పుడూ తన ప్రత్యేకతను నిలుపుకుంటున్నది.

'లేడీస్ లాయర్'లో రచయిత సమాజంలో స్త్రీలకు జరుగుతున్న అన్యాయాన్ని కళ్ళకు కట్టినట్లు వర్ణించి ఊర్కోకుండా మధులత పాత్ర ద్వారా అబల ఎలా సబలై వంజా విసరగలదో కూడా నిరూపించారు. సింధుజ పాత్ర చిత్రణ బాగున్నది. చంద్రమౌళి, భానుమూర్తిలాంటి అవినీతిపరులు, అవకాశవాదుల బారినపడి సింధుజలాంటి అమాయకురాలు అపనిందల పాలవటం పాఠకుల్ని కదిలించివేస్తుంది. ఈ సమాజంలో ఇటువంటి సింధుజలెందరో? అటువంటివారి కష్టాలను దూరం చేయాలంటే ప్రతిభ, సమయస్ఫూర్తి గలిగిన మధులత లాంటివారి అండ చాలా అవసరం. ఈ పాత్రను సృష్టించడం ద్వారా రచయిత సమాజంలో ఆ పాత్ర యొక్క ఆవశ్యకతను నొక్కిచెప్పారు. మధులత కోర్టు ద్వారా కాకుండా యుక్తితో ప్రత్యర్థుల ఆట కట్టించినతీరు సినిమాఫక్కీలో నడిచినట్లనిపించినా సమంజసంగానే ఉన్నది. ఇందుకు నిజాయితీపరులైన దయానంద, ఉషారాణీ, రఘుపతిలాంటి వారి సహకారమెంతో ఉంది. నిజజీవితంలో ఇలా ఇంతమంది సహాయం చేసేవారు దొరకటం బహుశా కష్టమేమో! అందరి సమిష్టి కృషి ఫలితంగా మధులత వారిని మార్చగలిగింది. మట్టయ్య పాత్ర దుర్మార్గానికి పరాకాష్ఠ. పురుషాధిక్యత నరనరానా జీర్ణించుకుపోయిన మట్టయ్య కోడలిమీద హత్యాప్రయత్నం చేసి తన పతనాన్ని తానే కొని తెచ్చుకున్నాడు. తండ్రిలాంటి దుర్మార్గుడు కాని ప్రభాకర్ తను ఊహించినదానికి, సింధుజ సహజ స్వభావానికి గల భేదాన్ని సరిగ్గా అంచనావేసి తన జీవితాన్ని సుఖమయం చేసుకోవటానికి దొరికిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకొన్నాడు. నిస్సహాయులైన అబలలకు చేయుతనివ్వడమే తన జీవిత పరమావధిగా మధులత తీసుకున్న నిర్ణయం ఎంతో సబబుగా ఉన్నది.

ప్రతి ఊరిలోనూ మధులతలాంటి 'లేడీస్ లాయర్' కనీసం ఒక్కరుంటే పెడదారి పట్టిన ఎంతోమంది జీవితాలు బాగుపడతాయనే ఊహ కల్గించిందీ రచన. హాస్యసమ్మిళితమైన శైలి పాఠకులను చదివించేదిలాగా ఉన్నది. ఈ రచన కొంతమంది దృక్పథంలోనైనా మార్పు తేగలిగితే రచయిత ఆశయం నెరవేరినట్లే.

-జె.వి. రమణ,
గోదావరిఖని

## ఫాంటసీ

*(మూడవ బహుమతి రూ. 50/-లు పొందిన సమీక్ష)*

బాధ్యతలు తప్ప హక్కులు తెలియని, తెలిసినా అనుభవించలేని అబలలు అసంఖ్యాకంగా ఉన్న ఈ పురుషాధిక్య సమాజంలో స్త్రీని జాగృతం చేయడానికి జరిగే ఏ ప్రయత్నాన్నైనా హర్షించాలి. కాని ఈ నవల వాస్తవానికి చాలా




దూరంగా ఉన్నట్లుంది. నిజజీవితంలో ఓ స్త్రీ ఇన్ని విజయాలు సాధించాలంటే ఎన్ని అవరోధాల్నీ, కష్టాల్ని ఎదుర్కోవాలో చెప్పకుండా కథను నడపడం బాగాలేదు. హీరోయిన్ ఓరియెంటెడ్ తెలుగు సినిమా స్క్రిప్ట్‌లా ఉంది.

వాస్తవ దృక్పథం లోపించిన ఇటువంటి నవలవల్ల స్త్రీల ఈగోని సంతృప్తి పర్చి వారికి తాత్కాలికానందం కల్గించవచ్చేమోగాని ఈ నవలవల్ల వాస్తవజీవితంలో వారికి ఉపయోగ ముండకపోవచ్చు.

నవలలోని దాదాపు ప్రతిసంఘటనా, నవలలోనే ఒకచోట చెప్పినట్టు సినిమాల్లో చూడగలమే తప్ప నిజజీవితంలో కాదు. కథాంశం బావున్నా కథను నడపడంలోనూ, పాత్రలను ఇష్టం వచ్చినట్లు అవకాశానుకూలంగా ప్రవేశపెట్టడంతోనూ నవల ఓ 'ఫాంటసీ'లా మారింది. పాత్రల స్వభావాల్ని సైతం నవలకనుగుణంగా మార్చివేశారు.

-పుష్పలీల, జంపని
గూడూరు

## ఓ స్త్రీ! ఉద్యమించు!!

*(నాలుగవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)*

ఎవరో వచ్చి ఏదో చేస్తారని ఎదురు చూస్తూ కూర్చోక నిన్ను నువ్వు ఉద్ధరించుకుని, నీలాంటి ఎందరో అభాగినులకు స్ఫూర్తినిస్తూ, వారికి చేయూతనివ్వమని చక్కని సందేశాన్నిచ్చే నవల 'లేడీస్ లాయర్'. ఒక మహిళా ప్రధానిని ఎన్నుకున్న ఈ దేశంలో ఎన్నోచోట్ల స్త్రీ ఇంకా పురుషుని అవసరాలు తీర్చే ఒక సజీవ పరికరంగానూ, బానిసగానూ చూడబడుతోంది. ఆమె ఎంత దుస్థితిలో వున్నదంటే పురుషునితో సమానంగా చదువుకుని, ఉద్యోగం చేసినా అది ఆమెకు అదనపు క్వాలిఫికేషన్‌గా కాక, ఇంటి పనితోబాటు అదనపు భారంగా తయారవుతోంది. తను సంపాదించే డబ్బుమీద తనకు హక్కు లేదు. డబ్బుకోసం ఉద్యోగం చేసినట్లే, ఆ డబ్బుకోసం తన శీలాన్ని కూడా బలిపెడుతుందనే దురభిప్రాయంతో తోటి ఉద్యోగులు ఉంటున్నారు. ఉద్యోగం చేస్తున్న సింధుజ ఆత్మాభిమానంగల స్త్రీ అని తెలుసుకున్న తర్వాతే ప్రభాకర్ వివాహానికి సిద్ధపడతాడు. జీవితాంతం తోడునీడగా నిలిచే స్త్రీ విలువ ఆమె తెచ్చే కట్నకానుకలు లేదా సంపాదించే డబ్బుని బట్టీ ఉంటోంది.

ఆడవాళ్ళకి అపనిందలు నీడలలాంటివని అపనిందల అగ్ని పరీక్షలు ఆ సీతమ్మవారికే తప్పలేదనీ సరిపెట్టుకున్నారీనాటి మహిళలు. కుటుంబ గౌరవమో, ఆర్థికంగా ఒకరిమీద ఆధారపడి ఉండటమో వీటికి కారణాలు. దీనివల్ల మగవారి ఆగడాలు ఇంకా మితిమీరుతున్నాయి.

మధుమతిలాంటి లాయర్ తటస్థపడటం సింధుజ అదృష్టం! కాని ఆడదాన్ని నేనేం చేయగలను అని నిరాశా నిస్పృహలకు లోనుకాక మధుమతిలాగా తన జీవితాన్ని పణంగా పెట్టి అయినా సరే ప్రతి స్త్రీ ఉద్యమించాలి. అప్పుడుగానీ ఎన్ని తరాలు గడిచినా మారని స్త్రీల పరిస్థితులు మారవు. ముందుతరాలవారికి మార్గం సుగమంకాదు.

"నూటికి ఏ ఒక్క స్త్రీయో తన భవిష్యత్తు నాశనమైనాసరే' అనే ఆత్మస్థైర్యంతో న్యాయంకోసం ముందడుగువేసి కోర్టుకెక్కుతుంది. అప్పుడు కూడా చట్టాలూ, సాక్ష్యాలూ అంటూ వాదోపవాదాలమధ్య స్త్రీని నగ్నంగా నిలబెట్టి, నిజాన్ని దొంగసాక్షుల కాళ్ళకింద నలిపేస్తున్నారు. స్త్రీలకు న్యాయం చేకూర్చాలంటే కొన్ని కేసుల్ని చట్టాల పరిధినుండి బయటికి లాగి మానవతా దృక్పథంతో న్యాయం చేయాలి" అన్న లాయర్ మధుమతి అభిప్రాయాలు ఆలోచింపచేసేవిగా వున్నాయి.

స్త్రీ సమస్యలను పాఠకుల ముందుంచాలనే తపనలో కొన్ని సంభాషణలు ఉపన్యాస ధోరణిలో సాగాయి. భానుమూర్తి, చంద్రమౌళి, ప్రభాకర్‌లలో పరివర్తన తీసుకురావటానికి కూర్చిన సంఘటనలు కొన్ని సినిమాటిక్‌గా, అతిగా వున్నా రచయిత తను చెప్పదలచుకున్నది చాలా హృద్యంగా చెప్పారనే అనుకోవాలి.

-తూములూరి కనకదుర్గ
గుంటూరు

# ఇలాంటి లాయర్లుంటే...!

(అయిదవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)

మామూలుగా మధ్యతరగతి అమ్మాయిలకున్నట్టే ఓ చేతకాని తండ్రి, ఓ విలన్‌లాంటి పినతల్లి, సంసారాన్ని పోషించే బాధ్యతతో ఓ కంపెనీలో ఉద్యోగం, అందంగా ఉన్న అమ్మాయిల్ని ఎరవేసి పడగొట్టే భానుమూర్తిలాంటి మేనేజర్ల పాత్రలు కొత్తగా అనిపించకపోయినా, రచయిత తనదైన బాణీలో నవలను నడిపించి పాఠకులను ఏకబిగిన చదివేలా చేశారు. సింధుజకు మోతాదుమించిన వ్యక్తిత్వాన్ని చేర్చారు. ఒక వ్యక్తి కోరికను తిరస్కరించటానికి చెప్పుతోనే కొట్టక్కర్లేదు. కోరి కష్టాలు తెచ్చుకునే విధంగా శత్రువు కానక్కర్లేదు. 'నొప్పించక తానొవ్వక' అన్న విధంగా, భానుమూర్తిలాంటి పురుషులకు నిశ్శబ్దంగానూ బుద్ధిచెప్పవచ్చునన్నవిధంగా కథ మలిచి ఉంటే బావుండేదేమో! వ్యక్తిత్వం, ఆత్మాభిమానంగల అమ్మాయి, ప్రభాకర్‌తో రెండుమూడు సంఘటనలకే ప్రేమలో పడిపోయి పెళ్ళివరకూ దారితియ్యటం చదువుతూంటే, ఎలాంటి అమ్మాయిలనైనా ఏదోరకంగా వశం చేసుకోవచ్చనే సూచన ఇన్‌డైరెక్టుగా ఇచ్చినట్లుంది! ప్రభాకర్, చంద్రమౌళి, భానుమూర్తిలను తెరవెనుక నించి మట్టయ్య ఆడించిన నాటకం రసవత్తరంగా ఉంది! లాయర్ ఆంటీ ఎత్తులు, పై ఎత్తులు కూడా గుర్తుంచుకోదగ్గవి! యస్.పి. స్త్రీ కాకుండా పురుషుడై ఉండి, లాయర్ ఆంటీకి సహాయం చేసివుంటే బావుండేదేమో! అపుడు ఒక స్త్రీ పతనం కాకుండా ఆమె జీవితాన్ని ఉద్ధరించటానికి లేడీ పోలీసులు, లేడీ లాయర్లే అక్కర్లేదు, అన్యాయాన్ని న్యాయంగా మార్చటానికి, మగవారికి కూడా మనసుంటే పనులు జరుగుతాయనే నమ్మకం పాఠకులకు కలిగేది! దగాపడిన స్త్రీలందరికీ ఉషారాణిలాంటి యస్.పి.లు, మధులతలాంటి లేడీస్ లాయర్లు అండగా ఉంటే ఎంత బావుండునో! అనిపిస్తుంది.

-ఎ.జయలక్ష్మిరాజు
అనంతపురం

# చైతన్యవంతం

(ఆరవ బహుమతి రు: 25/- పొందిన సమీక్ష)

నేటి పురుషాధిక్య ప్రపంచంలో స్త్రీలు ఎదుర్కొంటున్న అనేక సమస్యలకు అద్దం పట్టడమేగాక, అటువంటి సమస్యల విషవలయంనుంచి ఏవిధంగా తమనుతాము రక్షించుకోవచ్చో తెలియపరిచేవిధంగా ఉంది కాశీవిశ్వనాథ్‌గారి నవల 'లేడీస్‌లాయర్'!

స్త్రీలను బానిసలుగా చూసే చంద్రమౌళిలాంటివారు, పేదరికంలో ఉన్న ఏ స్త్రీనైనా లొంగదీసుకోవచ్చుననే భానుమూర్తిలాంటివారు, కట్నం, ఆస్తి, అంతస్తుకోసం ప్రేమించిన ప్రియురాలినే వ్యభిచారిణిగా చిత్రీకరించగల ప్రభాకర్‌లాంటివారు, భార్యలను నాలుగు గోడలమధ్య బంధించే మట్టయ్యలాంటి దుర్మార్గులు మన చుట్టూ కోకొల్లలుగా ఉన్నారనే అంశాన్ని రచయిత పైకెత్తి చూపి అలాంటివారికి గుణపాఠంగా ఈ నవలను సంధించారు.

రుక్మిణి, సుజాత, సింధుజలలాంటి స్త్రీలు పురుషాధిక్య జనారణ్యంలోని క్రూరమృగాలను ఏవిధంగా ఎదుర్కోవాలో వారికి అండగా మధులతలాంటి లేడీస్ లాయర్లు ఉంటే ఏవిధంగా స్త్రీజాతి లాభపడగలదో వర్ణించారు.

చంద్రమౌళి, భానుమూర్తి, ప్రభాకర్‌లపై కక్షసాధింపుధోరణి చూపకుండా వారిలో మార్పు తీసుకురావడానికి లాయర్ మధులత పడిన శ్రమను రచయిత ఆసక్తికరంగా చూపించారు.

నవలలోని కొన్ని పాత్రలు స్పీడును పుంజుకోవడం, ఆ స్పీడు సినిమా ఫక్కీలో ఉండటం గోచరిస్తుంది. ఇందుకు ఉదాహరణగా మధులత పాత్రను చెప్పుకోవచ్చు. ఆమెది లాయర్ పాత్రయినప్పటికీ ఆ పాత్ర ప్రభావం కోర్టులో కాకుండా, బయటే ఎక్కువగా సాగడం అసహజంగా ఉంది. పైగా లేడీస్‌లాయర్ అనే పేరుకు న్యాయం జరగలేదు.

-గోళ్ళ నరసింహులు
తల్లిమాడుగుల





# సత్యాన్వేషణ

# చేదునిజాలు

## ఆమె ఎవరు?

బొంబాయిలోని జె.జె. హాస్పిటల్‌లో అనాటమీ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న డాక్టర్ సేత్నాకు కొన్ని శవాల అవసరం తరచుగా వుంటుంది. వైద్య విద్యార్థులకు మానవశరీర నిర్మాణాన్ని చూపించటానికిగానూ శవాలను కోసి, వివరించటమనేది అయన వృత్తిలో ఓ భాగం. అలా అవసరమున్నప్పుడల్లా ఆయన బొంబాయి కరోనర్‌కు తెలియచేస్తుంటాడు. కరోనర్ ఆదేశాలమేరకు మార్చురీలో వున్న అనాథశవాలను ఆయనకు అందిస్తుంటారు. ఎప్పట్లాగే 1956 సంవత్సరం నవంబర్ 22వ తేదీన డాక్టర్ సేత్నా అవసరం మేరకు కరోనర్ ఆదేశాల అనంతరం, జె.జె. హాస్పిటల్ మార్చురీ ఉద్యోగి 'దగ్డూ', అనాథ శవాలను ఏరుకునే పనిలో నిమగ్నమైవున్నాడు. ఆ శవాల్లో ఓ మధ్యవయస్కురాలి శవం దగ్డూని ఆకర్షించింది. ఆమె అందంగా, ఆరోగ్యవంతమైన శరీరంతో డబ్బున్న ఇంటి లక్షణాలతో కనిపించటంతో దగ్డూ ఆశ్చర్యపోయాడు. అలాంటి వ్యక్తి శవాన్ని ఎవరూ తీసుకుపోకుండా హాస్పిటల్ మార్చురీలో వదిలేయటం విచిత్రంగా అనిపించి, ఆ విషయాన్ని డాక్టర్ సేత్నాకు తెలియచేశాడు. డాక్టర్ సేత్నా వెంటనే కరోనర్‌కు ఈ విషయం రిపోర్ట్ చేశాడు. శవం మెడపైన కొన్ని గాయాల గుర్తులు కూడా కనిపించటంతో కరోనర్ శవపరీక్షకు ఆదేశాలు జారీ చేశాడు. ఆమె హత్య చేయబడిందని తెలిసింది. ఆ శవం ఇందుమతి అనే ఆవిడదని హాస్పిటల్ రికార్డుల ప్రకారం తెలిసింది.

కొద్దిరోజుల క్రితమే, కోమాస్థితిలో వున్న ఇందుమతిని డాక్టర్ లాగూ అనే ఆయన జె.జె. హాస్పిటల్‌లో చేర్పించాడు. ఆమె మరణించింది. ఆ మృతదేహాన్ని తీసుకువెళ్లమని డ్యూటీలో వున్న సిబ్బంది డాక్టర్ లాగూకు చెప్పారు. కానీ ఆయన అందుకు నిరాకరించాడు. ఇందుమతి సోదరుడు కలకత్తానుండి రావాల్సివుందనీ, ఆ బాధ్యత అతనే తీసుకుంటాడనీ చెప్పి, డాక్టర్ లాగూ తన స్వస్థలమైన పూనాకు వెళ్ళిపోయాడు. మరునాడూ, ఆ మరునాడూ కూడా ఇందుమతికి సంబంధించిన వారెవ్వరూ రాకపోవటంతో, డాక్టర్ లాగూ ఇచ్చిన చిరునామా ప్రకారం, అక్కడి పోలీస్‌స్టేషన్‌కు టెలిగ్రాం ఇచ్చారు ఆసుపత్రి అధికారులు. ఇందుమతి శవాన్ని తీసుకువెళ్ళమని డాక్టర్ లాగూను కోరవలసిందిగా పోలీసులకు సూచించారు ఆ టెలిగ్రాంలో. పూనాలోని డాక్టర్ లాగూను పోలీసులు సంప్రదించగా, అసలు ఇందుమతి అనేవ్యక్తి ఎవరూ తనకు తెలియదని డాక్టర్ లాగూ వివరించాడు. దాంతో ఇందుమతి శవాన్ని మార్చురీకి తరలించారు. ఆ తరవాత దగ్డూ ఆ శవాన్ని చూడటంతో ఇదంతా తెలిసిందిగానీ,

అసలు ఇందుమతి ఎవరో, ఏ ప్రాంతానికి చెందినదో తదితర వివరాలేవీ తెలీలేదు. క్రమంగా ఇందుమతి విషయం అందరూ మరిచిపోయారు.

సుమారు రెండు సంవత్సరాల తరవాత, 1958వ సంవత్సరంలో పూనా పోలీసు అధికారులు, ఓ అనుమానితుణ్ణి వెంటబెట్టుకుని జె.జె. హాస్పిటల్‌ను దర్శించారు. రెండు సంవత్సరాల క్రిందటి రికార్డులు తీయించి పరిశీలించారు. పూనాకు చెందిన లక్ష్మీబాయి అనే స్త్రీ అదృశ్యోదంతంపై పరిశోధిస్తూ అక్కడికి వచ్చారు పోలీసులు. ఆ లక్ష్మీబాయి సంపన్న స్త్రీ. రెండు సంవత్సరాలు క్రిందట గాలిలో కలిసిపోయినంత విచిత్రంగా ఆమె మాయమైంది.

పూనాలోని లక్ష్మీబాయి, వైద్యపరీక్షల నిమిత్తం తన ఫామిలీడాక్టర్ అయిన డాక్టర్ లాగూను వెంట బెట్టుకుని, 1956వ సంవత్సరం, నవంబర్ 9వ తేదీన బొంబాయికి బయలుదేరింది. ఓ వారం తరవాత డాక్టర్ లాగూ మాత్రం పూనాకు తిరిగివెళ్లాడు. లక్ష్మీబాయి ఇంట్లో అద్దెకుంటున్న వాళ్లకు కనిపించి, ఆమె రావటానికి మరికొన్ని వారాలు పడుతుందనీ, వైద్యపరీక్షల నిమిత్తం ఆమె బొంబాయిలో వుండాల్సివచ్చిందనీ చెప్పాడు. అంతేకాకుండా, బొంబాయినుండి అట్నించటే బయలుదేరి ఉత్తరభారత యాత్రలకు వెళతానని కూడా తనతో లక్ష్మీబాయి చెప్పిందని డాక్టర్ లాగూ చెప్పాడు.

క్రమంగా రెండు సంవత్సరాలు గడిచిపోయినా లక్ష్మీబాయి తిరిగి రాకపోవటంతో ఆమె సోదరుడు ఆందోళన చెంది, ముఖ్యమంత్రిని కలిసి, పరిశోధనకు చర్యలు తీసుకోవలసిందిగా కోరాడు. ఈ విషయంలో డాక్టర్ లాగూ సహాయం తీసుకోవలసిందిగా కూడా అతనే సూచించాడు. వెంటనే రంగంలోకి దిగిన పోలీసులు, లక్ష్మీబాయి తీర్థప్రదేశాలనుండి తన బంధువులకు రాసినట్టు భావిస్తున్న ఉత్తరాలను పరిశీలించారు. ఆ ఉత్తరాల దస్తూరీ ఒకేమాదిరిగా లేకపోవటం పోలీసులు గ్ర




హించారు. అనుమానం కొద్దీ డాక్టర్ లాగూ ఇంటిని సోదా చేశారు. అక్కడ దొరికిన కొన్ని పత్రాలను పరిశీలించిన పోలీసులకు డాక్టర్ లాగూమీద అనుమానం మరింతగా ధృవపడింది. లక్ష్మీదేవి చికిత్సకు సంబంధించి డాక్టర్ లాగూ దగ్గర దొరికిన పత్రాలలో అతను ఆమెను 1958వ సంవత్సరం, ఫిబ్రవరి 30వ తేదీన పరీక్షించినట్టుగా ఓ ఎంట్రీ కనిపించింది. ఫిబ్రవరి నెలకు 30 రోజులుండవు గదా. ఇలాంటి అవకతవకపత్రాలు, ఇతరత్రా అనుమానాస్పదమైన పత్రాలూ లభించటంతో పోలీసులు డాక్టర్ లాగూను అరెస్ట్ చేశారు. అసలు లక్ష్మీబాయి బ్రతికేవుందా- అన్నది పోలీసుల మొదటి సమస్యయింది.

తను నిరపరాధిననీ, లక్ష్మీబాయి అదృశ్యం విషయంలో తనకేమీ తెలియదనీ, తాను అమాయకుణ్ణనీ వాదించాడు డాక్టర్ లాగూ. కానీ పోలీసులు అతన్ని విశ్వసించకుండా మరింత లోతుగా పరిశోధించారు. డాక్టర్ లాగూ పేషెంట్లలో ఒకరైన ఒక వయసులోవున్న విధవరాలు పోలీసులకు మరింత సమాచారం అందించింది. లక్ష్మీబాయి పేరిట ఆమె బంధువులకు అందిన ఉత్తరాలలో కొన్నింటిని, డాక్టర్ లాగూ అభ్యర్థన మేరకు తాను రాసినట్టుగా ఆమె నిరూపించింది. ఆయా ఉత్తరాలను కవర్‌లోపెట్టి, లక్ష్మీబాయి బంధువుల చిరునామా వ్రాసి, తగినన్ని స్టాంపులు అతికించి, ఆ కవర్‌ను మరో పెద్ద కవర్‌లోపెట్టి వేర్వేరు తీర్థయాత్రా ప్రదేశాల లోని పోస్టుఆఫీసులకు పోస్ట్ చేసేవాడని ఆ తరవాత పరిశోధనలో తెలిసింది. అలాంటి కవర్‌లను కొత్త పోస్టు స్టాంపులపైన పోస్టల్ ముద్రల కోసం కొందరు పంపించటం ఆనవాయితీ గనుక, ఆయా పోస్ట్‌మాస్టర్‌లకు అనుమానాలేవీ రాలేదు.

లక్ష్మీబాయిని తానే బొంబాయి వెంటబెట్టుకు వెళ్ళినట్టు డాక్టర్ లాగూ అంగీకరించాడు. తాను, లక్ష్మీబాయితో కలిసి 1956వ సంవత్సరం నవంబర్ 12వ తేదీన పూనా నుండి బయలుదేరానని కానీ మరునాడు పొద్దున్నే ఆమె కంపార్టుమెంటుకు వెళ్లి ఆమెను నిద్రలేపడానికి ప్రయత్నించగా, ఆమె కోమాస్థితిలోకి వెళ్ళినట్టు తెలుసుకుని వెంటనే జె.జె. హాస్పిటల్‌కు తీసుకువెళ్ళాననీ చెప్పాడు డాక్టర్ లాగూ. ఈ కథనంలోని నిజానిజాలను పరిశీలించటానికి పోలీసులు, డాక్టర్ లాగూని వెంటబెట్టుకుని జె.జె. హాస్పిటల్‌కు వెళ్లారు. రెండు సంవత్సరాలనాటి రికార్డులను తిరగతోడారు. డాక్టర్ లాగూ కథనం ప్రకారం, అతను చెప్పినరోజున లక్ష్మీబాయిని ఆసుపత్రిలో చేర్పించినట్టుగా దాఖలాలూ కనిపించలేదు. కానీ, డ్యూటీలో వున్న ఒక డాక్టర్, కొద్దినెలల క్రితం ఓ కోమాలోవున్న పేషెంట్‌ను చేర్పించిన డాక్టర్ లాగూను గుర్తించాడు. అంతేకాక, డాక్టర్ లాగూ చెప్పిన ఆ ఫలానా తేదీన ఇందుమతి అనే స్త్రీని చేర్పించినట్టుగా రికార్డుల్లో వుంది. వెంటనే ఇందుమతి శవానికి సంబంధించిన వివరాలన్నీ సిబ్బందికి గుర్తొచ్చాయి. రికార్డుల్లోని ఇందుమతి ఫొటోనే పోలీసులకు చూపించగా ఆ 'ఇందుమతి' ఎవరోకాదు 'లక్ష్మీబాయే'నని తేలింది.

లక్ష్మీబాయిని హత్య చేసినట్టుగా అభియోగం మోపి డాక్టర్ లాగూపై కేసు పెట్టారు పోలీసులు. ఈ కేసు అప్పట్లో గొప్ప సంచలనాన్ని కలిగించింది. లక్ష్మీబాయికి సంబంధించిన వేర్వేరు అక్కౌంట్లనుండి పది వేల రూపాయలు దొంగ సంతకాలతో డాక్టర్ లాగూ తీసుకున్నాడనీ, ఈ సంపన్న విధవరాలికి చెందిన పదిహేడువేల రూపాయల విలువైన షేర్సును తన పేరుకు మార్పించుకున్నాడనీ పోలీసుల పరిశోధనలో తేలింది. ముప్ఫయిఅయిదేళ్ళ కిందట, ఇరవైఏడు వేల రూపాయలంటే చాలా పెద్ద మొత్తమే. లక్ష్మీబాయి బతికే వున్నదనీ, తీర్థయాత్రలు చేస్తున్నదనీ నమ్మించటానికి వేర్వేరు ప్రదేశాల పోస్ట్‌మాస్టర్లతో 'పోస్ట్ చేయించిన' కవర్‌ల ద్వారా డాక్టర్ లాగూ ప్రయత్నించాడన్నది నిర్వివాదాంశం. ఆరువారాలపాటు సాగిన ఈ కేసు విచారణలో 84 మంది సాక్షులను పరిశీలించింది కోర్టు. పూనా సెషన్స్ కోర్టు, ప్రఖ్యాతుడైన డాక్టర్ లాగూకు మరణశిక్ష విధించింది. ఈ శిక్షను నిర్ధారిస్తూ సుప్రీంకోర్టుకు అప్పీలు చేసుకోవటానికి అనుమతించమన్న డాక్టర్ లాగూ అభ్యర్థనను 1959వ సంవత్సరం జనవరి 20వ తేదీన నిరాకరించింది బొంబాయి హైకోర్టు. అయితే

మహారాష్ట్ర కాంగ్రెసు పార్టీ సీనియర్ నాయకుడూ, ప్రభుత్వంలో మంచి పలుకుబడి వున్న డాక్టర్ లాగూ సోదరుని ప్రయత్నం ఫలించి, రాష్ట్రపతి క్షమాభిక్షతో, మరణశిక్ష కాస్తా యావజ్జీవ కారాగార శిక్షగా మారి, బతికిపోయిన డాక్టర్ లాగూ, తన శిక్ష పూర్తిచేసుకుని కొద్ది సంవత్సరాల కిందటే విడుదలై, మహారాష్ట్రలోని ఓ గ్రామంలో స్థిరపడి, వైద్యవృత్తిని తిరిగి చేపట్టాడు. వైద్యుడిగా ఎవరైనా పేషెంట్లను హరీమనిపించాడో లేదోగానీ, ఆశపోతు మనిషిగా మాత్రం తనను నమ్మిన పేషెంట్ ప్రాణాలను పొట్టనపెట్టుకుని, 'హంతకుడు లాగా' మారిన 'డాక్టర్‌లాగూ' ఈ మధ్యనే మరణించారు.

## క్షణికావేశం

**ము**ప్ఫై అయిదేళ్ళ అవివాహితుడైన పరమేశ్వర్ సరదా వ్యక్తి. సంఘంలో అతనికి మంచి పలుకుబడి వుంది. మద్రాస్ మహానగరంలోని అడయార్ ప్రాంతంలో పెద్ద బంగళా, ఆస్తిపాస్తులు వున్న పరమేశ్వర్‌కి ఎలాంటి చెడు అలవాట్లూ లేవు.

పరమేశ్వర్ వంటవాడు ముత్తు చాలాకాలంనుండీ అతని దగ్గర పనిచేస్తూన్న విశ్వాసపాత్రుడు.

ముత్తు కుటుంబం అక్కడికి దగ్గరేవున్న ఛెంగల్‌పేటలో వుండేది. అతను ప్రతి శుక్రవారం ఛెంగల్‌పేటకు వెళ్ళి కుటుంబంతో గడిపి మళ్ళీ సోమవారం ఉదయాన్నే వచ్చేవాడు. ఆ రెండురోజులూ బయటే భోజనం కానిచ్చేవాడు పరమేశ్వర్.

1978 ఫిబ్రవరి 2న కూడా ఎప్పటిలాగే ఉదయాన్నే వచ్చాడు ముత్తు. ఆ సమయంలో పరమేశ్వర్ ఇంకా నిద్రిస్తుండడంతో అలవాటు చొప్పున తన దగ్గరున్న మారు తాళాలతో తలుపులు తెరచుకొని లోనికెళ్ళాడు. వంటింటివైపు దారితీసిన ముత్తు, పరమేశ్వర్ గది తలుపులు ఓరగా వేసివుండడం చూశాడు. ఏదో అనుమానంరాగా గదిలోంచి లోనికి తొంగిచూసిన ముత్తు అక్కడ కనిపించిన దృశ్యం చూసి నిరుత్తరుడయ్యాడు. మంచంపై పరమేశ్వర్ శవం పడివుంది. గొంతుకు నైలాన్ తాడు బిగుసుకుపోయి ఉంది.

పరమేశ్వర్ మెడలో బంగారు గొలుసు, వేలికున్న వజ్రపుటుంగరం యధాస్థానంలోనే వున్నాయి. దానినిబట్టి హత్య దొంగతనంకోసం జరిగింది కాదనిపించింది.

ఆ పరిస్థితినుంచి తేరుకున్న ముత్తు ఏదో ఆలోచించుకున్నవాడిలా పరమేశ్వర్ వంటిపైనున్న నగలతోపాటు అల్మారీలో వున్న డబ్బు, చనిపోయిన అతని తల్లి సొమ్ములు అన్నీ ఒక దగ్గర మూటగట్టుకొని బయటపడ్డాడు.

పోలీసుస్టేషన్‌కి వెళ్ళిన ముత్తు దొంగతనం కోసం తన యజమానిని ఎవరో హత్యచేశారనీ, సొమ్ము, డబ్బు కనిపించడంలేదనీ పోలీసులకు ఫిర్యాదు చేశాడు.

పోస్టుమార్టమ్ రిపోర్టులో ముందుగా పరమేశ్వర్‌ను గొంతునులిమి చంపి ఆ తరువాత నైలాను తాడు గొంతుకు బిగించినట్టు తెలిసింది. హత్య ఆదివారంనాడు జరిగినట్టు కూడా రిపోర్టులు అందాయి.

ముత్తు గురించి విచారణ జరపగా అతను రెండురోజులు ఛెంగల్‌పేటలోనే వున్నట్టు తెలిసింది. అందువల్ల అతనీ హత్య చేయలేదని నిర్ధారణ అయ్యింది.

పరమేశ్వర్ గురించి విచారణ జరపగా అతనికి ఆఫీసులో మంచి పేరున్నట్టు, అమ్మాయిలెవరితోనూ ఎలాంటి సంబంధాలూ లేనట్టు వెల్లడయ్యింది. ముత్తు ఊరికి వెళ్ళినప్పుడల్లా తన ఇంటికి దగ్గరలోనే వున్న గీతా హోటల్‌లో భోజనం చేసేవాడని తెలిసి అక్కడ విచారణ జరిపారు పోలీసులు. హోటల్‌లోని ఓ సర్వర్ చెప్పినదాన్నిబట్టి హత్యకు సంబంధించి కొంత క్లూ దొరికినట్టయ్యింది.

''ఆదివారం ఉదయం సినిమాతారలా వున్న ఓ అందమైన అమ్మాయితో వచ్చాడు





పరమేశ్వర్. వాళ్లలో ఓ లావాటి వ్యక్తి కూడా వున్నాడు. భోజనం చేసి వెళ్ళిపోయేముందు పరమేశ్వర్ చెక్‌బుక్ తీసి ఏదో రాసి చెక్కు ఆ లావాటి వ్యక్తికిచ్చాడు. దానిని అతను నవ్వుతూ తీసుకున్నాడు. ఆ తరువాత ఆ ముగ్గురూ కలిసి వెళ్ళిపోయారు'' అని చెప్పాడు సర్వర్.

పోలీసులు హోటల్‌నుండి వెంటనే పరమేశ్వర్ ఇంటికి వెళ్ళారు. పరమేశ్వర్ గదిలోని అల్మారా వెతగ్గా పంజాబ్ అండ్ సింధ్ బ్యాంకుకు చెందిన చెక్‌బుక్ కనిపించింది. చెక్కు రాసి ఇచ్చిన గుర్తులున్నాయి. కానీ వుంది. ఆ వ్యక్తి పేరు కుమార్.

అతనికా చెక్కు ఎలావచ్చిందని అడిగాడు ఇన్‌స్పెక్టర్.

''నా భార్య నళిని సినిమాల్లో చిన్నచిన్న పాత్రలు వేస్తుంది. పరమేశ్వర్ తను వేయబోయే చిత్రంలో నళినిని కథానాయికగా బుక్ చేసి అడ్వాన్స్‌గా ఈ డబ్బిచ్చాడు'' అని చెప్పాడు కుమార్.

తన అనుమానం నిజంకాగా పరమేశ్వర్ హత్య గురించి చెప్పి, నేరం ఒప్పుకోమని బెదిరించాడు ఇన్‌స్పెక్టర్.



ఎవరికయినదీ వివరాలు లేవు.

ఫిబ్రవరి 5న బ్యాంకుకు మఫ్టీలో వెళ్ళిన ఇన్‌స్పెక్టర్ ప్రయత్నం ఫలించింది. చెక్ విడిపించుకుంటున్న ఓ లావాటి వ్యక్తి ఇన్‌స్పెక్టర్ దృష్టిలో పడ్డాడు. హోటల్ సర్వర్ చెప్పిన పోలికలు అతనికి సరిగ్గా సరిపోయాయి. అతన్ని కొంత ప్రశ్నించిన మీదట, తన భార్య నళిని పేరవున్న యాభైవేల రూపాయల చెక్కును విడిపించుకోవడానికి అక్కడికి వచ్చినట్టు తేలింది. చెక్కు వెనక ఆమె సంతకం కూడా

కుమార్ ఏమాత్రం తొణక్కుండా నిజం బయటపెట్టాడు.

''పరమేశ్వర్ తాను తీయబోయే చిత్రానికి సంబంధించిన కథను వివరించడానికి ఆదివారంనాడు మమ్మల్ని వాళ్ళింటికి ఆహ్వానించాడు. గీతా హోటల్‌లో భోజనాలు కానిచ్చి ఆ తరువాత వాళ్ళింటికెళ్ళాం. పరమేశ్వర్ నళి

నిని తన బెడ్‌రూమ్‌లో కూర్చుండబెట్టుకొని కథను వివరిస్తున్నాడు. నేను వేరే గదిలో నిద్రకుపక్రమించాను. కొద్దిసేపయ్యాక పరమేశ్వర్ గదిలో ఏదో గొడవ వినిపించింది. వెళ్ళి చూడగా అతను నళినిపై అత్యాచారం చేయడానికి ప్రయత్నిస్తున్నాడు. అది చూసిన నేను ఆవేశాన్ని ఆపుకోలేకపోయాను. వెంటనే వెళ్ళి అతని గొంతు నులిమి చంపేశాను. ఆ తరువాత అక్కడేవున్న నైలాన్ తాడును తీసుకొని ఉరిపోసుకు చనిపోయాడనే భావన కలగడానికి దాన్ని అతని గొంతుకు బిగించాను. ఆ తరువాత నళినిని తీసుకొని వెనక్కి వచ్చాను" అని చెప్పాడు కుమార్ ఆవేశంగా.

"మరి సొమ్ములు, డబ్బు దొంగిలించింది మీరు కాదా" అని అడిగాడు ఇన్‌స్పెక్టర్ ఆశ్చర్యంగా.

"చెక్కు తప్పిస్తే నా దగ్గర అతనికి సంబంధించిన వస్తువులేవీ లేవు. నన్ను నమ్మండి ఇన్‌స్పెక్టర్" అన్నాడు కుమార్ ఎంతో నిజాయితీగా.

పరమేశ్వర్‌ని చంపిన నేరానికి నళినిని, కుమార్‌ను అరెస్టు చేశారు పోలీసులు. ఆ తరువాత వెలువడిన పరిశోధనలవల్ల ముత్తు వాచ్‌మన్‌తో కలిసి రోజా బాగా తాగుతాడని తెలిసింది. వాచ్‌మన్ ఇంటికి వెళ్ళి సోదాచేయగా పరమేశ్వర్ ఇంట్లో మాయమైన డబ్బు, సొమ్ము పూర్తిగా దొరికాయి.

# పుట్టినరోజు

**1986**మార్చి 5న తమిళనాడుకు చెందిన కోయంబత్తూర్‌లోగల ఓ పోలీస్‌స్టేషన్‌లో అర్ధరాత్రి 2.30 గంటలవేళ ఫోన్ మోగింది.

ఫోనెత్తిన ఇన్‌స్పెక్టర్‌తో అవతలి వ్యక్తి, "నేను రాజాముదలియార్ ఆస్పత్రినుండి మాట్లాడుతున్నాను. ఈరోజు ఆత్మానందన్ అనే వ్యక్తి తన భార్య సరళను చికిత్సకోసం ఇక్కడికి తీసుకువచ్చాడు. ఆమెను పరీక్షచేసి చనిపోయిందని చెప్పారు డాక్టర్లు. తను పెరైరా రోడ్డులో మూడవ బ్లాకులో వుంటున్నానని చెప్పి శవంతోసహా వెళ్ళాడావ్యక్తి. ఆమెది సహజ మరణం కాదని మా అనుమానం. మీరోసారి కేసు పరిశీలిస్తే బాగుంటుంది" అన్నాడు ఆ ఫోన్ చేసినవ్యక్తి.

పోలీస్ ఇన్‌స్పెక్టర్ కరుణాకరన్ వెంటనే పెరైరా రోడ్డులో వుంటున్న ఆత్మానందన్ ఇంటికెళ్ళాడు. ఆత్మానందన్ "ఈరోజు నా భార్య పుట్టినరోజు. ఉన్నట్టుండి ఆవిడకు ఫిట్స్ ముంచుకురావడంతో వెంటనే ఆస్పత్రికి తీసికెళ్ళాను. కానీ ఆమె దారిలోనే చనిపోయింది" అని చెప్పాడు బాధగా.

శవాన్ని పరీక్షించిన తరువాత సరళది అసహజమైన మరణమేనని సులభంగా గ్రహించాడు ఇన్‌స్పెక్టర్. అందుమీదట వివరాల కోసం శవాన్ని పోస్టుమార్టమ్‌కు పంపాడు.

ఆత్మానందన్ ఇంటినుండి నేరుగా సరళ పుట్టింటికి వెళ్ళాడు ఇన్‌స్పెక్టర్. సరళ మరణ వార్తవిని ఆమె తండ్రి నిశ్చేష్టుడయ్యాడే తప్ప ఏమీ చెప్పలేకపోయాడు.

ఇన్‌స్పెక్టర్ తన పరిశోధన ప్రారంభించాడు. క్రమంగాఆత్మానందన్ ప్రవర్తన మంచిది కాదనీ, పైగా దుర్మార్గుడనీ బయటపడింది. దీనికితోడు గొంతు బలంగా నొక్కడంవల్లనే సరళ చనిపోయిందని పోస్టుమార్టమ్ రిపోర్టులో వెల్లడైంది. ఫలితంగా ఆత్మానందనే నేరస్థుడనే అనుమానం మరింత బలపడింది. వెంటనే ఆత్మానందన్‌ని కస్టడీలోకి తీసుకొని ప్రశ్నించినమీదట అతను చేసిన నేరం ఒప్పుకొని అసలు విషయం బయటపెట్టాడు.

"డబల్ ఎమ్.ఎ, ఎల్.ఎల్.బి. పూర్తి చేసిన సరళ ఆత్మానందాన్ని ప్రేమించి తల్లిదండ్రులకు వ్యతిరేకంగా ఏడేళ్లక్రితం పెళ్ళిచేసుకొంది. వివాహం జరిగిన వెంటనే ఆత్మానందన్ పనిచేసే కంపెనీ మూతపడడంతో అతను నిరుద్యోగిగా రోడ్డున పడ్డాడు. ఆ తరువాత పురాతన వస్తువులను సేకరించి అమ్మి డబ్బు సంపాదించడం మొదలుపెట్టాడు. కొ




న్ని రోజులు అలా ప్రశాంతంగా గడిచిపో యాయి.

1980 డిసెంబరు 7న, ఊహించని రీతిలో బాగా తాగి ఆ మత్తులోనే అర్ధరాత్రి ఇంటికి చేరుకున్నాడు ఆత్మానందన్. అతని పరిస్థితి చూసి షాక్ తింది సరళ. అంతకుముందు ఆమెకు అలాంటి అనుభవం లేదు. క్రమక్రమంగా రోజూ అదేస్థితిలో తాగి ఇంటికి రావడం మొదటలుపెట్టాడు. తాగుడు మానెయ్యమని ఎంతగానో చెప్పి చూసింది సరళ. కాని అతన్ని మంచి దారిలో పెట్టడానికి ఆమె



చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి.

సరళ పరిస్థితి చూసి జాలిపడిన ఆమె తండ్రి క్రిష్ణన్ ఫర్నీచర్ అమ్మే దుకాణాన్నొకదాన్ని తెరచి ఆత్మానందాన్ని భాగస్వామిగా తీసుకున్నాడు. వ్యాపారం త్వరలోనే అభివృద్ధిచెంది విపరీతమైన లాభాలు రాసాగాయి. అయితే ఆత్మానందన్ పతనం కూడా పరాకాష్టకు చేరుకుంది. క్రమంగా మధువే కాకుండా మగువలకు కూడా అలవాటుపడ్డాడతను.

ఇదిలా వుండగా 1981 సెప్టెంబరు 21న సరళ మగపిల్లవాణ్ని ప్రసవించింది. కొడుకు పుట్టాక కూడా ఆత్మానందన్‌లో కించిత్తు కూడా మార్పు రాలేదు. పైగా సరళను కొట్టడం, తిట్టడం ప్రారంభించాడు. అడపాదడపా చిత్రహింసలకు గురిచేసేవాడు. ఆ పరిస్థితుల్లో వాళ్ళు సరళ పుట్టింట్లోనే వుంటున్నారు.

భర్త ప్రవర్తన తల్లిదండ్రులకు తెలియకుండా వుండడానికి వారినుండి దూరంగా వుండాలని నిర్ణయించుకొంది సరళ. తండ్రి దగ్గర డబ్బు అప్పుగా తీసుకొని అక్కడే ఓ ఫ్లాట్ కొన్నదామె. 1983 ఫిబ్రవరి 2న సరళ ఆత్మానందన్‌లు కొత్తింటికి మారిపోయారు.

1986 మార్చ్ 4న ఉదయాన్నే ఆఫీసుకు బయల్దేరుతున్న ఆత్మానందన్‌కి ఆ రోజు తన పుట్టినరోజన్న విషయం గుర్తుచేస్తూ, "ఈ రోజయినా ఇంటికి త్వరగా వస్తారుగా? సాయంకాలం షాపింగ్‌చేసుకొని సినిమాకెళదాం" అంది సరళ. జవాబేమీ ఇవ్వకుండా

వెళ్ళిపోయాడు ఆత్మానందన్.

ఆ రోజంతా ఆత్మానందన్ కోసం ఎదురు చూస్తూ గడిపింది సరళ. రాత్రి భోజనానికైనా వస్తాడేమోనని ఆశతో ఎదురుచూసింది. రాత్రి పది కావస్తుండగా తలుపులపై ఎవరో కొడుతున్న చప్పుడైంది.

అన్యమనస్కంగా వున్న సరళ భర్తే వచ్చాడనుకొని వెళ్ళి తలుపులు తీసి లోపలికొస్తూ, "ఈ రోజైనా ఇంటికి త్వరగా రావాలనే ఆలోచన కలగలేదా మీకు? ఇలా అయితే రేపటినుండి ఇంక నేను తలుపులు తీయను" అని వెనక్కి తిరిగి చూసి స్థాణువయ్యింది. వచ్చింది ఆమె తండ్రి క్రిష్ణన్, చెల్లెలు చంద్రిక. ఉబికి వస్తున్న దుఃఖాన్ని ఆపడానికి ప్రయత్నించి విఫలురాలైంది సరళ. క్రిష్ణన్ కూతురి పరిస్థితి అర్థంచేసుకొని, "పుట్టిన రోజు శుభాకాంక్షలు తెలపడానికి వచ్చానని" చెప్పి బాధపడుతూ వెంటనే వెళ్ళిపోయాడు.

అర్ధరాత్రి పన్నెండు గంటలకి స్పృహలేని స్థితిలో ఇల్లుచేరాడు ఆత్మానందన్. ఓపిక నశించిన సరళ పెద్దగా అరుస్తూ, "ఈ రోజైనా త్వరగా వస్తారని ఆశపడ్డాను. అయినా మీకు నాకంటే ఆ తాగుడే ఎక్కువైంది. నా గురించి, నా బిడ్డ గురించి అసలు ఆలోచించడం లేదు. మా నాన్న అండవల్ల డబ్బుకేలోటూ లేకుండా వుంది. ఆ విషయం గుర్తుంచుకోండి" అంది ఆవేశంగా.

సరళ మాటలకి ఆత్మానందన్ కొద్దిసేపు వరకు ఏ జవాబూ ఇవ్వలేదు. ఆ తరువాత సరళను భోజనం వడ్డించమని అడిగాడు. సరళ తన అయిష్టతను తెలిపింది. అది సహించలేని ఆత్మానందన్ సరళ చెంపపై చాచి ఒక్క దెబ్బ వేశాడు. ఆ దెబ్బకి సరళ వెళ్ళి పక్కనే వున్న మంచంపై పడింది. ఏడవడం మరచిపోయి తిరస్కారంగా అతనివైపు చూస్తూ వుండిపోయిందామె.

సరళ మౌనం అతన్ని పిచ్చివాణ్ణి చేసింది. ఆ ఆవేశంలో తన నైట్ డ్రస్సుకు వ్రేలాడుతున్న తాడును తీసి ఆమె గొంతుకు బిగించి కట్టాడు. అరుస్తున్న ఆమె నోట్లో జాకెట్టును కుక్కాడు. కొద్ది క్షణాల్లోనే సరళ ప్రాణాలు విడిచింది.

కోపం చల్లారిన తరువాత తను చేసిన తప్పు తెలుసుకున్నాడు ఆత్మానందన్. బయటికి వచ్చి ఆటో కేకేసి సరళను దగ్గరలో వున్న ఆసుపత్రికి తీసికెళ్లాడు.

సరళను ఆత్మానందనే హత్యచేశాడని రుజువు కావడంతో, సెక్షన్ 302 కింద అతన్ని అరెస్టుచేసి తీసికెళ్ళారు పోలీసులు.

## గాలానికందని సొరచేప

"నేను ఎన్నడూ బ్యాంకులకు వెళ్ళి అప్పు కోసం ప్రయత్నించలేదు. నా దగ్గరకే ఒక బ్యాంకు మేనేజర్ వచ్చి, అప్పులు తీసుకునే మార్గం చెబుతానన్నాడు. అందుకు తనకు కొంత కమీషన్ ఇస్తే చాలునన్నాడు" అని ప్రకటించాడు రాబిన్. లంచాలూ, కమీషన్లూ తీసుకుని అప్పులు ఇచ్చే, ఇప్పించే బ్యాంకు సిబ్బంది గురించి పేపర్లలో చదివేవాళ్లకు ఇదేమంత విచిత్రంగా అనిపించదు. కానీ ఇలా రాబిన్ తీసుకున్న అప్పులు ఒకకోటి రూపాయలపైన వున్నాయనీ, ఆ అప్పులన్నీ లారీలు కొనుక్కోవటం కోసమని చెప్పి తీసుకున్న రాబిన్ దగ్గర మూడు తుక్కులారీలు మాత్రమే వున్నాయనీ తెలిసినప్పుడు మాత్రం కొంత ఆశ్చర్యం కలుగకమానదు. అతని కేసుకు సంబంధించిన అసలు విషయాలు విన్నప్పుడు ప్రారంభమవుతుంది దిగ్భ్రాంతి.

రాబిన్ ఓ వంచనాశిల్పి అని చెప్పుకోవచ్చు. ఇతను ఒక బ్యాంకును, ఒకసారి కాదు, అనేక బ్యాంకులను కనీసం 50 సార్లు మోసం చేశాడు. ఆవిధంగా ఒక్కొక్క బ్యాంకునుండి కనీసం ఒకలక్షా 50వేల లెక్కన కోటిరూపాయల పైగానే సొమ్ము చేజిక్కించుకున్నాడు. అతనికి సహాయం చేసిన బ్యాంకు మేనేజర్ ఎవరో అతనికి కొంత మొత్తం వాటా ఇచ్చి





వుంటాడు. దొంగ రిజిస్ట్రేషన్ పుస్తకాలను పుట్టించటంలో కొంత ఖర్చు చేసివుంటాడు. రాబిన్ మోసాలు బైటపడిన తరవాత తమిళ నాడు రాష్ట్ర రోడ్డురవాణా విభాగపు ఉన్నతాధి కారి ఆర్. మాణిక్యమ్‌తోపాటు, మరో 12 మంది అధికారులను సస్పెండ్ చేసింది ప్రభుత్వం. అదే సమయంలో తమిళనాడు కేబినెట్‌లో మంత్రిగా వున్న కె. కాలిముత్తు అనే మంత్రిదీ, ఈ ఆర్. మాణిక్యమ్‌దీ ఒకే ఊరు. అంతేకాదు రాబిన్ దొంగ లోన్‌ల విషయం బైటపడిన వెంటనే రాబిన్‌తో లావాదేవీల విషయంలో జాగ్రత్తగా వుండవలసిందిగా అన్ని బ్యాంకుల నూ హెచ్చరిస్తూ బ్యాంకర్స్ క్లబ్ సర్క్యులర్ జారీ చేసినందుకుగానూ తీవ్ర పరిణామాలు ఎదు



ర్కోవలసి వుంటుందనీ బ్యాంకర్స్ క్లబ్ చెయి ర్మన్‌నే మంత్రి కాలిముత్తు స్వయంగా బెది రించాడని ఆరోపణ వుంది.

కేరళకు చెందిన రాబిన్, ప్రఖ్యాత గాయకు డు జేసుదాసు తనకు మంచి మిత్రుడని చెప్పుకున్నాడు. ఆయన ఇంట్లోనే, మిస్ కేర ళగా ఎన్నికైన మంజుల అనే అందగత్తెతో తనకు పరిచయమయిందని అన్నాడు రాబిన్. తనతోపాటు మంజుల కూడా కాలిముత్తుకు స్నేహితురాలనీ కాలిముత్తు ప్రొఫెసర్‌గా వున్న కాలంనుండే తన స్నేహితుడనీ, తనను అన్నా డి.ఎం.కె. పార్టీలోకి తీసుకొచ్చింది అతనేననీ, తాను ఇంకా ఆ పార్టీలోనే వున్నాననీ, అన్నాడు రాబిన్. కాలేజీరోజుల్లో కాంగ్రెస్ కార్యకర్తగా వున్న రాబిన్, ఆ తరవాత కమ్యూనిస్టుగా మారాడు. ''నేను నక్సలైట్‌గా కూడా పనిచేశా ను. భూమిలేని పేదలకు సహాయం చేయా లనే నా సిద్ధాంతమే నన్నీ కుంభకోణంలో పాలుపంచుకునేలా చేసింది. ఈ కుంభకోణాని కి అసలు బాధ్యులు నాకా సిద్ధాంతాలు బోధించిన గురువులే'' అన్నాడు రాబిన్. ఆ గురువులు అతన్ని ఈ పద్ధతిలో బ్యాంకులు దోచుకోమని చెప్పారా తను దోచుకున్న లక్ష లాది రూపాయల్లో పేదప్రజలకు ఎంతవరకూ అందించాడు- లాంటి ప్రశ్నలకు సరైన సమా ధానాలు మాత్రం రాబిన్ దగ్గర లేవు.

రాబిన్ చాలా తెలివైనవాడు, చురుకైనవా డు. మంచి మాటకారి. హుందాగా డ్రెస్ చేసు కుని, పెద్ద కోటీశ్వరుడి వారసుడిలా నటించి, నమ్మించటంలో అందెవేసిన చేయి. కాలిము త్తు సహాయంతో ప్రభుత్వానికి చెందిన లక్ష లాది రూపాయలను బ్యాంకులకు డిపాజి ట్లుగా ఇప్పించి, అధికారుల మంచితనానికి పాత్రుడయ్యాడు. మరిన్ని పెద్ద డిపాజిట్లు ఇప్పిస్తాననే వాగ్దానంతో అప్పులు తీసుకున్నా



డు. ఈ దొంగరుణాలలో కూడా అన్నీ తన పేరుతోనే కాకుండా కొన్ని తన అనుచరుల పేర్లతో కూడా తీసుకున్నాడు. చివరకు వాటికి మూలమైన ఆర్.సి. పుస్తకాలన్నీ బోగస్‌వని తేలింది.

రాబిన్ చేసిన నేరాలలో మంజులకు కూడా భాగస్వామ్యముందా అన్నది తెలియదు. కానీ మంజుల గురించి చాలా గొప్పగా చెబుతుంటాడు. అంతకుముందు తను ప్రారంభించిన అనేక వ్యాపారాలలో నష్టాలు రావటంతో, అప్పులవాళ్ళకు ముఖం చూపించలేక తొమ్మిది నెలలపాటు నేపాల్‌లో దాక్కుని, తిరిగి మద్రాస్ వచ్చినప్పుడు కూడా, అంతటి నిస్సహాయస్థితిలో కూడా, తమ ప్రేమను మరిచిపోని మంజుల తనను పెళ్ళి చేసుకోవటానికి అంగీకరించిందని చెబుతాడు. అయితే, తన అపరాధాలలో నాటి మంత్రి కాలిముత్తుకు ఎలాంటి భాగస్వామ్యమూ లేదని మాత్రం రాబిన్ చెప్పాడు. అయితే చాలామందికి ఈ మాటల్లో విశ్వాసంలేదు.

బ్యాంకు లోన్‌లకోసం దొంగ ఆర్.సి. బుక్కులు పుట్టించటమే కాకుండా దొంగపాస్‌పోర్ట్‌లు, తప్పుడు వీసాలు పుట్టించటం లాంటి నేరాల మీద కూడా రాబిన్‌పైన ఆరోపణలు వచ్చాయి. స్విట్జర్లాండ్, సింగపూర్, ఫ్రాన్స్, డెన్మార్క్, పోర్చుగల్‌లాంటి విదేశాలకు వెళ్ళగోరేవారి దగ్గరనుండి మనిషికి 12 వేల రూపాయల వంతున వసూలు చేసేవాడట. వీళ్లను మద్రాస్‌నుండి కాక కలకత్తా, బొంబాయిలాంటి ఇతర ఎయిర్‌పోర్ట్‌ల నుండి పంపించేవాడు. ఈ విషయాలన్నీ అతని అనుచరుడు దివాకరన్ అనే అతను చూసుకునేవాడు. పాల్‌జై సింగ్ అనేవ్యక్తి, విదేశాలకు వెళ్ళే అనుమతిపత్రాల కోసం రాబిన్, దివాకరన్‌లకు 75 వేల రూపాయలు ఇచ్చాడు. కానీ, నకిలీ పాస్‌పోర్ట్‌తో ప్రయాణిస్తున్న అభియోగంపై అతన్ని హాంగ్ కాంగ్ ఎయిర్‌పోర్ట్ అధికారులు నిలిపివేశారు. ఆ పాల్‌జైసింగ్ చేసిన ఫిర్యాదుపై ఆధారపడి రాబిన్‌తోపాటు దివాకరన్‌పైన కూడా కేసు బుక్ చేశారు అధికారులు.

రాబిన్‌పైన బ్యాంకు మేనేజర్లు ఫిర్యాదు చేయటంతో సి.బి.ఐ. రంగంలోకి దిగింది. ఈ కేసులో రాబిన్‌తోపాటు మంత్రి కాలిముత్తుకు సంబంధం వుండవచ్చునన్న అనుమానాలు సి.బి.ఐ. వ్యక్తం చేయగానే కాలిముత్తు తీవ్రంగా ప్రతిస్పందించాడు. అప్పుడు కేంద్రంలో అధికారంలో వున్న కాంగ్రెస్-ఐ ప్రభుత్వంపై విరుచుకుపడ్డాడు. ''సి.బి.ఐ. నన్ను ఏ క్షణంలోనైనా అరెస్ట్ చేయవచ్చు. నేను కాంగీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రవర్తించినందుకు ప్రతీకారంతో, నాపై పగతీర్చుకోవటానికి సి.బి.ఐ.కి ఆదేశాలిచ్చారు కాంగ్రెస్ వారు'' అని ఆరోపించాడు కాలిముత్తు.

సి.బి.ఐ. అధికారులు రాబిన్‌ను అరెస్ట్‌చేసి మద్రాస్ ఫ్లవర్‌మార్కెట్ పోలీస్‌స్టేషన్‌లో పడేశారు. ఆ పోలీస్‌స్టేషన్‌కు నాటి తమిళనాడు ముఖ్యమంత్రి ఎం.జి.రామచంద్రన్ స్వయంగా వెళ్ళాడని కొన్ని పత్రికల కథనం. తనను లాకప్‌లో పెట్టిన వారెవరో చెప్పమని రాబిన్‌నే స్వయంగా అడిగాడనీ, డ్యూటీలో వున్న ఇన్‌స్పెక్టర్, ఆ విషయంలో తన బాధ్యతేమీ లేదనీ, అది కేంద్ర సి.బి.ఐ. వారికి సంబంధించినదనీ బదులివ్వగా, కోపోద్రిక్తుడైన ఎమ్.జి.ఆర్. ఆ ఇన్‌స్పెక్టర్‌ని ఈడ్చి చెంపమీద కొట్టాడని కొన్ని పత్రికల ఆరోపణ. అయితే, సి.బి.ఐ. విచారణ పూర్తవకుండానే రాబిన్ బెయిల్‌మీద విడుదలై బైటికొచ్చాడు. ధనికుల్ని దోచి పేదలను ఆదుకున్న రాబిన్‌సన్ క్రూసోలాంటివాడిగా చెప్పుకున్న రాబిన్ కొల్లగొట్టిన ధనంలో పేదవాళ్లకు వాటా ఇచ్చాడో లేదో కానీ అతని నేరాల్లో మాత్రం చాలా పెద్దవాళ్ళకు భాగస్వామ్యం వున్నదని ప్రజలకు అర్థమయింది. ప్రజలకు అర్థమైన విషయాలు ఎన్నున్నా, వాటికి తెరదించనంతకాలం రాబిన్‌లు తెరదిగకుండా నేరాలు ఎడతెరిపిలేకుండా చేస్తూనే వుంటారు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

CHATURA Telugu Monthly Hyderabad-500 482 Regd. No. H/HD/40